శ్రీకృష్ణదేవరాయాంధ్ర

పద్యకావ్యము

ఆధునిక

సంఖ్య............

చరిత్రయుఁ

పీఠికాపురోన్నత పాఠశాలాప్ర
ధానోపాధ్యాయుఁడగు
కూచి నరసింహము చేఁ
దెలుఁగునఁబద్యరూపముగ
రచియింపఁబడినవి.

శ్రీరామకృష్ణపరమహంస

రెండవకూర్పు 500 ప్రతులు.

పిఠాపురమునందలి
శ్రీవిద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షర
శాలయందు ముద్రితమై ప్రకటింపఁబడియె.

# PREFACE

It had been my long-cherished wish to put into Telugu verse the life and teachings of the great modern Hindu sage–Sri Ramakrishna Paramahamsa–from whom Swami Vivekananda received his inspiration and those gems of religious truths, which he sowed broadcast in the remote continents of America and Europe. This great teacher, the wonder of the age, has proved by example and precept that the ideals of the Aryan religion, such as the perfection of the human soul, are not the mere sweet fancies of idle brains recorded in books, but matters of possibility capable of attainment by firm will, under efficient guidance.

Not to speak of the thousands of disciples he has at present all over India, his admirers are found even among the great Western thinkers and scholars like Prof. Max Muller. His teachings breathe a unique spirit of toleration and proclaim the oneness of all religions as means of salvation, divested of their accretions and excrescences. He has propounded no new doctrines. There is, in fact, no unexplored land in the region of philosophical thought. The peculiar charm of his teachings lies in the employment of the most felicitous comparisons drawn from common life, and the short illustrative stories, introduced to drive deep the sublime truths of philosophy into the mind of the willing student.

Mothers feed their children, telling them all sorts of nice stories; the child hears the story with rapt attention; but swallows the while, all unconsciously, the small mor-

sels of food which nourish its body. The Paramahamsa has done the same. His interesting similes and humorous anecdotes attract the reader, and the truths they are brought to illustrate, imperceptibly leave their impression on the reader's mind, to its immense benefit. When we read some of the teachings, we instinctively feel that they have come, not second hand, but direct from one, who has realised from self-experience the truth of what he has said.

Another great merit of the work is that it contains truths, adapted to men of all grades of spiritual capacity in this world, so that a superficial observer will sometimes be inclined to lay the charge of self-contradiction on the holy sage.

In the life of every man, I think, there will be moments, when he feels tired of the unceasing bread-and butter activity of the times and the frantic pursuit of power and pelf, name and fame ;and stands in sore need of a book like this, which raises him, for the time being at least, from the thought of lower pleasures and mundane disturbances into the serene atmosphere of the blissful contemplation of the One Great Being—the near but distant Goal, Which all of us have to reach sooner or later, freed from all the "evils, flesh is heir to".

Some years back, when I was the Head-master of the Taylor High School, Narsapur, I versified a hundred and odd of the Paramahamsa's sayings from the Journal 'Brahmavadin' in which they were published. Now I have been able to complete the work with the help of the valuable prose version of the sage's life and teachings by Sri K. R. V. Krishnarao Bahadur Garu, B. A., Zamindar of Polavaram, who has kindly given me permission

through the Manager of the 'Saraswati,' to do my metrical translation, for which my grateful thanks are due to him.

For the convenience of the reader, I have classified the teachings under different heads.

The author of the sayings is a great sage, reputed to have enjoyed the direct vision of the One True God; and the sayings are replete with wisdom calculated to purify, perfect and emancipate the soul of the earnest aspirant. I am therefore confident, that these will more than cover the many imperfections of my translation and make it acceptable to the indulgent public.

1904 KUCHI NARASIMHAM.

ఈసద్గ్రంథమును బద్యరూపకముగఁ జేయుటలోఁ గొన్నిచోట్ల సందర్భానుసారముగఁ దాత్పర్యమునుమాత్రము గైకొని సంక్షేపము గానుఁ గొన్నిపట్ల విస్తృతముగాను వ్రాసితిని. శేషశకటరేఫములను యథేచ్ఛముగ యతులయందును బ్రాసములయందును గలిపితిని. ఇంచుగాగమయతియు సంగీకరించి యక్కడక్కడ నుపయోగపఱచితిని. ప్రథమప్రయత్నమగుటచే నీగ్రంథమందు లోపములుండవచ్చును. వాని దయతో హేతుపూర్వముగ నెవ్వరైన నగపఱచిన, వారలకు వందనములిడి, రెండవకూర్పునందు వానిని సవరించుకొనెదను.

1904 కూచి నరసింహము.

ప్రథమముద్రణమున వేయించిన 1000 ప్రతు లయిపోయినందువలనను, విద్యాధికులైన పెక్కురు మిత్రులు పుస్తకము బాగుగానున్నదని యభిప్రాయములు వ్రాసిపంపుటచేతను రెండవసారి దీనిని ముద్రింపఁ బూనితిని. అధికారులు పాఠశాలాగ్రంథసమితిలో నిది చేర్పవచ్చునని యుత్తరువిచ్చినారు.

యుద్ధకారణమునఁ గాకితములు ప్రియముగానుండుటచే, నిప్పుడు 500 ప్రతులుమాత్రమే తీయించుచున్నాను.

వెనుకటికూర్పునందలి కొన్నిలోపములు సవరించి వ్రాయుటయేకాక, యిందుఁ గ్రొత్తగా లభించిన శ్రీపరమహంసబోధములు గొన్ని తెలిఁగించి యాదనముగాఁ జేర్చినాను. కనుకఁ జదువువారి కిది మొదటికూర్పుకంటె నెక్కువ తుష్టికరముగా నుండవచ్చును.

1917 కూచి నరసింహము.



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీరామకృష్ణపరమహంసచరిత్రము.

ఉ. శ్రీలలనామణిన్, హృదయ♦సీమను దాల్చి, చరాచరంబులన్
బాలనసేయను, భక్తజన♦వర్గముఁ బ్రోవ, నిశాచరాళి ను
న్మూలముసేయ, నుద్భవముఁ♦బొందిన నీలశుభాంగుఁ, డవ్యయుం,
డేలిక యైన రాముఁ, డొన♦రించుత మత్కృతియత్నసిద్ధులన్. 1

ఆ.వె. చిన్ననాఁటనుండి ♦ చేయంగ గ్రంథముల్
కోర్కె యెందు శక్తి ♦ కొంచెమైన,
శ్రద్ధ నూని చేయఁ♦జాలనైతిని గొన్ని
యంతరాయములను ♦ నింతవఱకు. 2

సీ. ఇంటికి దూరమై ♦ యిచ్చోట నచ్చోట
నుద్యోగవశమున ♦ నుండియుండి,
గృహభారవహనసం♦క్లేశంబుచేఁ జిత్త
విశ్రాంతిఁ గనలేక ♦ విసిగివిసిగి,
కనిపెంచినట్టివా♦రిని దోడితమ్ములఁ
గోల్పోయి వెతచేతఁ ♦ గుందికుంది,
చింతలచే రుజా♦క్రాంతుఁడనై చాల
గాసిలి సౌఖ్యంబు ♦ వాసివాసి,

తే.గీ. శ్రీపతికటాక్షమున నిల్లు ♦ సేరఁ గంటి,
నింతకాలంబునకు వంత ♦ లంతరించె,
నన్నవస్త్రంబు లిడి ప్రోచి ♦ నట్టి ప్రభుల
ప్రాపు సోదరసంగతి ♦ ప్రాప్తమయ్యె. 3

ఉ. స్నానము చేయఁ బోవుచును ♦ సాగరమండలితుంగభంగముల్
మానిన దాఁకఁ గ్రుంకి నను ♦ మానిసిపోల్కి, శ్రమంబులన్నియున్
మానినఁ గాని గ్రంథము నొ♦నర్పఁగఁ జూననటంచు వెట్టినై
పూనక యుండునే, శ్రమము ♦ పోవునె యేండ్లకొలంది చేసినన్? 4

సీ. మాణిక్యమకుటంబు ♦ మౌళిపైఁ దులకింప
రాజ్యంబు నేలెడు ♦ రాజు కంటె,
లలితలావణ్యవి ♦ లాసినీవక్షోజ
పరిరంభసౌఖ్యాను ♦ భవుని కంటె,
సతతంబు నానంద ♦ సాతాబ్ధిలోఁ దోఁగు
భర్మహర్మ్యస్థసం ♦ పన్ను కంటె,
ధనవయోరూపసం ♦ తానాదిభాగ్యాళిఁ
దనరిసంతుష్టుఁడౌ ♦ ధన్యు కంటె,

తే.గీ. మధురమృదువాక్యసంపద ♦ మనసుఁ గరఁచు
కవిత యబ్బిన కవియె యొ♦క్కువ యటంచు
నెంచెదరు గానఁ, దత్సుఖ ♦ మెంతసుఖమొ
స్వానుభవమునఁ గనుఁగొనఁ ♦ బూనవలదె? 5

తే.గీ. వెంటనే స్వకపోలక♦ల్పితములైన
కబ్బములు సేయ సాధ్యంబు ♦ కాదొ యౌనొ
యనెడు శంకచేఁ బద్యకా♦వ్యంబు రీతి
నితరచరితంబు వ్రాయంగ ♦ నెంచినాఁడ. 6

సీ. ఎవ్వాని విజ్ఞాన ♦ మేఁచు నవిద్యాంధ
కారంబునకు సూర్య ♦ కాంతి యయ్యె,
నెవని బోధనముల ♦ నెందఱో సంసార
[illegible]వార్ధిఁ దరియించి ♦ తుష్టినొంది,

రెవ్వని ప్రియశిష్యుఁ ◆ డేగి వేదమతాధి
తత్త్వంబు సాటించెఁ ◆ గడల నెల్ల,
సేవాని చర్యలు ◆ హితములౌ సూక్తులుఁ
గర్ణపేయంబులై ◆ కానిపించు,

తే.గీ. నట్టి శ్రీరామకృష్ణపూ ◆ తాభిధాన
కలితుఁడు, పరమహంసుఁడీ ◆ కథకుమూల;
మతని చరితయు బోధంబు ◆ లతివిచిత్ర
ములును సుజ్ఞానదాయక ◆ ములును జుండి. 7

కం. ఈయన పూతచరిత్రము
సేయఁగఁ బద్యాత్మకముగఁ, ◆ జేకూఱునుగా
తూయుతకవితానందముఁ,
బాయని సన్మనజన్య ◆ భవ్యసుఖంబుల్. 8

శా. పూతంబౌ నలరామకృష్ణసువచః ◆ పుంజంబు వర్ణింపనా
చేతంగాదని చెప్ప మానుదునె? నా ◆ చేత న్మహాయోగివా
గ్జాతంబు ల్గొలఁ జెందునే? సరసత ◆ న్గల్పించు మద్వాణికిన్.
స్ఫీతామోదదమైన కప్పురము దా ◆ విన్గొల్పదే పేటికిన్? 9

మ. కలికాలంబున మానవుండు బ్రతుకం ◆ గాఁగల్గు సంవత్సరం
బులలో నర్ధము భుక్తమయ్యెఁ; గలుగం ◆ బోదయ్యె సంతాన;మీ
యిలలోఁ బేరు తిరంబుగా నిలువ నే ◆ ద్దేనిట్టిగ్రంథంబుఁ జే
సి, లసత్కీర్తివహింప, నాకు జనియిం ◆ చెన్గోర్కి డెందంబునన్.

ఆ.వె. సంతు లేదటంచుఁ ◆ జింత నొందుటె కాని,
కల్గు వెన్క సంత ◆ కంటెఁ జింత.
కన్నెమైనఁ, దగిన ◆ కాంతుని వెదకంగఁ
దండ్రి పడెడు పాట్లు ◆ తరమె చెప్ప? 11

తే.గీ. ఇట్టి వ్యాకులతమె నన్నుఁ ♦ బట్టుకతనఁ,
గష్టపడి కన్న నా పేద ♦ కావ్యకన్య,
నెవరి కిచ్చిన మే? లంచు ♦ నెంచి యెంచి,
తుదకు దృఢనిశ్చయుండనై ♦ తుష్టిఁ గంటి. 12
సీ. ఇనకులసంభవుం, ♦ డిద్ధచారిత్రుండు,
కమనీయగాత్రుండు, ♦ కమ్రయశుండు,
నవని రక్షింపఁగా ♦ నవతరించిన దేవుఁ,
డార్తశరణ్యుండు, ♦ నమితబలుఁడు,
కలలోననైన బొం ♦ కని సత్యసంధుండు,
ధర్మసంవర్ధన ♦ తత్పరుండు,
తండ్రి యానల కెల్లఁ ♦ దల యొగ్గు సౌమ్యుండు,
కామితార్థము లిచ్చు ♦ కల్పతరువు,
తే.గీ. విదితగుణుఁ డైన శ్రీరామ ♦ విభుఁడు గాక
యొగుదు రెవ్వారు కన్యకుఁ ♦ దగిన వరు? ల
టంచు నేనెంచి యాయన ♦ కంకితముగ
నీకృతి నొసంగి పడసెద ♦ నీప్సితములు. 13
కం. రామా, సుగుణస్తోమా,
కామాదివికారదూర ♦ ఘటితాస్తోక
ప్రేమా, రఘుకులసోమా,
నా మనవుల నాలకించి ♦ ననుఁ గృపఁ గనుమా. 14
సీ. యాజ్ఞవల్క్యమహర్షి ♦ యన్వయాచార్యుండు,
శుక్లయాజుషమహీ ♦ సురుఁడఁ, గూచి
వంశోద్భవుండ, వి ♦ ప్రశ్రేష్ఠుఁడౌ వెంక
నార్యుండు నాతండ్రి. ♦ యాతని యువర

జాలు రామయామాత్యుండు ♦ సుబ్బయామాత్యుండును
భ్రాతృభక్తికిఁ బేరు ♦ వడిన వారు,
కలియుగసావిత్రి ♦ కాంతాశిరోమణి
పుల్లమాంబ సుశీల ♦ తల్లి నాకు,
తే.గీ. నందయును నన్ను నరసింహ ♦ మంత్రి, కవిత
యందు నాసక్తిఁ బుట్టించి ♦ నట్టి గురుఁడు
కందుకూరి వీరేశలిం ♦ గకవిమౌళి.
స్థితిగతుల నీకు విన్నవిం ♦ చితిని రామ! 15
తే.గీ ఇంచు కాంగ్లేయభాషతోఁ ♦ గృషిని జేసి,
పొట్టపోసికొని కుటుంబ ♦ పోషణంబుఁ
జేయుచున్నాఁడ; నిది యంత ♦ చెప్ప నీకు,
నవ్వెదవా యేమొ సర్వజ్ఞ ♦ నన్నుఁ జూచి? 16
కం. నాకృతికన్యారత్నము
నీకుం బరిణయ మొనర్తు ♦ నిశ్చయ; మింక
న్నాకులము పావనం బగు
నీకృప, భవదంఘ్రిపద్మ ♦ సేవావాప్తిన్. 17
తే.గీ. ఏకపత్నీవ్రతుండవ, నే ♦ నెట్లు గొందు
నొండు కాంతను బ్రహ్మసుత ♦ యుండ? నచ్చుఁ
గొంకకుమ; యష్టభార్యలు ♦ గోలిచి యుండఁ
దనరవే నీవు కృష్ణావ ♦ తారమందు? 18
సీ. చిన్నారిపొన్నారి ♦ చిన్నెలు గల కన్నె,
వన్నె కెక్కిన గుణ ♦ వంతురాలు,
మానవతీమణి, ♦ మర్యాదగలచాన,
ప్రౌఢ గాదిది ముద్ద ♦ రాలు గాని,

సగనాణెములు లేవు ♦ నాతి, కిప్పటి కేక
పుత్రిక గాన నా ♦ ముద్దుబిడ్డ,
రామకృష్ణా! యను ♦ రవముతో సతతంబు
వలపు నీమీఁదనే ♦ నిలుపుకొనియెఁ;
తే.గీ. గాన దీనిని గ్రహియించి ♦ కమలనయన!
నన్నుఁ దరియింపఁ జేయుమీ! ♦ కన్నె కేమి
యరణ మీయంగలేను, గ ♦ టాక్ష ముంచి
కృతిపతివి గమ్ము! నాకు స ♦ త్కీర్తిఁ దెమ్ము! 19
మ. చలుపంబోను సతుల్యథావిధి సరో♦జాతోద్భవుం డాదిగాఁ
గల దేవాళికి వారికాంతలకు; ప్రొ♦క్కంబోను సంస్తుత్యవా
గ్విలసత్ప్రీథకవీంద్రబృందమునకు; ♦ న్వేయేల? సర్వాత్మకుం
డల శ్రీరాముఁడు; వాని కేఁ బ్రణతి సే ♦ యన్నార్వముద్దప్తమా.
వ. కృత్యాదిప్రశంస యిటతటితోఁ జాలించి, లోకాతీతుండు, ననన్య
లభ్యనిస్తులబ్రహ్మానందుండును, విదితశ్రీపరమహంసాంకుండును,
సార్థకరామకృష్ణాభిధానుండు, నగునమ్మహానుభావుచరిత్రంబు సం
గ్రహంబుగా నిట్లు నుడివెద. 21

---

## క థా ప్రా రం భ ము.



సీ. ఆంగ్లేయశకమునం ♦ దష్టాదశశతాబ్ద
ములుదాఁటి ముప్పది ♦ పోవువెన్క,
మూఁడవ హాయనం ♦ బునను, రెండవ మాస
మున, నిర్వదవ దినం ♦ బున, నుదీచి,

వంగదేశంబున ♦ వఱలెడు ♦ హుగ్లిమం

డంబున, వర్ధమా ♦ నంబు పొంతఁ,

గమ్మను లెస్త్రదుగాఁ ♦ గలిగిన కతమునఁ

గర్త్రకారకనామ ♦ కలిత మైన

తే.గీ. పల్లె లోపల, జగదేక ♦ వంద్యుఁ డైన

రామకృష్ణుండు, యోగ్యవి ♦ ప్రకుల మందుఁ,

దల్లిదండ్రులు చేసిన ♦ తపము పంట,

పుట్టె దుగ్ధాబ్ధిఁ జంద్రుండు ♦ పుట్టినట్లు. 22

తే.గీ. ఇతని జనకుండు ఖుదిరామ ♦ చతురుఁ డనఁగఁ

దనరు; జననీమతల్లి చం ♦ ద్రమణిదేవి;

వారు గుణవంతు లనిచెప్ప ♦ వలెనె వేఱ?

ముసిఁడిచెట్లనుజాతంబు ♦ పుట్టు నెట్లు? 23

కం. ఖుదిరామచతురుఁ డాజన

పదమున నొక్కండె గలఁడు ♦ బ్రాహ్మణుఁ డరుదై;

విదితోపాధ్యాయుం డని

పదిమంది వచింతు రతని ♦ పైఁ గలభక్తిన్. 24

తే.గీ. అతని శాంతియు, దాంతియు, ♦ నతనిదైవ

భక్తియును, భూతదయయు, న ♦ పారమైన

సుగుణజాలంబు, స్వయముగాఁ ♦ జూడవలెను

గాని, శక్యంబె చెప్ప నె ♦ వ్వానికైన? 25

మ. ఒకనాఁ డాతఁడు తీర్థయాత్రచనఁగా ♦ నుంకించి, గ్రామంబు వా

సి, కనత్పావనవిష్ణుపాదయుగళ ♦ శ్రీమోక్షసంధాత్రి యై

ప్రకటంబౌ గయ కేగి, దేవుఁ గనిత ♦ త్పాదాబ్జము ల్పూజచే

సి, కడునామోదము నొంది, రాత్రినిదుర ♦ జెందంగ, నాసుప్తిలోన్,

కం. కలఁగనె గదాధరుఁడు దన
పొలఁతి యుదరమునను జొచ్చి ♦ పుత్రాకృతిగాఁ
గులమంతయుఁ దరియింపఁగఁ
గలిగె నని, మనంబు మిగులఁ ♦ గౌతుకమందన్. 27

చ. కులసతి వేఁకటిం దెలిసి, ♦ కోరిక లీరిక లెత్త నారిలో
పల నివసించి యుండెఁ, దన ♦ వాక్పరిశుద్ధికిఁ జిత్తశుద్ధికిన్
దెలివికి నీడు లేదను ప్ర ♦ తీతిని గాంచుచు విప్రవర్యుఁ; డే
పలుకు లతండు పల్కె, నవి ♦ పల్కిన వెంట ఫలం బొసంగెడున్.

చ. అమలచరిత్రి చంద్రమణి ♦ యాతనికిన్ దగునట్టి సత్స్వభా
వముగల సాధ్వి, కాంతునెడ ♦ భక్తియుఁ బ్రేమయుఁ బొంగి పొర్ల, దై
వము పతికంటె లేదనుచుఁ ♦ బ్రాణము లాతని సొమ్మె యంచుఁ జి
త్తమునఁ దలంచు, నాటి గల ♦ దా పెఱకాంతల కామె కీభువిన్?

సీ. కొడుకైన రామకృ ♦ ష్ణుఁడు వేదవేదాంత
సారజ్ఞుఁడై తన ♦ రాఘ నపుడు,
పలువుర శిష్యులు ♦ ప్రజ్ఞానభిక్షకై
పోయి యాతనిచుట్టు ♦ మూఁగునపుడు,
భక్తవిశ్వాసముల్ ♦ ప్రబలి యాతని వారు
దైవతుల్యుండని ♦ తలఁచునపుడు,
తచ్ఛిష్యవితతిలో ♦ ధనవంతుఁ డగునట్టి
మధురనాథుండను ♦ మాన్యుఁ డొక్కఁ

తే.గీ. డమ్మ! నీకేమిగావలె? ♦ ననుచు భక్తి
నడుగ, నొకధూమపత్రంబు ♦ నడిగె నౌర!
యల్పసంతోష, దానిఁ దా ♦ నంది, యంతె
నింగినానందభరితాంత ♦ రంగ యాచు. 30

తే.గీ. మానిని యమాయకత్వంబు ♦ దీనివలన
నే కనుంగొనవచ్చు; నే ♦ యింతి యైన
నట్టి సమయంబు పొడకట్ట, ♦ నడుగకున్నె
రత్నకాంచనభూషణ ♦ రాజినెల్ల? 31

సీ. ప్రప్రథమము ఖుదీ ♦ రాముఁ డుండెడు చోటు
డేగియున్గ్రామ, మా ♦ యూరిలోనఁ
బితార్జితంబౌటఁ ♦ బ్రియ మైన స్వగృహమం
దతఁడుండ, నచటి గ్రా ♦ మాధికారి
యొకనాఁడు వ్యాజ్యంబు ♦ నకు వచ్చి యతని ప
క్షమ్మునఁ దప్పసా ♦ క్ష్యమ్ము నిమ్మ
టన్న, నొల్లకపోయి ♦ నంతనఁ, దన్నుగ్రా
మాధికారి దొడంగి ♦ యార్తి పెట్ట,
తే.గీ. నూరు విడనాడి యింకొక ♦ యూరు చేరఁ
గడఁగి, యాగ్రామమునకు వే ♦ కదలి వచ్చి,
ప్రోలి ధనికుల సాహాయ్య ♦ మునను దాను
శాంతతోఁగూడఁ గాలంబు ♦ గడపుచుండె. 32

క. చందనకర్పూరంబుల
చందంబున సతియుఁ బతియు ♦ సౌఖ్యోన్నతులై
యందుండి, రమలచేత
స్పందితదైవానురక్తి ♦ సాంద్రముగాఁగన్. 33
వ. ఒకనాఁడు. 34

ఆ.వె. కాంతుఁ జూడఁబోయి ♦ ఖుదిరామచతురుండు
మాఘఫాల్గునముల ♦ మధ్యమందు,
బిల్వదళము గాని ♦ పింపమి శివపూజ,
కుల్లమందుఁ జింత ♦ నొందుచుండి, 35

మ. కని మార్గంబున నొక్కచోట బహుశా ♦ ఖాపత్రసంకీర్ణపా
వనబిల్వావనిజంబుఁ, బొందుచును జె ♦ ప్పన్రానిమోదంబు, వ
చ్చినకార్యంబును బూర్తిగన్ మఱచి, యా ♦ చెట్టెక్కిపత్రంబులన్
గొని, గేహంబునకుం దన్మహేశ్వరుని దాఁ ♦ గొల్వంగ భక్తిం జనెన్.

ఆ.వె. కొలుచుశంభు నంచుఁ ♦ బలికిన మాత్రాన
విష్ణుపైని లేదు ♦ ప్రేమ యంచు
నెంచరాదు; జాన ♦ కీశుని భక్తితోఁ
బూజసేయు సమత ♦ బుద్ధి నుంచి. 37

ఉ. చిన్ని పొలంబు నార్జనము ♦ చేసి, విశేషపరిశ్రమంబునన్
దున్ని, రమేశ! నీవెసుమి ♦ తోడని గింజలు చల్లఁ, బ్రాంతమం
దున్న పొలంబు లన్నిటికి ♦ నోటమిఁ దెచ్చి ఫలించు; నిందుగాఁ
బున్నెము సేయువారి తలఁ ♦ పుల్లొటువేఱక రిత్తవోవునే? 38

ఆ.వె. పంటఁ గోసి తాను ♦ భార్యయు నతిథులు
చేరి కుడిచి తృప్తిఁ ♦ జెంది యుందు;
రనవరతము దైవ ♦ మును మనంబునఁ బెట్టు
కొనెడువారి కెట్టు ♦ వనట పుట్టు? 39

ఆ.వె. దైవభక్తి యందుఁ ♦ దండ్రిఁ బోలిన వాఁడు
రామకృష్ణసుగుణ ♦ ధాముఁ; డతఁడు
శైశవంబు మొదలు. ♦ చక్కని భక్తిగీ
తములు పాడి తుష్టిఁ ♦ దనరు నెపుడు. 40

క. గీతములు మనోహరముగ
నాతఁడు పాడుకొనునప్పు ♦ డాలించెడువా
రాతత భక్త్యానందము
చేత న్నిలఁబడుదు రట్లె ♦ చిత్తవివశతన్. 41

ఆ.వె. భజనమందిరములఁ ♦ బాడుటయును, విగ్ర
హములు జేసి పూజ ♦ లమరుచుటయు,
నాగ్గుఁబాలతోడ ♦ నుదయించె నతనికిఁ
బూవుతోడఁబుట్టు ♦ తావి వగిది. 42

తే.గీ. ఐహికాసక్తులకుఁ బూజ ♦ లాట లౌను
వడవడవడంకు ముదుసలి ♦ బడుగు లైన;
నాటలే దేవతార్చన ♦ లగును పట్టి
నిసువులైన సుకృతుల; కీ ♦ వసుధ లోన. 43

సీ. మట్టిబొమ్మలఁ జేసి ♦ పెట్టి కేలుమొగిడ్చి
దేవతలనుచు సం ♦ తృప్తిఁ గొలుచు,
విఱిగిపోయిన శిలా ♦ విగ్రహంబులఁ జెక్కి
బాలురతో నుత్స ♦ వములు సల్పు,
లింగంబులను జేసి ♦ యంగజారికి మ్రొక్కు,
భాగవతంబు స ♦ ద్భక్తి వినును,
శ్రీకృష్ణలీలలు ♦ చెలఁగి నాటకమాడు
తోడిబాలురతోడఁ ♦ గూడి యెపుడు,

తే.గీ. మధురమృదుకంఠమున భక్తి ♦ మార్గమునను
పాడు వినువారిచిత్తము ♦ ల్పల్లవింప,
నాటపాటలఁగూడ దై ♦ వానురక్తి
యతని కమలాత్ము డైన ప్ర ♦ హ్లాదువగిది. 44

వ. కలకత్తాపట్టనంబునకు రెండుక్రోశంబుల దూరంబున రాణిరాసమణిదేవిదక్షిణేశ్వరారామంబునఁ జిరకాలంబునుండి శిథిలమై యుండి రామకృష్ణునిచేఁ జక్కఁబఱుపఁబడిన శ్రీకృష్ణవిగ్రహం బిప్పటికిని జూడనగును. 45

తే.గీ. ఆఱుసంవత్సరముల ప్రా ♦ యంబు నందె,
భాగవతభారతంబులు, ♦ భవ్యమైన
తక్క రామాయణాదిస ♦ ద్గ్రంథకథలు,
గోర్కె విని వానిసారంబు ♦ గ్రోలెనతఁడు. 46

సీ. శ్రీజగన్నాథను ♦ క్షేత్రంబునకుఁ బోవు
దారిలో నాతని ♦ యూరు, కాన
యాత్రికేగుచు వచ్చి ♦ యాయూరి ధర్మశా
లను విడిసిన పుణ్య ♦ జనులకడకుఁ
జేరి, సంభాషించి, ♦ చేసిన యాత్రల
వృత్తాంతముల నెల్ల ♦ వినుచుఁ, బుణ్య
తీర్థమాహాత్మ్యము ♦ ల్దేట తెల్లంబుగా
నన్ని తెలిసికొని, ♦ యమితమైన

తే.గీ. సంతసము పొందు లోఁ, దన ♦ సాటివార
లాటలను బాటలను గాల ♦ మంత వెళ్లఁ
బుచ్చుచుండంగఁ, దన పూర్వ ♦ పుణ్యమునను
రామకృష్ణుండు సుగుణవి ♦ భ్రాజితుండు. 47

సీ. ఒకనాఁడు గ్రామంబు ♦ న, కట లాహోకుటుం
బంబువారింట శ్రా ♦ ద్ధంబు కొఱకు
వచ్చిన పండిత ♦ వర్యులు గుమిగూడి
వేదాంతతత్వార్థ ♦ విషయములను
తర్కించి చర్చించు ♦ తఱి, రామకృష్ణుండు
వాని నన్నిటి విని, ♦ వారివజ్జ
కేగి, మాటలఁ జొచ్చి ♦ హెచ్చి యుక్తులచేత
వారిసిద్ధాంతము ♦ ల్వమ్ముగసేసి,

తే.గీ. కలికిపలుకుల వారి వా ♦ క్కట్టుగట్టు,
"నీతఁ డెన్నఁడు నేర్చెరా! ♦ యింత చదువు,
పండితగజాంకుశంబురా! ♦ పాపఁ" డనుచుఁ
బొగడ సాగిరి పండితు ♦ ల్బుధుత సపుడు. 48

తే.గీ. బుద్ధికుశలతఁ జూచి, త ♦ న్మూర్తిఁ జూచి,
యుక్తిఁ జూచి, విలక్షణ ♦ వ్యక్తిఁ జూచి,
యాతఁడు మహానుభావుఁ డీ ♦ యిలను బుట్టె
ననుచుఁ బ్రశంసింపసాగిరి ♦ యందఱతని. 49

తే.గీ. అచ్చటచ్చటఁ దిరుగుచు ♦ నాతఁ, డొక్క-
నాఁడు నీలాంబరంబుపై ♦ నవ్య మౌక్తి
కముల తీరునఁ బౌరావ ♦ తముల బారు
తెల్లనై వింతగాఁ దన ♦ దృష్టిఁ బడఁగ, 50

ఆ.వె. చూచి. చూచి సృష్టి ♦ సొగసును కరుదంది,
యింద్రియముల చేష్ట ♦ లెల్లఁ దక్క-,
నొడలు మఱచి మూర్ఛ ♦ నొందె నిగ్భకుఁ డయ్యె;
నాది యిదియె తన్మ ♦ యత్వమునకు. 51

ఆ.వె. అన్న లిర్వు, రిర్వు ♦ రక్కలు, రామకృ
ష్ణునకు, నందు జ్యేష్ఠ ♦ సోదరుండు
కాళిఘట్టమందు ♦ బాలుర కొక బడి
యుంచి విద్యఁ గఱపు ♦ చుండె నచట. 52

వ. అతండు రామకుమార చతురోపాధ్యాయుఁ డనంబరఁగు. 53

తే.గీ. వంగభాసను సంస్కృత ♦ భాషయందుఁ
జికిలి చేసిన కత్తిపో ♦ లికఁ జెలంగి
వివిధశాస్త్రాంశముల శిష్య ♦ బృందములకు
నామెతలు పెట్టివారల ♦ నలరఁజేయు. 54

చ. పసుగు నొనర్చియెదు పది ♦ వత్సరము లనువెన్క నన్న, నెం
బడిఁ గొని రామకృష్ణునకుఁ ♦ బాఠముఁ జెప్పఁదలంచెఁ గాని, యా
బడిని బ్రవిష్టుఁడై చదువు ♦ పైఁ దనచిత్తము నాతఁ డెప్పుడుం
చఁడు పరమాత్మతత్త్వము వి ♦ చారము సేయును గాని నెమ్మదిన్.

వ. ఇట్లుండ నొక్కనాఁడు. 56

చ. కొంచక పాఠశాలఁగల ♦ కోవిదపాళియు దంభశిష్య, లు
భ్యంచితవాక్ప్రసంగములఁ ♦ బట్టిరి గొంతుల నెత్తి, యీశ్వరుం
డంచును మాయ యంచు భువ ♦ నాంతరజీవులు బోధ వేళ వ
ర్తించు తెఱంగు లందుఁ జెల ♦ రేఁగి, తమకించుక గల్గుపాండితిన్.

తే.గీ. చూచి యంతయు రామకృ ♦ ష్ణుండు, కాంక్ష
లందుఁ జిక్కెడు నరు లెట్లు ♦ పొందఁ గలరు
వట్టి ప్రాగల్భ్యమున మోక్ష ♦ పదవి యనుచు
నన్నతోఁ బల్కె, బడి వాసి ♦ యరిగెఁ బిదప. 58

వ. రాణిరాచమణిదేవి దక్షిణేశ్వరారామంబున నీశ్వరప్రీతిగా నొక్క దేవళంబుఁ గట్టించి, తాను శూద్రస్త్రీగావునఁ దనపురోహితుం డగు నొక్క విప్రవర్యునిచే నందుఁ గాళీప్రతిష్ఠ చేయించి, రామకృష్ణునన్న నాయాలయంబున కర్చకునిగా నియమించె. 59

ఉ. కాళిఁ బ్రతిష్ఠసేయుతఱిఁ ♦ గట్టలుగట్టుక బ్రాహ్మణోత్తముల్
వేలకొలంది వచ్చి గుడిఁ ♦ బెట్టిన విందుల నారగించి తాం
బూలముల గ్రహించి ధన ♦ ము బ్బహుమానము లంది యొగిను
ద్వేలముదంతరంగులయి ♦ దీవనల న్బచరించి రాణికిన్. 60

వ. ఆదినంబున రామకృష్ణుండు. 61

తే.గీ. శూద్రిచే నిర్మితంబైన ♦ శూలియాలి
యాలయంబునఁ దినఁగరా ♦ దగ్రజుఁ డన్ని,

కుడువ కన్నంబు, పగలెల్లఁ గడపి, రాత్రి
నొందు బ్రాహ్మణునింటి కా తండు ననియె. 62

మ. చని పూర్వార్జితభుక్తశేష మగు పైస ల్గొన్ని యుండఁగ, వా
నినొసంగె స్వల్పృథుకంబుల న్గొనఁ, దనుం బీడించు క్షుద్బాధ వా
పను గంగానదియొద్ద నా చిపిటము ల్భక్షించి, పానీయముల్
దనియంగ్రోలి, యుఁకచ్చటంజలి పెనిం ద్రక్కె బాలుఁడా యామినిన్.

తే.గీ. పరదినంబునఁ గలకత్తా పట్టనమున
కరిగి, కొన్నాళ్లు గడపి త దంతికమున,
భ్రాత పైఁ గల్గు ప్రేమఁ జం పంగలేక
యున్న చెంతకు మరలఁ దా నరుగుదెంచె. 64

ఉ. నాకడ నుండుమం చతఁడు నర్మిలిఁ గోరఁగ, నన్నమాటఁ దా
నీకొని యుండెఁగాని భుజియించుట యెన్నఁడు లేదు కొంపెలన్;
పాకము దానె చేసికొని వంటకముం దినుఁ గంగ చెంగటన్;
గూఁకటితోడనే తెగువ గూడ జనించు మహాత్మకోటికిన్. 65

క. కొన్నాళ్లీగతి నుండఁగ,
నన్న రుజాపీడచేత నర్చకతను దాఁ
దిన్నఁగఁ జేయంజాలక
పిన్నసహోదరుని బదులు పెట్టెను దనకున్. 66

వ. ఇట్లు తమ్ముని దేవళంబునకు నర్చకత్వంబు సేయ నునిచి తాను స్వగ్రామంబునకుం జన, రామకృష్ణుండును విశేషభక్తితోఁ గాళి నారాధించుచుండె. 67

ఆ.వె. తల్లికంటెఁ బెద్ద తల్లిగా భావించి
యాత్మశుద్ధి గల్గి యంబఁ గొల్చు,
నైహికములయందు నభిమానం బైన
బుద్ధిఁ బొఱనీని పుణ్యాత్ముఁడతఁడు. 68

చ. త్రికరణశుద్ధిఁ బూజ లొన • రించుచు సంబకు మూఁడువేళలన్,
సకలవిధంబులైన పరి • చర్యలు సేసి, నివేదనంబు దే
వికి నిడి, సన్నిధి న్నిలిచి, • పిండులఁ గాళి తనంతఁదానె పు
చ్చుకొని భుజించు నంచుఁ దలఁ • చు, న్దన భక్తివిశేష మెట్టిదో!

తే.గీ. ఇంద్రియవ్యాపృతుఁడు గాక, • యేకతమున
గాఢభక్తిని గూర్చుండి • కాళియెదుటఁ,
దనకుఁ బ్రత్యక్ష మగునని • తత్తఱించుఁ;
జూచుచు సమాధినిష్ఠను • జొచ్చు నతఁడు. 70

తే.గీ. పిచ్చివాఁడని కొందఱు, • పెద్దజ్ఞాని
పూజ్యుఁ డని కొంద, ఱనుటకు • మొదలువెట్టి;
రతఁడు లోకుల కతనికి • నవనిజనులు
వెఱ్ఱిగాఁ గానిపించుట • వింత గాదు. 71

శా. బాలోన్మత్తపిశాచచర్యల నిల • న్వర్తించు ప్రజ్ఞాని, దు
ష్షేలాసక్తవిలోలచిత్తులకు నేఁ • డ్రేఁగింప; యాథార్థ్యమిం
కేలా కన్పడు? ఖండఖండములుగా • నీక్షింపమే మారుతో
ద్వేలోద్భూతతరంగచంచలతరా • బ్ధి, న్పూర్ణచంద్రద్యుతిన్? 72

చ. "వలపులు గుల్కు మంచి యెల • ప్రాయమునందున నిట్టివేడబం
బులు తగునమ్మ! బాలకుని • బుద్ధి మఱల్పఁగ రాదటమ్మ! యే
చిలుకలకొల్కి నైన జత • సేసిన నీతని పిచ్చి యంతయున్
దొలఁగుఁగదమ్మ!" యంచొక తె • తో నొక తొయ్యలివల్కు మాటికిన్.

వ. ఇట్లు ప్రజలు సేయుఅవ్వ భరింపలేక రామకృష్ణునకుంగలవారలు,

ఉ. కోరిక లూరఁజేయఁ దగు • కోమలిఁ బెండిలిసేయ, వీఁడు సం
సారసుఖంబుల న్మరగు, • సాగదు వీని విరాగవృత్తి, యం
చారసి, పంచవర్షసువ • యస్క, లసత్కులజాతఁ, బెండ్లికై
శారదనాఁ జెలంగు నొక • చక్కనికన్నెను నిశ్చయింపఁగన్, 75

తే.గీ. రామకృష్ణుండు దానును ♦ రామచంద్ర
దేశికతనూజఁ గాంక్షించెఁ, ♦ దేవికృపను
గలిగి సత్వగుణమూర్తి ♦ గలుగు నెలఁత
గావునను, శారదయె తన ♦ కాంత యనుచు. 76

తే. గీ. దేవతాంశజలై నట్టి ♦ తెఱవ లనుచు,
నసురగణమందుఁ బుట్టిన ♦ యతివ లనుచు,
స్త్రీల విభజించి వారల ♦ తీరు లతఁడు
దెలియఁబఱచును దేటగా ♦ దివ్యమహిమ. 77

సీ. పతిభక్తి గలిగిన ♦ పడఁతులు, దేవు నా
రాధించు మానినీ ♦ రత్నములును,
బతి కైహికసుఖంబుఁ ♦ బరసౌఖ్యమును గూర్చి
యలరించు ప్రేయసీ ♦ తిలకములును,
సురగణోద్భవ ; లైహి ♦ కరతుల మగలకుఁ
గలిగించి వలపించు ♦ తలిరుఁబోండ్లు,
పడఁతిపైఁ బసిఁడిపై ♦ వాంఛలు పుట్టించి
యవ్యయానందాప్తి ♦ కడ్డువచ్చు
తే.గీ. కులుకులాఁడులు, రాక్షస ♦ కోటిలోని
వార; లని రామకృష్ణుండు ♦ పలుకుచుండుఁ ;
గన్న వెన్వెంటనే యెట్టి ♦ కాంత నైజ
మైనఁ గనిపట్టఁ గల నని ♦ యతఁడు నుడువు. 78

తే.గీ. భవ్యగుణవతి యొక్క సం ♦ పన్నురాలు
తన్ను దర్శింపవచ్చిన, ♦ దైవగణము
లోని దని యామె యడుగుల ♦ పైని బూవు
లుంచి తల్లీ! 'యటంచుఁ బూ ♦ జించె నతఁడు. 79

తే.గీ. ఎన్నఁడు సమాధియన నేమొ ♦ యెఱుఁగ, నైన
దక్షణము తన్మయత్వంబుఁ ♦ దాల్చి, నింద్రి
యముల వ్యాపార మంతయు ♦ నడఁగిపోవఁ,
గొన్ని గంటలవఱకు నా ♦ కోమలాంగి. 80

క. మగఁ డీవార్త నెఱింగినఁ
దగ వగునని చిత్తమందుఁ ♦ దలఁకుచు, భక్తిన్
నగజాతకు మ్రొక్కెడి, యా
మగువకు స్మృతిఁ దెచ్చె మఱల ♦ మాన్యుం డంతన్. 81

ఆ.వె. కల్లుగొన్న చేడె ♦ కరణి రక్తాక్షియై
బడలి యామె యరిగె ♦ బండిమీఁద ;
రామకృష్ణుఁ డొందు ♦ బ్రహ్మజ్ఞసౌఖ్యంబు
నితరులకును గూడ ♦ నీయఁగలిగె. 82

తే.గీ. పురుషులనుగూర్చికూడ నీ ♦ పుణ్యపురుషుఁ
డిట్లు వ్రాయుచుండె, ద ♦ ర్శింపవచ్చు
వారిలోపల నాత్మత ♦ త్త్వజ్ఞుఁ డగుట
కర్హుఁ డెవ్వండొ చాలని ♦ యాతఁ డెవఁడొ. 83

క. సిరి, రాజ్యపదవి, మొదలగు
పురుషార్థత్రితయ మెవఁడు ♦ పూర్వభవములం
బొరయునొ యాతండె పో
పరమార్థజ్ఞానసుఖము ♦ వడయఁ గలిగెడున్. 84

తే.గీ. ఈశ్వరధ్యానపరుఁ డౌచు ♦ నీభవంబుఁ
నందె కైవల్యసంధాయి ♦ యైన యెఱుకఁ
బడయునే, మానవుఁడు తొలి ♦ బాములందుఁ
గోరికల నన్నిటిని దీర్చు ♦ కొనినఁగాక? 85

వ. అని రామకృష్ణుండు పలుకుచుండె. వివాహమైనవెనుక, నెప్పటి
యట్లు కలకత్తానగరంబు సొచ్చి, తదంతికదక్షిణేశ్వరారామంబున
నర్చకుఁడుగా నుండె. ఆతని భక్తియు ధ్యానపరవశత్వంబును
దినదినప్రవర్ధమానంబులై లోకుల కచ్చెరువుఁ బుట్టించుచుండె.

ఉ. కోవెలఁ గూరుచుండి, జత ♦ గూరిచి చిత్తము దేవిపైని, సం
భావన సేసి ధ్యానగరి ♦ మ న్గిరిజాతను, గాళి! దిక్కునీ
వే వరదాత్రి! కంటఁబడ ♦ వే జననీ! యని బాష్పవారిధా
రావృతలోచనుం డగుచు ♦ రాత్రిఁబవ ల్ప్రలపించు దీనతన్. 87

తే.గీ. "దీనుఁడను నేను దల్లి! యీ ♦ దినముగూడఁ
గాంచలేనైతి నయ్యయో! ♦ కాళి! నిన్నుఁ
గాంచుభాగ్యంబు నెప్పుడు ♦ కలుగఁజేయు
దమ్మ!" యంచు విలాపించు ♦ ననుదినంబు. ౮౮

ఉ. ఎక్కడివీఁడు? రాతరచి ♦ యుంచినవిగ్రహ మేడ? దానికిన్
మ్రొక్కినఁ గాళిదేవి తన ♦ మ్రోలను నిల్చుట యేడ? వీఁడు వె
ఱ్ఱెక్కెరి యంచుఁగొందఱు, వెడంగని కొందఱు, వ్యాధిపట్టి పెం
పెక్క నటంచుఁ గొందఱు, వ ♦ చింపగ సాగిరి పెక్కుభంగులన్.

వ. రాణిరాసమణిదేవి యల్లుండగు మథురనాథుండు జాలిఁగొని యా
తని గలకత్తాకుం గొనిపోయి యచటివెజ్జులందఱకుఁజూపిన, నెవ్వ
రును రోగనిరూపణంబుసేయఁ జాలరైరి. 90

ఆ.వె. వీరిలోన నొక్క ♦ వెజ్జు జ్ఞాని యగుటఁ,
జూచి కల్గువ్యాధి ♦ చొప్పు సెప్పె—
"వీనిఁ గుదురుపఱుప ♦ విజ్ఞానమార్గంబు
దక్క లేదు వేఱు ♦ దారి" యంచు. 91

వ. ఇదివిని మథురనాథుండు. 92

క. ధరపై వ్యాపారములకుఁ
గొఱగాఁ డీఁక రామకృష్ణ • కోవిదుఁ డని తా
నెఱిఁగి, భయంబు లేడఁగ
నెఱిఁగించె నల తెలుఁగు • నితరుల కెల్లన్. 93

ఆ.వె. అంబఁ జూడలే ద • టంచుఁ జింతిల్లుచుఁ
దన్నుఁ జంపుకొనఁగఁ • దలఁచుచుండ,
స్వస్వరూపమునను • బ్రత్యక్షమయ్యెను
గాళి రామకృష్ణు • మ్రోలఁ గృపను. 94

సు. కాళిక న్బ్రమోదుఁ జూచుఁ • గాంచి రామకృష్ణుఁ, డే
వేళయందు నిన్నుఁ గాని • పెంపు మున్న నాకు నా
కాలమందు నీవు, నన్నుఁ • గన్నతల్లి వోట, నా
మ్రోల నిల్చి జాలిఁ బాపు, • మ్రొక్కెద న్దయాంబుధీ! 95

తే.గీ. అంచు వేడఁ, బ్రసన్నమై, • యాతఁ డెప్పు
డెప్డు గోరిన నప్పుడే • యెదుటఁ బడిన,
నమ్మక నిదర్శనము చూపు • మమ్మ! యనుచుఁ
గాళికాదేవిఁ, బీడించు • గాఢభక్తి. 96

తే.గీ. అడిగిననిదర్శనము లెల్ల • నంబ సూప,
నౌ! నిజంబుగ దేవి ప్ర • త్యక్షమయ్యె
నంచుఁ బులకించు హసియించు • నాలపించుఁ
బెన్నిధినిగాంచి వివశుఁడై • వేదపగిది. 97

సీ. కోవెల గల యాపె • కొమరిత లైనట్టి
యించుఁబోఁడ్లిద్దరు • నెదుట నాకుఁ
దోఁప, నిప్పుడు నీవు • దోఁచినట్టుగ నేను
భావింతు, నను బుద్ధి • పట్టఁగానె,

రామకృష్ణస్వాంత • రంగవర్తి యైన
కాళికాదేవి, త • క్షణమ తెచ్చె
నాచేడెలను, వార • లాదేవళంబున
న్యగ్రోధభూరుహ • ప్రాంతమునను

ఆ. వె. వచ్చి నిలిచినట్టు • పరికించి రామకృ
ష్ణుండు చిత్తమందుఁ • జోద్యమందె;
నంతరంగభక్తు • లైనవారికిఁ గూర్మి
లెంకయాట కేమి • శంక కాళి. 98

క. "వగవకుము రామకృష్ణా,
పగవాఁడవె? నీవు గొప్ప • భక్తుఁడ, విపుడే
యగపడు నగసుత నీకుం
బెగడొందకు" మనెడుపల్కు • విశ్రుతమయ్యె. 99

ఆ. వె. చెప్పినట్టి కాళి • శీతాంశుబింబాస్య
యెదుటఁ దోఁప, మనసు • గుదురుపడుచు
జ్ఞానముదయమందఁ, • జయ్యన రామకృ
ష్ణుండు పల్కె నిట్లు • నిండుభక్తి. 100

ఆ. వె. తల్లి! నే నొనర్చు • తప్పులు మన్నించి
కరుణతోడ నన్నుఁ • గావవమ్మ,
కొడుకు లెక్కడైనఁ • గొఱగానివా రైన
మాత రోయ దన్న • మాట వినమె? 101

మత్త. నీకృపారసవార్ధిలోన ము • నింగి తేలెడువారి, క
స్తోకమై యనపాయమై పరి • తుష్టి నిచ్చెడు సౌఖ్యము
ల్చేకుఱు స్థితిలో, నటంచును • జెప్పు శాస్త్రములెల్ల, దే
వీ! కటాక్షముసేసి నా కవి. • [illegible]

తే.గీ. ఈశ్వరుని శక్తి వాటచే ♦ నీవు శక్తి
యనెడు పేరను బరఁగుదు ♦ వమ్మ! శక్తి
లేనివాఁ డేమి చేయంగ ♦ లేని యట్లు,
లేనియెడ నీవు, సృష్టియే ♦ లేదు కాళి! 103

క. చుంబకము, శక్తి లోహపు
సంబంధంబునను జూపు ♦ చాడ్పున, నీశుం
డంబా! నీకూటమి వి
శ్వంబు ల్రిచియించి పెంచి ♦ సమయించుఁ జుమీ! 104

సీ. పుట్టించు జగములఁ, ♦ బోషించు నంచును,
జేయు సృష్టిని గిట్టఁ ♦ జేయు ననుచు,
కటికిదరిద్రులఁ ♦ గాఁ జేయు నంచును,
సకలసంపదల ను ♦ సంగు నంచుఁ,
జేయుఁ గొందఱఁ జిరం ♦ జీవులుగా నంచుఁ,
గొందఱఁ బురుటింటఁ ♦ గూల్చు నంచు,
శేముషీమంతులఁ ♦ జేయు నంచును, వట్టి
శుంఠల నిర్మింపఁ ♦ జొచ్చు నంచు,

తే.గీ. అవ్వ సేయుదు రీశు ను ♦ ర్వరఁ; దటస్థుఁ
డైనయతఁ డేమి యెఱుఁగు న ♦ మ్మా! భవాని!
మూఁడుగుణముల పోకలు ♦ పోవునట్టి
నీవెయీ వన్నెచిన్నె లిం ♦ దీవరాక్షి! 105

వ. అని పల్కి. 106

తే.గీ. మాత ప్రత్యక్ష మగునంత ♦ మాత్రిఁ గృపిసి
మానస, కల నిర్వికల్పస ♦ మాధిఁ బొందఁ
దలఁచి, పంచత్రింశద్వత్సరం ♦ బులు పొనర్చెఁ
గఠినతపముల సనోత్కృష్ట ♦ కాంక్షఁ జేసి. 107

ఆ.వె. ఆతఁడు దపము సేయు ♦ నంతకాలంబును
బడిన హృదయతాప ♦ భర మదింత
యింత యనఁగరా ద ♦ టంచు వత్సలతను
జెలిమికాండ్ర కతఁడు ♦ చెప్పెఁ బిదప. 108

చ. తనులకు నిద్రలేక కడుఁ ♦ గష్టము నొందుచు, వ్యాధిపీడఁ జి
క్కెను దను వంచు మోముఁ దిల ♦ కించుచు నద్దము నందు, భీతిచే
తను దనవ్రేలు కంట నిడి ♦ డానను నేత్రనిమీలనంబు గా
మిని బెగడొందె, కాళికను ♦ మిక్కిలిదీనతఁ బిల్చి యిట్లనున్. 109

క. కొలుచుచు నీపదపద్మం
బుల, నీదయఁ జూఱకొనఁగఁ ♦ బూనెదు సద్భ
క్తులు వొందెడు ఫల మంతయు
నిలలోనను నిద్రలేమి ♦ యే! నాతల్లీ! 110

తే.గీ. అనఁ బ్రబోధోదయం బైన ♦ యట్లు వెలుతు
రొందు గాన్పించి, యభయత ♦ నుండు మనుచు
ధైర్యమును జెప్ప మాటలు ♦ దవిలెఁ జెవుల,
నాకసమునుండి దేవిక ♦ టాక్షమునను. 111

క. తెగువయు నిశ్చలవృత్తియు
నగపడఁగన్, దేహశోష ♦ ణాద్యార్తులకున్
దిగు లొందకున్న నేపో,
భగవత్సందర్శనంబు ♦ వడయుదు పుత్రా! 112

వ. అని కాళిపల్కినపల్కులకు రామకృష్ణుం డిట్లనియె. 113

ఆ.వె. ఐహికములయందు ♦ ననిశంబు మున్గుచుఁ
బాపు లైన వారి ♦ వలన నేను
దివ్య మైన జ్ఞాన ♦ దీప్తిని గనలేను;
దిక్కు లేని నాకు ♦ గిడ, గి~

తే.గీ. అనఁగ గరుణించి రామకృష్ణా! మనంబుఁ
జింతఁ బడనీకు, నే బ్రహ్మ ♦ దింతు నీకు
జ్ఞానమార్గంబుఁ, దానిచేఁ ♦ గల్గు మోక్ష
మంచు నాకాశవాణిగా ♦ నంబ పలికె. 115

వ. ఇమ్మెట్టి రామకృష్ణుండు. 116

క. జీవాత్మనైజధర్మము
భావంబునఁ దనకుఁ దెలియఁ ♦ బడఁగాఁ, బూజల్
దేవికిఁ జేయుట మానుచుఁ
గైవల్యసుఖంబు నొందు ♦ గంటలకొలఁదిన్. 117

క. ఎసఁగుటసమాధి, దేవికి
నొసఁగు పదార్థముల శంక ♦ నొందక తానే
మెసఁగుటఁ, గన్గొని యాతఁడు
పసిగాఁ డిఁక నర్చనలను ♦ జల్పుట కనుచున్. 118

తే.గీ. రామకృష్ణుం డొనర్చు న ♦ ర్చనలు సేయ
నతనిమేనల్లు నుంచి యా ♦ యాలయమున,
మధురనాథుండు, మేనమా ♦ మకు నొసంగె
సెలవు నానందవార్ధిలోఁ ♦ జెలఁగి యాడ. 119

ఉ. ఓరెము నీరము న్గొనుట ♦ కొల్లమి, నాతని మేనయల్లుఁ డా
హారముఁ దెచ్చినోటను (బ♦యాసముతో నిడు; నాతఁడో, యహం
కారము మూలమంటఁ బెఱు♦కంగను, గొంకక చొచ్చియంత్యజా
గారములందు, భేదమును♦గాంచక సర్వము బ్రహ్మమే యనున్.

వ. ఒక్కనాఁడు. 121

ఉ. గంగకుఁజెంగట న్మెలఁగు♦కాలము నందున మట్టి యొక్కచే
తంగొని, యొక్కహస్తమునఁ♦దాలిచి స్వర్ణము, చూచిచూచి యా

రంగు మెఱుంగు కాంచనము ♦ బ్రహ్మసుఖాప్తికి సంకిలమౌ, దో
డం గనకంబు మట్టియుఁ బ ♦ డంగను వైచెను గంగలోపలన్. 122

వ. మఱియొకనాఁడు 123

చ. నరనుతుఁ డైన యామధుర ♦ నాథుఁడు బంగరుచేల యొండు వా
విరి యగు భక్తినీయ, నొక ♦ పీలిక గోఁచికిఁ జాలుఁ, గాంచనాం
బరములు మోక్షకాములకు ♦ బాధకరంబు, లటంచుఁ జెచ్చెరన్
గరములఁ జీల్చి పాదముల ♦ ఘట్టన చేసె సువర్ణచేలమున్. 124

క. ఇటు వర్తించుచుఁ, దాపో
త్కటశోషిత దేహుఁ డగుచుఁ ♦ గదిసి సమాధిన్,
గటకటఁబడి, యా గంగా
తటినీజలమందుఁ జొచ్చి ♦ తాపము వాపున్. 125

సీ. దివ్యమంగళదేహ ♦ దీప్తుల్ వనచుట్టు
రత్న కాంతులఁ గెరి ♦ పరిజ్వలింప,
వేదశాస్త్రపురాణ ♦ వేదిని యని తళ్కుఁ
గన్నులు నెమ్మోముఁ ♦ గలిసిచాట,
రమ్యకంఠోద్గత ♦ శారివ్యనాదంబులీ
స్వరసంస్తుతుల్ వెద ♦ చల్లుచుండఁ,
దనుసుఖంబులకును ♦ దనకు సంబంధముల్
లేవని పుట్టంపుఁ ♦ గావి చెల్ప,

ఆ-వె. సకలయోగశాస్త్ర ♦ సారమంజులములౌ
పలుకు లలమఁ దేనె ♦ లొలుకుచుండ,
ముక్తికాంత యనఁగ ♦ ముదిత యొకర్తుక
యేగుదెంచె రామ ♦ కృష్ణకడకు. 126

క. యోగిని వచ్చి, సలసలం
గాఁగెడు దేహమును బూలఁ ♦ గప్పుచుఁ, బిదపన్

శ్రీగంధ మలఁది తలపైఁ,
బోఁగొట్టెను దాపథతము ♦ మూఁడు దినములకే. 127

క. ఊరూరఁ దిరిగి పండిత
వారంబుల వాదములను ♦ బడఁగొట్టుచు దు
ర్వారమనీషాబలమున
శారద యేమో యనంగఁ ♦ జాన చెలంగెన్. 128

తే గీ. పాపభూయిష్ఠ మైన యీ ♦ వసుధ జనుల
నుద్ధరింపంగఁ బుట్టిన ♦ యువిద యనఁగ,
నడుగఁ గులగోత్రముల నెవ్వ ♦ రైన, బదులు
వల్క కొనరించుచుండెఁ దాఁ ♦ బయనములను. 129

తే-గీ. ముగురుసత్పురుషులకుఁ దాఁ ♦ బూని నిర్వి
కల్పకసమాధిఁ బూర్ణంబు ♦ గాఁగఁ జేయ
వలసి యున్నది, యనుమాటఁ ♦ దెలిసికొని యోఁ
బ్రాజ్ఞ తను దివ్యదృష్టి నీ ♦ వఱకె కలికి. 130

కం. ఇదివఱకె యిద్ద ఱగపడి,
రిదె మూఁడవవాని నిన్ను ♦ నీక్షించి కడున్
ముద మందితి, నని పల్కెను
ముదిత, సుతుం గన్నమాత ♦ పోలికఁ, బేర్మిన్. 131

కం. "యోగిని యొక్కతె నీకున్
యోగజసామ్రాజ్యపదవి ♦ నొడఁగూర్చును, భ
వ్యాగమశిఖరానందము
వేగమె పొందెదవు నీవు ♦ వెతఁ జెందకుమా." 132

కం. అని రామకృష్ణతోడను
మును కాళిక వల్కుటయును, ♦ మున్నట్టుగ యో

గిని తన స్థితిగతులను చూఁ
గనుఁగొనుటయు, నతని మనసు ♦ కలఁకువఁ దీర్చెన్. 133

తే-గీ. వెంగలి యటంచు గేలి సేయంగఁబడెడు
రామకృష్ణునిఁ జాల గౌ♦రవము చేసి
గొప్పవాఁ డని యోగిని ♦ చెప్పుచుండె.
జ్ఞాని జ్ఞానియు దొంగ దొం♦గయు నెఱుంగు. 134

కం. సకలకలావేదిని కై
వికలాంతఃకరణుఁ డైన ♦ వెడఁగుకడ న్ని
ల్వక తప్పకపోయెనే యని
పకపక నగసాగి రచటి ♦ పట్టనవాసుల్. 135

ఆ-వె. ఓయివెఱ్ఱులార! ♦ యోగ మభ్యాసంబు
సేయువారి కిట్టి♦స్థితియె పట్టు
మొట్టమొదట, నంచుఁ ♦ బొలఁతి పండితులతోఁ
బలికె యోగశాస్త్ర♦ఫక్కిఁ దెల్పి. 136

కం. శ్లోకముల ప్రమాణంబుగఁ
గైకొం డని చదివి, మున్ను ♦ గౌరాంగునికిన్
జేకుఱెను జిత్తవిభ్రమ
మీకరణి, నటంచుఁ గలికి ♦ యేర్పడఁ జెప్పెన్. 137

సీ. పిచ్చిగా దిది, రోగ♦పీడయునుం గాదు,
భక్తిభరోద్భూత♦బాధ యనుచుఁ,
గావుననే పూల ♦ గంధలేపనములఁ
దొలఁగించుటకు వీలు ♦ గలిగె నంచు,
వెనుకను బావన♦బృందావనాంతర
వ్రజకామినులకును ♦ రాధికకును

చైతన్యునకు నిట్టి ♦ చందంబుగా మనో
విభ్రమములు గానిపించె నంచు,
తే-గీ. వారు నిట్టుల చైతన్యప్ర ♦ చారములను
బాపికొనఁ జాలిరి శరీర ♦ తాపముల, న
టంచుఁ దా శ్లోకములను దృ ♦ ష్టాంతముగను
జదివె వినువార లందఱు ♦ సంస్తుతింప. 138
కం. ఆపాలంతికృపను యోగో
ద్దీపిత చిత్తుఁడయి యతఁడు ♦ తత్క్షణస్తుప్తి
డాపరితప్తోదరుఁడై
యాపోవక తిండికై ప్ర ♦ యాసపడంగన్. 139
కం యోగాభ్యాసిముముక్షుల
కిఁగతినే పట్టు భోజ ♦ నేచ్ఛ, యటంచున్
యోగిని ప్రద్రసయుతమా
నోగిరమును వండిపెట్టె ♦ నోరిమితోడన్. 140
తే-గీ. కొన్నిసంవత్సరము లుండి, ♦ యన్ని యోగ
కీలకంబుల నెదలోనఁ ♦ గీలుకొల్పి,
నిర్వికల్పసమాధి నొం ♦ దించి రామ
కృష్ణునకు జ్ఞానప్రాప్తిఁ గా ♦ వించె సుమతి. 141
కం. యోగిపతంజలి విరచిత
యోగాగమచోదితాష్ట ♦ యోగంబులఁ దా
వేగముగా గ్రహియించుచు
లోఁగొని బంధించుఁ జటికలో ♦ ధ్యానంబున్. 142
తే-గీ. ఇంద్రియంబులఁ జేతస్సు ♦ నిల్పి కట్టి
నిర్వికల్పత మనము ♦ నిల్పఁ గలిగె

స్వల్పకాలంబులో, నిట్టివాఁడు గలఁడె?
యంచు యోగిని యద్భుతమందు నెదను. 144

శా. శ్వాసంబు ల్ప్రసరింపనీక మనమున్ బట్టంగ యత్నించుచో
నాసానాళయుగంబునుండి దొరఁగ న్రక్తంబు, వీక్షించి, యా
యాసం బంది, యతండు బెగ్గడిలి, మేనల్లుండు శాపింపనే
మో! సంధిల్లెను గష్ట మంచు మదిలోఁ బొక్కె న్విశేషంబుగన్

కం. "వెనుకను మేనల్లుని పైఁ
గినిసితిఁ, దత్ఫలము గాదె కేవల మిది" యం
చని యతని వాఙ్మహత్త్వం
బునకు న్వెఱఁగంది వానిఁ బొగడుచునుండన్. 145

చం. సరగున వచ్చి యోగిని, "విచారమునొందకు రామకృష్ణ! ము
క్కరములనుండి శోణితము గాఱక యున్నను జావు నిక్కమౌ,
ధర కుపకారము ల్సలుప దైవము నిర్ణయించెఁ గాక, యె
వ్వరికిటు సేయు నయ్య!" యని వంతను దీర్చె నపారమౌకృపన్.

సీ. హఠయోగమును బట్టి యభ్యసించుచు దాని
సిద్ధిఁ బొందెడు వేళ, శీఘ్ర మందు
మేదస్సునకు నెక్కి మేనిరక్తం బంత,
యీశ్వరుతో జీవు నేకపఱచి,
క్రమ్మఱఁ గ్రిందికి రాఁజాల కుంటచే
నంటియుండును కొంద ఱాసమాధిఁ;
గొందఱు ప్రాణము గ్రోల్వఁ బ్రవరు పుస్త
లవియంగఁ; బూర్వపుణ్యమునఁ గొంద

తే-గీ. ఱక్కడక్కడఁ దమకుఁ దా మనుభవించు
మహితవిజ్ఞానఘనసమాధిసుఖము,

నిత్య పదములమాఁ, దెలుపఁగ ♦ నేత్ర వారులు;
కంచు ఘోషించె యోగిని ♦ యతని కపుడు. 147

కం. ఓరామకృష్ణ! మూఁడవ
వారలలో వాఁడ వీవు; ♦ వ్యర్థఁ జెందుటకుఁ
గారణ మింతయుఁ గనఁబడ;
దూఱకుమా యిఁక, నంచు ♦ యోగిని వల్కెన్. 148

సీ. బాల్యంబునందునే ♦ పరమార్థవేదియై
సన్న్యాసమునుబూన ♦ శక్తి గలిగి,
దినములతోడనే ♦ తిరుగుచు, శీతవా
తాతపంబులబాధ ♦ లంటనీక,
పట్టెఁడన్నంబు నె ♦ వ్వరి బిచ్చమెత్తక,
చెట్టుచేమలె యున్కి ♦ పట్టు గాఁగ,
వసియింపకయ మూఁడు ♦ వాసరంబులకంటె
నెచ్చోట, నూరూరి ♦ కేగి, తుదకు

ఆ–వె. వచ్చిరామకృష్ణు ♦ పజ్జకుఁ దోతాపు
రి యను యోగి, తా నె ♦ఱింగి యతనిఁ,
"గీలకముల రామ ♦ కృష్ణుండ! దెల్పెద
నెఱుకఁ బడయు," మన్న ♦ నిట్టు లనియె. 149

తే–గీ. "అమ్మ నడుగక యేమి చే ♦ యంగలేను,
గాళి దర్శించి తిరుగ వే ♦ గమున వత్తు",
నంచు దర్శించి కాళిక ♦ యాజ్ఞ వడసి
యతఁడు గ్రిమ్మఱఁ జిటికలో ♦ నరుగుదెంచి, 150

కం! "అనుమతియిచ్చెను గాళిక
మనుజోత్తమ! నీకుఁ దోఁచు ♦ మార్గంబున బో

ఘన మొనవుపు మని సర్వం
బును నేరువ నొందు రెండు • పూఁటలలోనన్, 151

చం. నలువది వత్సరంబులు పొ•సర్చితపంబుల, నెన్నరాని బా
ములఁ బడి, సంగ్రహించిన ప్ర•బోధరహస్యము లొక్కసారిగాఁ
దెలిసికొనంగఁ జాలితివి, • ధీమహిమంబున నీకు సాటి రాఁ
గలుగునె రామకృష్ణ! యొక • జ్ఞానియు, వెన్కను ముందునిప్పుడున్.

కం. అనియాతోతాపూరియొ
తనతో సముఁడంచు వానిఁ • దలఁచుచు నుండన్,
దనకంటె నధికుఁడే యం
చనుకొనఁదగు చిత్రమహిమ • లతఁ డగపఱచెన్. 153

వ. ఒక్కనాఁడు. 154

శా. తోతాపూరి యహాగ్నిశం బెదుట నెం•తో శ్రద్ధతో నుంచు సం
పూతాగ్ని న్బాగఁ ద్రావఁగా నొకఁడు దా•నుట్టంగ, గీక్షించి సం
జాతక్రోధదవానలంబు మన మే•ర్చన్, డింద విజ్ఞానమున్,
జేతు ల్చాఁచుచు నోటఁ దిట్టు చతసిం • జే! యంచుఁ బోనాడినన్,

వ. రామకృష్ణుం డిట్లనియె. 156

తే-గీ. నిర్వికల్పసమాధులు • నీదు సొమ్ము,
పరివిమలజ్ఞాన మది నీకుఁ • బట్టుఁగొమ్మ,
సర్వమును బ్రహ్మమే యని • చాటు నీకుఁ
గూడునే యిట్టి చేష్టలు • గురువరేణ్యా? 157

కం. గురులకు వాక్కర్మంబులు
సరియై వర్తింప కున్నఁ, • జాలుదు రయ్యా!
ధరలో మత్సదృశులు సం
సరణార్ణవ తీరాఁది దాఁటు, • సర్వజ్ఞమణీ! 158

ఆ-వె. పలుకు లొక్కరీతి ♦ వర్తన మొకరీతి
గురువునందు శిష్యుఁ ♦ డరసెనేనిఁ,
బాయులైనత్రోవఁ ♦ బట్టికాఱడవినిఁ
బోవు పథికు మాడ్కిఁ ♦ బొందు శంక. 159

కం. నీయెదుటనున్నయగ్నికి,
నాయెడ మాంసంబుఁ గాల్చు ♦ నగ్నికి, భేదం
బోయతివర కలదయ్యా?
యాయనపై మండిపడుట ♦ యర్థమె? చెపుమా. 160

కం. అను రామకృష్ణు నీతుల
కును గోపం బూన, కతఁడు ♦ గోవిమఁ డాటకు,
గనియుట దప్పకతప్పె,
యని తాపముచెందెఁ దనదు ♦ నాగ్రహమునకున్. 161

ఆ-వె. నిర్వికల్పచిత్త ♦ నియతిఁ దాల్చియు, రామ
కృష్ణ! కాళిమీఁద ♦ నేల యయ్యె
భక్తి యింక? నంచుఁ ♦ బలుకఁ, దోతాపురి
కిట్టు లనియె రామ ♦ కృష్ణుఁ డపుడు. 162

సీ. మనయహంకారంబు ♦ మడఁగినఁ బూర్తిగాఁ,
బరమాత్మతత్వంబు ♦ బయలు వడును;
జీవసంబంధియే ♦ చేతస్సు గావున,
నాత్మేశ్వరులకు నై ♦ క్యంబు గానఁ,
బరమాత్మ గాంచెడు ♦ వారికి లే దెందు
నీవు నే నను భేద ♦ మించుకయును;
వాగతీతుం డైన ♦ పరమాత్ము దర్శింప
మనసును బట్టి చం ♦ పంగ వలయు;

తే.గీ. నింత యైన నహంభావవృత్తి గలుగఁ,
దా మనోలయపక్షతఁ దాల్ప లేఁడు;
మనముఁ బోఁజొచ్చుచున్న నే మానవుండు
నాత్మ యీశుండు నొక్కఁడే యనుచుఁ గనఁడు. 163

కం. మనలో జీవులు పరమా
త్మను బుట్టిన ఛాయ లాట, మాత్రగఁ గాళ్ల
మనమునఁ దలఁచెద; నాయమ
యును బరమాత్మయును జూడ నొక్కటి యగుటన్. 164

వ. ఇట్లు రామకృష్ణుండు పలుక, వానియొద్దఁ గొన్ని దినంబు లుండి,
తోతాపూరి యతని వీడ్కొని చనె. రామకృష్ణుం డాఱుమాసము
లు నిర్వికల్పకసమాధి నుండి, పరబ్రహ్మైక్యానుభవంబునఁ గల్గు
సుఖంబు నొంది, సమాధిం దెరలివచ్చి, యా తెఱంగంతయుఁ
దరువాత శిష్యులకుం బ్రకటించె. 165

సీ. "నిర్వికల్పసమాధి నిలిచిన నెలలలో
బాహ్యేంద్రియవ్యాప్తిఁ బడక యుండి,
హఠయోగసుఖముల నన్ని నేఁ బొందితి
సంగంబు సత్వగు సాధ్య మాట;
నితరుల కలవి గాదిది సల్ప; నే సమా
ధిని జిక్కియుండఁ జింతిల్లి సాధు
వొక్కఁడు కర్రతో నొడలంటి మేల్కొల్పి
యన్నంబు నిడె నాకు నప్పుడప్పు;
తే.గీ. డాఱుమాసంబు లీగతి నంటి యుంటి;
పట్టె రక్తగ్రహణి నన్ను బాధపెట్ట,
వదలి నిష్ఠను, దిరుగఁ బ్రపంచదృష్టిఁ
బడితి" నని రామకృష్ణుండు పలికె నిట్లు

శా. ఏ దైవంబును ధ్యానము న్సలుపుఁ బ్రి ♦ త్యేకంబు నా దైవమే
తా దర్శింపఁగ మ్రోల నిల్చి తన యా ♦ త్మజ్ఞానమై పోవఁగా,
భేదం బాత్మపరేశతత్త్వములకు ♦ న్వీక్షింప నావంతయున్
లే దంచు న్గనె భక్తియోగమున నే ♦ నిర్లిప్తచిత్తంబునన్. 178

తే.గీ. చవిఁగొని యశేషసన్మత ♦ సారములను,
బక్షపాతంబు లేక స ♦ ర్వంబు సరసి,
"యేకమేవాద్వితీయ" మం ♦ చెల్లయెడలఁ
జాటు వేదాంతవాక్యంబు ♦ సత్యమనియె. 179

తే.గీ. సచ్చిదానందమూర్తి నీ ♦ శ్వరుని జనులు
భక్తిఁ గొల్తురు వివిధరూ ♦ పముల ననును;
బాహ్యభేదంబులే కాని ♦ పరునిఁ జేర
మార్గములు మానవుల కన్ని ♦ మతము, లనును. 180

సీ. ఐదేండ్లప్రాయంబు ♦ నందునఁ బెండ్లియై
యిప్పుడు పదునెన్మి ♦ దేండ్లవయసు
వచ్చినశారద ♦ పజ్జకు జను తేగి,
యున్మాదపీడనో, ♦ యోగజనిత
చిత్తచాంచల్యంబు ♦ చేతనో, లలితాంగి!
పిచ్చిగాఁ దిరుగు నీ ♦ విభుఁ, డటంచుఁ,
దల్లియానతిఁ బొంది ♦ తత్క్షణమే తన
గతి నాథువలననే ♦ కనఁదలంచి,

తే.గీ. పాదచారిణియై తన ♦ వారి విడిచి,
వచ్చి నలువదిక్రోశము ♦ ల్వతి కేఁగి
నిలువఁగా, రామకృష్ణుండు ♦ నెలఁత నాద
రించి, ధైర్యంబు నెదఁ దాల్చి, ♦ యిట్లు పలికె. 1

ఆ.వె. అపుడు నిన్నుఁ బెండ్లి ♦ యాడిన రామకృ
ష్ణుఁడు మృతిని జెందె ♦ సుదతి! యిప్పుడు.
కాంతలందు నాకుఁ ♦ గాళిదో మాతృవు;
నర్వ లేమలందు ♦ నొకతె నీవు. 182

కం. కావున భార్యగ నిఁక నిన్
భావంబునఁ దలఁపలేను; ♦ పరమాత్మసుఖం
బే వదలను; నా కిహాలో
కావస్థలఁ జిక్కి చెడ దు ♦ రాశలు వీడెన్. 183

వ. ఇట్లు రామకృష్ణుం డన. 184

చం. సుగుణగణప్రశస్తయగు ♦ సుందరి కావున శారదాంబ, నె
వ్వగ యిసుమంతఁ జిత్తమును ♦ బట్టఁగనీయక, ప్రాణనాథ! భా
ర్యగ ననుఁ జేకొనంగఁ దమ ♦ కంకిలియైనను, శిష్యురాలఁగా
నగుదు; ననుగ్రహించి తమ ♦ యంతిక మందున నుండనిం, డనన్.

తే.గీ. రామకృష్ణుఁడు గొంతసే ♦ పామెఁ గూర్చి
యోజన మొనర్చి, కొనకుఁ దా ♦ నొప్పుకొనియె;
లలన, చెంతను గాళి యా ♦ లయములోన
నుండి, పరిచర్య సేయుచు ♦ నుండెఁ బతికి. 186

కం. ఉపదిష్టగుప్తమంత్రముఁ
జపియించుచు, భక్తియోగ ♦ సరణిని, గుడిలో
నెప్డుఁ దైహికములఁ దలఁపక,
యుపచారము సేయుచుండె ♦ నువిద విభునకున్. 187

ఉ. నాతి కొనంగఁగా మధుర ♦ నాథుఁడు వేలకొలంది రూప్యముల్,
"చేతను ముట్ట సొమ్ముఁ; బతి ♦ చెప్పిన చొప్పునఁ బోదు; నైహిక
వ్రాతములందుఁ జిక్క కన ♦ పాయసుఖంబుల నాథుఁ డుండ, నే
లాఁతి సుఖంబు లబ్బుట ♦ లగ్గగునే?" యని కాంత పల్కుచున్.

తే.గీ. ధనము విడనాడి, సన్మోక్ష ♦ ధనముఁ గోరి,
భర్తృసద్బోధనంబున ♦ భక్తిఁ బడసి,
జ్ఞానవైరాగ్యములఁ బొంది, ♦ శారదాంబ
యలరుఁ గాశ్మీరదేశము ♦ నందిపుడును. 189

తే.గీ. దేశములు గాని దేశము ♦ ద్దెరలి వచ్చి,
పుణ్యతీర్థంబునకు యాత్ర ♦ పోవు పగిది
నరిగి, యామెకు మ్రొక్కెడి, ♦ తిరిగి వత్తు
రెందఱో శిష్యు, లల గురు ♦ నింతి యనుచు. 190

కం. చదు వింతయు లే; దైనన్
జదివిన దొకసారి వినిన ♦ జ్ఞప్తికి వచ్చున్
గద! బుద్ధి ధారణంబున
నెదు రెవ్వరు చూడ రామ ♦ కృష్ణున కితరుల్? 191

తే.గీ శిష్యు నొక్కని నొకనాఁడు ♦ చీరి కడకు,
"నాకు నధ్యాత్మరామాయ ♦ ణంబు వినఁగఁ
జాలఁ గౌతుక మయ్యెడుఁ, ♦ జదువు" మంచు
నొప్పుగా నాతఁ డర్థంబు ♦ చెప్పుచుండ, 192

ఉ. ఎచ్చట మీరు సంస్కృత మొ ♦ కించుక నేరువ లేదు, నిందుగ
న్వచ్చిన వారి యట్లనె పొ ♦ నర్తురు గ్రంథములోని భావము
ల్వెచ్చెము లేక;యీవిధ మ♦పూర్వ,మటంచు నెడందయందుఁ దా
నచ్చెరు వంది శిష్యగణ ♦ మం దొకఁ డాతనితోడఁ బల్కెనన్,

వ. రామకృష్ణుండు, 194

కం. ఒకమాఱు విన్న యర్థం
బిఁక మఱచుట లేదు; దీని ♦ హితముగఁ బూర్వం
బొకసారి వింటి, నాపై
వక రెండవసారి వినఁగ ♦ వాంఛఁ దవిలితిన్. 195

తే.గీ. అంచు గురుకులవాసప్ర • యాసములను,
ధార వోయుచు జీవ మం • తయును, జదువు
వారి కందని తత్త్వసం • పత్తిఁ బడసి
విశదపఱచును గ్రంథస్థ • విషయములను. 196

వ. మఱియు. 197

శా. యోగాభ్యాసగరిష్ఠు లైన మనుజు • లోకంబున న్గల్గు ప్ర
జ్ఞాగర్వంబున వీఁగుచున్, బరజన • శ్లాఘేచ్ఛ, మాహాత్మ్యముల్,
ప్రాగల్భ్యప్రకటంబు సేయుచును, జా • పనాప్రిను; జ్ఞానాప్తి యే
యోగోద్దేశ, మటంచు బోధనము సే • యున్ బేర్మి శిష్యాళికిన్.

కం. శిష్టత నిష్ఠ న్పొందిన
యష్టైశ్వర్యములు దొమ్మ • రాటలు సేయన్,
దృష్టి చెడి, పడ్డ కష్టము
నష్టంబౌ, దుఃఖభాజ • నం బగు మనమున్. 199

కం. అని నుడివి రామకృష్ణుం,
డనుభూతము లైన మహిమ • లన్యుల నెపుడున్
గననీయక, మెడఁ, బరమా
త్మను నిల్పుచు, లోనిచవులఁ • దద్దయుఁ గ్రోలున్. 200

కం. ఐనను మహిమం బొక్కటి
గానఁగ నగు నతనియందుఁ; • గాపురుషులకున్
ధ్యానాదిమహితసంపద.
మానితమోక్షేచ్ఛ, స్పర్శ • మాత్రమున నిడున్. 201

వ. ఇట్లుండ మధురనాథుండు. 202

తే.గీ. భరతవర్షంబునందలి • పావనంబు
లైన సుక్షేత్రములఁ జూడ • నరుగఁ దలఁచి,

కూడఁ దీసికపోయెను ♦ గురుపరేశ్వరుఁ,
జరిపి సేవలు భక్తిని ♦ శ్వాసములను. 203

తే.గీ. రామకృష్ణుండు వోయి, క్షే ♦ త్రముల పొంత
నున్న మహనీయు లగువారి ♦ యొద్ద కేగి,
జ్ఞానవిషయమ్ములను గూర్చి ♦ చర్చ సేసె
వారు, బ్రహ్మజ్ఞుఁ! డనితన్నుఁ ♦ బ్రస్తుతింప. 204

కం. కనియెన్ త్రైలింగస్వా
మినిఁ గాశీపురిని, దాని ♦ మీఁదట, బృందా
వనవాసిని, గంగామా
తను, యోగిని, భక్తిఁ గాంచి ♦ ధన్యుండయ్యెన్. 205

కం. బృందావనసౌందర్యము
కందోయికి విందు గొల్పఁ, ♦ గదలి చనుటకున్
డెందం బొప్పమి, నచటనె
యుండ మనుచుఁ దోఁచె నతని ♦ కుల్లమునందున్. 206

వ. అయిన నతండు. 207

కం. "కొడు కెపుడు వచ్చు నంచును
నుడివడు చిత్తమున నెదురు ♦ చూచుచు, నాకై
పడియుండు వాకిలిల్లుగఁ,
దడయక యరుగంగ వలయుఁ ♦ దల్లినిఁ జూడన్." 208

కం. అనుకొని స్వగ్రామమునకుఁ
జనుదెంచుచు, మార్గమందు ♦ జనపద మొకఁడున్
గని వింధ్యారణ్యము పొం
తను, క్షుత్తున నడలు జనుల ♦ దారిద్ర్యంబున్, 209

ఆ.వె. గాంచి జాలి నొంది ♦ కడుపార నన్నంబు
వస్త్రములును ధనము ♦ వారి కొసఁగ

సుఘురనాథుతోడ ♦ మఱిమఱి సెలవిచ్చి,
పల్లెలోని జనుల ♦ బాధవాపె. 210

ఆ.వె. ఇట్లు వచ్చి దక్షి ♦ ణేశ్వరారామంబు
నందు నుండి, శిష్య ♦ బృందమునకు
నుచిత మైన రీతి ♦ నుపదేశములు సేసి,
జ్ఞానబోధనములఁ ♦ జల్పుచుండె. 211

కం. "పరమాత్మజ్ఞానంబును
బొరసి తరింపంగఁ దలఁచు ♦ పురుషుఁడు, కాంక్షన్
గురు నరయఁ బిచ్చి పట్టిన
నరుపోలికఁ దిరుగవలయు ♦ సల్లసలందున్." 212

కం. "సుమమునఁ దేనెలు గ్రోలఁగ
భ్రమరంబులు చనును గాని ♦ ప్రసవం బళులన్
నెమకంగఁ బోదు, కావున
సమలత శిష్యుండె గురువు ♦ నరయఁగ వలయున్." 213

వ. అని శిష్యులకు రామకృష్ణుం డెప్పుడు బోధించుచుండె. 214

మ. నిరహంకారుఁడు, యోగివర్యుఁడు, సదా ♦ నిర్లిప్తచిత్తుండు, దు
ర్భరసంసారలతాలవిత్రవిమల ♦ పరిజ్ఞానసంపన్నుఁ, డీ
శ్వరచింతాపరతంత్రుఁ, డింద్రియముల ♦ న్బంధించి లోఁగొన్న నే
ర్పరి, శాంతాత్ముఁడు, రామకృష్ణునకు వా ♦ రల్వీరలు న్సాటియే ?

తే.గీ. "ఆత్మవత్సర్వభూతాని" ♦ యనెడు వాక్య
పద్ధతిని భూతదయ యగ ♦ పఱచు చుండుఁ;
జదు వొకింతయు లే, దైన ♦ జ్ఞానగరిమఁ
బరమహంసాఖ్యఁ బడసె నా ♦ నరవరుండు. 216

తే.గీ. దండిమగ లైన షట్శాస్త్ర ♦ పండితులును
రామకృష్ణుండు మెలఁగు తె ♦ ఱంగుఁ జూచి,

గర్వములు డించి, యాతని ♦ కడకుఁ జేరి
కోరుదురు జ్ఞానభిక్షను ♦ గురుఁడ యంచు. 217

సీ. బ్రహ్మమతావలం ♦ బకుఁడు కేశవచంద్ర
సేనుఁ డన్యాత్మవ ♦ శిష్ఠుఁ డొకఁడు,
బల్గేరియా యని ♦ పరఁగు వనం బునికి
పట్టుగా, నేకాంత ♦ భక్తినుండి,
రామకృష్ణుఁడు గొప్ప ♦ బ్రహ్మజ్ఞుఁ డని విని,
చెంతకుఁజని వాని ♦ స్థితి నెఱింగి,
"బ్రహ్మోపదేశకా ♦ ర్యంబున కీతండు
తగినట్టి గురుఁ" డని ♦ తలఁచి, యతని
తే.గీ. శిష్యుఁడై, ప్రతిదినమును ♦ జెంత కరిగి,
యాకుటెంటను జ్ఞానవా ♦ క్యములు వినుచుఁ,
దన్మయత రామకృష్ణుండు ♦ దాల్చు తఱిని
శిరము పైఁ ♦ బెట్టుకొను వాని ♦ చరణములను. 218

కం. అనుబంధ మధికమౌ ♦ కాలఁ
దిని, గేశవచంద్రసేన ♦ ధీమంతుం, డా
తనిఁ దన యారామమునకుఁ
గొనిపోవుచుఁ జల్పె జ్ఞాన ♦ గోష్ఠి నతనితోన్. 219

కం. తరినెక్కి యొక్కతఱి, ని
ద్దఱు జాహ్నవిమీఁద నేగి, ♦ తత్వార్థములన్
బరికించి చర్చ సేయుచు
గురుశిష్యులు జ్ఞానసుఖముఁ ♦ గొనిరి ప్రీతిన్. 220

తే.గీ. రామకృష్ణుండు గఱపిన ♦ బ్రహ్మవిషయ
బోధమును దృప్తిగా విని, ♦ పూర్వరచిత

బ్రాహ్మమతమును నవరించి ♦ వ్రాసి, యతఁడు
కొత్త యాస్తికమతముగాఁ ♦ గుదురు పఱచె. 221

సీ. రామకృష్ణుఁడు గురు ♦ రత్నం బటంచుఁ గే
శవచంద్రసేనుండు ♦ చాటు కతనఁ,
బరమహంసునిఁ జూడఁ ♦ బగలు రేయియుఁ గూడ
విద్యాధికులు, మహా ♦ విభవయుతులు,
వృద్ధులుఁ, గాంతలు, ♦ వేనవేలుగ వచ్చి,
యుటజమ్మునందుఁ ద ♦ దుక్తబోధ
మును జాల భక్తితో ♦ విని పోవుచుండి; రా
తండును నిండారు ♦ దయను జూపి,

ఆ.వె. వచ్చువారికెల్ల ♦ భక్తియోగజ్ఞాన
యోగములు మనంబు ♦ నూఁదుకొనఁగ,
నప్పుడిప్పు డనక, ♦ యన్ని కాలములందు,
నదుపదేశములను ♦ జెప్పుచుండె. 222

కం. ఇటు సలుపఁ గొన్నినా, ళ్లు
త్కటమగు రుజ తనువుఁ బట్టి ♦ కాఱియ పెట్టెన్;
ద్రుటియైనఁ గొంకి యతఁ డా
ఱటఁ జెందక బోధములను ♦ శ్రమపడి చేసెన్. 223

కం. కలకత్తానగరంబునఁ
గల వైద్యప్రవరు లతనిఁ ♦ గాంచి, మహాత్మా!
బలవద్వ్యాధి జనించెను,
వల దింకనాయాసపడుచుఁ ♦ బలుకుట, యనినన్, 224

వ. రామకృష్ణుండు, 225

తే.గీ. జ్ఞానమును గోరి వచ్చిన ♦ జనుల నవలి
కరుగుఁ డని రోగభీతి నె ♦ ట్లాదు? నంచుఁ

బోర్వాభంగినె యుపదేశ ♦ ములను జేయ
సాగె, వైద్యుల మాటలు ♦ సరకు గొనక. 226

తే.గీ. బోధములు సేయుటయును, స ♦ మాధిఁ జెలఁగు
చుండుటయు, రెంటఁ దక్క, మ ♦ ఱొండు పనికిఁ
జోరఁడు గద! రామకృష్ణుఁడు ♦ పరుల సుఖమె
చూచుచుండెను స్వసుఖంబుఁ ♦ జూడ కెపుడు. 227

తే.గీ. బాహ్యకరణాళి సందడిఁ ♦ బడక యతఁడు
తన్మయత నుండ, నొకనాఁడు ♦ తనదు నిప్పు
గుండమున నోడ లెఱుఁగక ♦ కూలి, బాధ
నొందఁ డయ్యె సమాధిలో ♦ నుండు కతన. 228

తే.గీ. నేలపై నతఁ డొకనాఁడు ♦ గూలి యిట్లె
చేతిపై నొక గాయంబు ♦ సేసికొనఁగ,
వైద్యు లాచేతఁ గొన్నాళ్ల ♦ వఱకుఁ బనులఁ
జేయవల దని పలుమాఱు ♦ చెప్పి, రైన, 229

తే.గీ. దైవసంబంధవచనము ♦ లతనదు చెవుల
సోఁక నెవఁడైన నుడువఁగాఁ, ♦ జొక్కి పడుచుఁ
బుండు పడిసట్టి చేతినే ♦ పుండు చేయు,
మాటిమాటికి వైద్యుల ♦ మాట మఱచి. 230

తే.గీ. రామకృష్ణుండు శుద్ధవై ♦ రాగ్యమునను
మానుచుండెడి గాయమ్ము ♦ మానీక
వెండి గాయంబు సేయుచు ♦ నుండు కతన,
క్షతిని మాన్పుట కాఱు మా ♦ సములు పట్టె. 231

ఆ.వె. నతులు సేసి మధుర ♦ నాథుండు, గురువర్య!
వర్షమునకు రెండు ♦ పదుల వేలు

దెచ్చు తోఁట మీకు ♦ నిచ్చెద, నని చెప్ప
వలదు, వల, దటంచుఁ ♦ బలికె నతఁడు. 232

తే.గీ. కొండు కొండని మధురనా ♦ ఘండు రామ
కృష్ణు మోమోటపెట్టె, నీ ♦ విట్లె యింక
నొక్కసారి వచించిన ♦ నుండ కిచట,
వెడలి పోయెద నని భయ ♦ పెట్టె నతని. 233

క. ఇరువదివేల ధనంబును
మఱియొకఁ డీయంగఁ దలఁచు ♦ మాట చెవిఁ బడఁగా,
బరితాప మొంది యాతఁడు
దురపిల్లెను బాష్పవారి ♦ తోరముగాఁగన్. 234

సీ. గజిబిజి సేసెడు ♦ కరణాళి యతనికిఁ
గోఱ లూడిన సర్ప ♦ వార మయ్యె,
మర్కటంబును బోలు ♦ మనము నిశ్చలవృత్తిఁ
బ్రాణవిహీనమౌ ♦ ప్రతిమ యయ్యెఁ,
బురుషుల చిత్తము ♦ హ్వారియించు విరిబోఁడి
పరమహంసునకమ్మ ♦ పరుస యయ్యె,
వెండిబంగరుతాఁకు ♦ నిండునిద్రనుగూడఁ
దలఁకించియేఁచు పె ♦ ద్దయ్యమయ్యె,

తే.గీ. స్వప్రయోజనపరత స్వ ♦ ప్నమున నైనఁ
జెనక దయ్యె, సమాధులు ♦ స్థిరము లయ్యె,
పొంద మతనికి సచ్చిదా ♦ నంద మయ్యె,
రామకృష్ణాఖ్య యన్వర్థ నామ మయ్యె. 235

ఆ.వె. క్రీస్తులోని యాత్మ, ♦ కృష్ణుని యాత్మయు,
బుద్ధు నాత్మ, మహిత ♦ ప్రవక్త నాత్మ

'తఁడు నాత్మ, యన్ని ♦ గన నొక్కఁడే యంచు
శిష్యులకు నతఁడు ♦ సెప్పుచుండె. 236

వ. మఱియు. 237

కం. తనశిష్యులు వందనముల
నొనరింపఁగ, నతఁడు వాని ♦ నొల్లక, సకలం
బును బరమాత్మయె కావునఁ,
దనకుం దా నెట్లు మ్రొక్కుఁ ♦ దగు? నని యడుగున్. 238

వ. ఇట్లు రోగపీడితుండయ్యుఁ బరోపకారధురీణుండై కొన్నినాళ్లుండి,

సీ. పదునాఱశతకంబున ♦ నొక పదునెన్మిది
వందల యేండ్లకుఁ ♦ బై, నెనుబది
యాఱవ వర్షంబు ♦ నందు, నష్టమమాస
మునఁ, బదియాఱవ ♦ దినమునందుఁ,
బది గంటలకు, నిశా ♦ భాగంబునందున,
రామకృష్ణుఁడు, మహా ♦ రాజయోగి,
యోగస్థుఁడై, బ్రహ్మ ♦ యోగంబుఁ గాంచెను,
శిష్యు లందఱు గుండె ♦ చెదరి కుంద.

తే.గీ. నరుల యజ్ఞానతమమును ♦ విరియఁ జేయ
నవతరించిన జ్ఞానస ♦ హస్రకరుఁడు
వెలిఁగి యేఁబది మూఁడేండ్లు, ♦ తెలివిఁ జిమ్మి,
యందఱును దుఃఖ మొందఁ దా ♦ నస్తమించె. 240

సీ. సలలితాంగ్లేయభా ♦ షావిశారదుఁ, డన
మానవక్తృత్వసం ♦ పద్యుతుండు,
చిన్ననాఁటనె సన్య ♦ సించి, దేశాంతర
ములకేగి, మతబోధ ♦ ములను జేసి,

యమెరికా యూరప్పు ♦ లందలి జనుల కా
ముష్మికజ్ఞానస ♦ మొమ్రద మిచ్చి,
యతులసత్కీర్తిచే ♦ మృతజీవుఁడై, వివే
కానందనామాంకుఁ ♦ డైన ఘనున,

ఆ.వె. కిజితేంద్రియుండు, ♦ నీసంయమీంద్రుఁ, డీ
వ్రాయఁ జదువ లేని ♦ బ్రాహ్మణుండు,
సూరివంద్యుఁ డైన ♦ యీ రామకృష్ణుండు,
కోరుకొనిన జ్ఞాన ♦ గురుఁడు సుండి! 241

మాలిని, జలజసదృశనేత్రా! ♦ శ్యామశృంగారగాత్రా!
ఖలదనుజవిదారీ! ♦ కల్మషధ్వంసకారీ!
జలధిమదవిశోషా! ♦ సాధుసంతానపోషా!
సలలితగుణసాంద్రా! ♦ స్వస్తి, శ్రీరామచంద్రా! 242



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

# రెండవ భాగము.

## శ్రీరామకృష్ణ పరమహంస నీతిబోధావళి.

ఉ. ఏవిభుపావనాఖ్య లిఖి • యింతురు వ్రాఁతలఁ దొల్త నన్నిఁటన్,
సేవ యొనర్తు రెవ్వనికిఁ • జిత్రముఖంబున భక్తియుక్తిచేఁ
గోవెలలందు మానవులు • గొల్లకొలందిగ నన్ని యూళ్లలో,
నావనజాక్షు రాఘవు న • హర్నిశ మంజలిఁ జేసి కొల్చెదన్. 1

### ద్వైతత్వము.

ఉ. రేలను గోచరంబు లగు • చుక్కలఁ బ్రొద్దున లేచి కాంచఁగన్
1 గాలక, మింటిపైని దివ • సంబునఁ జుక్కలె యుండ వంచ నం
బోలునె? యజ్ఞాని న్మనుఁగు • బ్రొద్దుల నీశునిఁ జూడలేక యా
మేలిక లేఁడటంచు వచి • యింపఁగఁ బాడియె నీకు మానవా! 2

ఉ. కొందఱు వారి యంచు, మఱి • కొందఱు నీరని, యేకమైన నీ
2 టిం దిలకించి పల్కుగతి, • వేదముల న్భజియింతు రాచిదా
నందుని నద్వితీయుని జ • నంబులు, బ్రహ్మ యటంచుఁ గొందఱున్,
గొందఱు విష్ణుఁడంచు, నిఁకఁ • గొందఱు శంభుఁడటంచు, వేఱుగన్.

సీ. మార్గస్థు లిద్దఱు • మ్రాఁకుపైఁ గృకలాస
3 ముందు దూరంబుగా • నుండి చూచి,
నీలవర్ణ మటంచు, • నికరంపు రక్తస
రట మంచు, వర్ణచ • ర్చలను దవిలి,
యూతరుమూలమే • యావాసముగ నెప్పు
డుండెడు నొక నరు • నొద్ద కేఁగి

యెఱుఁగ, నిర్వర కాంతఁ ♦ డౌ నని మార్వత్కు;
సామాన్యభక్తు లీ ♦ చందమున నె
తే.గీ. యెట్టి రూపంబునను గొల్తు ♦ రట్టి రూప
మును జూతురు పరమాత్ముఁ; ♦ బూర్ణుఁ డైన
జ్ఞాని యొక్కఁడె యానిరా ♦ కారుఁ డీశుఁ
డయుతరూపంబులను దాల్చు ♦ నని యెఱుంగు. 4
తే.గీ. నామరూపంబు లీశ్వరు ♦ నకు ననంత
4 ములుగఁ గల; వీవు పేనిచేఁ ♦ దలఁచి యతని
భక్తిఁ బూజింతువో నదా ♦ వానిఁ దాను
దాల్చి సత్కృప నీకుఁ బ్ర ♦ త్యక్ష మగును. 5
సీ. సర్వగతుం డైన ♦ సర్వేశు నెల్లరుఁ
5 గాంచఁగ లేమికిఁ ♦ గతము వినుము,
దట్టంబుగా నాఁచు ♦ పట్టిన గుంటగ
ట్టున నిల్చి నీరంబు ♦ మనుజుఁ డెప్పు
డేనిఁ జూడఁగఁగల్గు ♦ నే? యాజలముఁ జూడ
మనసైన, శైవాల ♦ మునుఁ దొలంచ
వలె, నట్లె మాయాఖ్యఁ ♦ బరఁగి వ్యాపించెడి
పొర నేత్రముల కడ్డు ♦ పొరఁగ, లోక
తే.గీ. మంతటను నిండి యుండెడు ♦ నట్టి మేటిఁ
బ్రాత్తిగను జూడలే నంచు ♦ మూర్ఖ వీవు;
చూడఁ గోరిక వొడమినఁ, ♦ బొడుమాయ
పొరను దొలఁగించు నీనేత్ర ♦ పుటమునుండి. 6
చ. తనకను లెల్లర న్గనఁగఁ ♦ ద నొక్కరు లెవ్వరుఁ జూడలేని శ్రీ
6 తని దెరమాటునుండి పరిఁ ♦ దీర్చుకొను న్దద గొప్పయిందికా

నినీ; జగదంబ యాపగిది ♦ నేర్పున మాయాపిఱుంద నుండుఁ; గ
న్కనె తెరదాఁటి చేరవలెఁ ♦ గాంచఁగ నామె నిఁ కెట్టిభక్తుఁడున్.

తే.గీ. ఏండ్లతరబడిఁ బెన్నిధు ♦ లింట నున్న
7 దీప మెతెంచి వానిని ♦ బాపునట్లు,
లెన్నిజన్మములనొ కూర్పు ♦ కొన్న పాప
సమితి విరియును దేవుని ♦ సదయదృష్టి. 8

మ. ఉపధానోపరిభాగచేలములలో ♦ నొక్కొక్క టొక్కొక్క వ
8 ర్ణపువస్త్రంబుగ నుండి తూల మతిశు ♦ భ్రచ్ఛాయ నంతస్థమై
యుపగూఢంబుగ నుండు మాడ్కి, బహువ ♦ ర్ణోదంచితోపాధులం
దెపు డుండుం బరమాత్మ స్వచ్ఛముగఁ దా ♦ నేకస్వరూపంబునన్.

తే.గీ. మనుజవాగుదీరితము లౌ ♦ టను, బురాణ
9 వేదతంత్రంబు లెంగిలి ♦ వియె యయినను,
వాగగోచర మగు పర ♦ బ్రహ్మ మొన్న
నట్టు లపవిత్ర మని చెప్ప ♦ నగునె మనకు? 10

శా. దూరస్థుం డగు దృష్టకుం గడలియం ♦ దుం గ్లు తోయంబు న
10 ల్పారం దోఁచుచు, దగ్గఱ న్జనఁగ స్వ ♦ చ్ఛాభ న్ప్రకాశించున
ట్లే, రూపాసితవర్ణుఁ డౌచు నల శ్రీ ♦ కృష్ణుండు మూఢాళికిన్,
జేరం జాలెడు భక్తవర్యుల సుదృ ♦ ష్టి న్మించు దివ్యద్యుతిన్. 11

సీ. అంధులు ముప్వురు ♦ హస్తిని స్పృశియించి,
11 యా లోకండును దాని ♦ గర్భ మొకఁడుఁ
గర మొకండును బట్టి, ♦ కంబంబువలె నుండు,
బుట్ట పోలిక నుండు, ♦ ముసలమువలె
నుండు, న న్వాగ్వాద ♦ మొందు వెట్టుక, కరి
సత్యరూప మెఱుంగు ♦ జనుని కడకుఁ

సీ. "గాలి కంబంబు ♦ చాడ్పుగా నుండును
గరిటయంత యుండ దా ♦ కరణి నెపుడుఁ,
ఆ.వె. బుటిక రీతిఁ బొట్ట, ♦ ముసలంబుమాడ్కి
దుండ, ముండుఁ గాని ♦ యుండదుసుఁడి
సరిగఁ జూడ నట్లు ♦ కరటియంతయుఁ గూడఁ,
జీవులార!" యంచుఁ ♦ జెప్పె నతఁడు. 12

తే.గీ. ఆత్మరూపలిబు లమితంబు, ♦ లందులోన
నొక్కరూపంబునే చూచి ♦ యుండువాఁడు
వాస్తవంబును గాంచక ♦ వాదులాడుఁ
దన యభిప్రాయమే సత్య ♦ మనుచు, నిల్లె. 13

తే.గీ. జనులఁ గఱచెడు పాము, వి ♦ షంబుఁ దొలఁచి
12 తిరుగ జీవన మిచ్చు మాం ♦ త్రికుఁడు, దండ
నాధికారియు, దోషియు, ♦ నరయఁ దానె
యనుచు భగవంతుఁడు నిజభ ♦ క్తునకుఁ జెప్పె. 14

తే.గీ. కన్నగానికిఁ జౌర్యంబుఁ ♦ గఱపువాఁడు,
13 మెలఁకువను గొల్పి గేస్తును ♦ నిలుపువాఁడు,
నొక్క భగవంతుఁడే, కాన ♦ సర్వ సర్వ
కార్యముల కాతఁడే మూల ♦ కారణంబు. 15

క. చిమ్మటగొట్టము నందున
14 నెమ్మోమ్మడ్కిని గట్టి యుండు, ♦ నీశ్వరుఁ డిలలో
నమ్మాడ్కి నుండు నరదే
హమ్ముల, వెలుగను, వాని ♦ నంటక యెపుడున్. 16

ఆ.వె. గంట మోగ్రఁతఁ బట్టి ♦ ఘంటాస్వరూపంబు
15 నూహసేయఁ గలుగు ♦ నోజ, మనము

సృష్టియందుఁ గల్గు ♦ చిత్రంబులను బట్టి
దేవతత్వ మూహఁ ♦ దెలియఁ గలము. 17

తే.గీ. చక్కెర గరంగి పెక్కు భ ♦ క్ష్యంబు లౌచు
16 నంగడిని గనఁబడు రీతి, ♦ నద్వితీయ
మైన పరమాత్మ, రూపస ♦ హస్రములను
దాల్చి దృగ్గోచరం బగు ♦ ధాత్రిలోన. 18

ఆ.వె. ధారిణీతలంబు ♦ నారాయణవ్యాప్త
17 మంచు, నందుఁ గలప ♦ దార్థవితతి
యంతెఁ గూడ నతని ♦ యాకారమే యంచు,
నెంచు; మితరవస్తు ♦ వెద్ది లేదు. 19

సీ. అట్టిట్టి దని చెప్ప ♦ నగునె బ్రహ్మానంద
18 సాగరసంసర్గ ♦ శస్తమహిమ?
దాని వాయువు దమ్ముఁ ♦ దాఁకుటచే సన
కాదిసంయములు మ ♦ హాత్ములైరి,
యాసాగరంబునే ♦ యురసి నారదుఁ డొక్క
సారి యహంకృతి ♦ సడలిపోవఁ
గ్రిమ్మరు దాని వా ♦ క్రుచ్చుచు నెల్లెడఁ
బిచ్చిపట్టినవాని ♦ విధముగానె,

తే.గీ. దాని స్పృశియించి శుకయోగి ♦ తన్మయత్వ
మునను బర్విడె బాలుని ♦ పోల్కి, దానిఁ
గ్రోలి యాయాదిపురుషుండు ♦ సోలిచేష్ట
దక్కిపడియుండు, దాని చి ♦ త్రంబుఁ గనుము. 20

తే.గీ. నాటకంబున నొక్కఁడే ♦ నటుఁడు పెక్కు
19 వేషములఁ దాల్చి నర్తించు ♦ విధముగానె,

రాజిలుఁ బ్రపంచనాటక ♦ రంగమందుఁ
పెక్కురూపంబులను దాల్చి ♦ యొక్కయాత్మ. 21
తే.గీ. రక్షకభటుండు రాత్రి క ♦ రంబునందుఁ
20 బట్టు కాచదీపముదీప్తిఁ ♦ బైని వేయు
వఱకు నన్యులు గనలేరు ♦ వానిఁ, గాని
పరులఁ దాఁ జూడఁగల్గు; నీ ♦ పగిదిగానె, 22
ఆ.వె. పరమపురుషు కరుణ ♦ ప్రసరించుదాఁక నా
తండు మనకు గోచ ♦ రుండు గాఁడు,
కాని యాతఁ డెపుడుఁ ♦ గాంచుచునే యుండు
వసుధలోన నుండు ♦ వాని నెల్ల. 23

## జీవతత్త్వము.

తే.గీ. మండు ప్రొయిపైని జలయుత ♦ భాండ ముంచి
21 తండులంబులుఁ గాయలు ♦ దాన నిడినఁ
బక్వ మగుఁ, గాని యుడికించు ♦ పటిమ తద్ఘ
టాదివస్తువులది గాక ♦ యగ్గిది గద! 24
తే.గీ. కుండ మానవదేహ, మం ♦ దుండు జలముఁ
దక్కు వస్తువులును మన ♦ స్తత్త్వముఖ్య
కరణజాలంబు, ప్రొయిలోనఁ ♦ గాలు నిప్పు
శక్తి వానికి నొసఁగెడు ♦ సచ్చిదాత్మ. 25
ఉ. వారివికారబుద్బుదము ♦ వారికె నన్యముగాఁగఁ దోఁచి యు
22 ద్వారి నడంగుమాడ్కి, క్షణ ♦ భంగురము స్వరతంత్ర మాచువి
స్ఫారపరేశతత్త్వసదృ ♦ శం బగు జీవపదార్థ మాత్మగం
భీరపయోధి లీనమయి ♦ మించి యభేదముఁ జాటునెల్లెడన్. 26
సీ. అస్థిరం బేవంబు ♦ నమితదుఃఖాత్మకం
23 బని యెఱింగియును, గా ♦ యంబు నేల

జ్ఞాని రక్షించుకోఁ ♦ బూను నన్న, వినుండు!
పట్టికరండ మె ♦ వ్వండు శ్రద్ధఁ
గాపాడఁ జూడఁడు, ♦ గాని రత్న పేత
పేటిక నేమఱి ♦ విడువ కుండఁ
గాపాడు, నీరీతి ♦ గానె యాజీవాత్మ
మాణిక్యసదృశ ము ♦ న్నాత్మ దెలిసి,
ఆ.వె. మోక్షసాధనంబు ♦ పురుషుని తను వని,
జీవరాగమునను ♦ జేసి, జీవు
నకు నుపాధి యైన ♦ నశ్వరదేహంబు
జ్ఞాని శ్రద్ధతోడఁ ♦ గావఁజూచు. 27
సీ. ఇలఁ గల్గు జీవాత్మ ♦ లేకరూపము లైన,
24 వివరింప నాలుగు ♦ విధము; లందు
నిహసుఖదుఃఖంబు ♦ లెలసి తద్బద్ధంబు
లగునవి బద్ధాత్మ ♦ లనఁగఁ బరఁగు;
మోక్షంబుకై కష్ట ♦ ము ల్చాలఁ బడుచుండు
నవ్వి ముముక్ష్వాత్మ ♦ లనఁగఁ బరఁగు;
విజ్ఞానమున ముక్తి ♦ వీథినిఁ జరియించు
నయ్యవిముక్తాత్మ ♦ లనఁగఁ బరఁగు;
తే.గీ. నింకఁ బుట్టుట గిట్టుట ♦ యేమి లేక
నిత్యపరమాత్మ నేకమై ♦ నెగడు నట్టి
యాత్మ లన్నియు నిత్యము ♦ క్తాత్మ లనఁగఁ
దెలియఁబడుచుండు; నాత్మల ♦ తెఱఁగు లివ్వి. 28
సీ. పరిపక్వములు నా, న ♦ పరిపక్వములు నాఁగ,
25 జీవాత్మ లుండును ♦ సృష్టియందుఁ;

పురుషుఁ డహంభావ ♦ మును బూర్ణముగఁ జంపి,
తానె బ్రహ్మం బని ♦ తలఁచుచుండి,
కాయమింతయుఁ దన ♦ కాయంబు గా దని,
తాఁ జేయుపనులకుఁ ♦ దాను గర్త
గాఁడని, యెంచిన ♦ వాఁడు పక్వాత్ముఁడౌ;
నటుగా కహంకృతి ♦ నంటి యుండి
ఆ.వె. జరుగు చెయువు లన్ని ♦ స్వకృతకార్యము లంచుఁ
బొంగి విఱ్ఱవీఁగు ♦ పొగరుఁబోతు
నాత్మ, యపరిపక్వ ♦ మైనట్టి బద్ధాత్మ
యే, యటంచు బుద్ధి ♦ నెఱుఁగవలయు. 29
తే.గీ. గంటలను గొట్టు యంత్రంబు ♦ నంటి తిరుగు
26 రెండు ముండ్లును వేఱుగా ♦ నుండి, గంట
కొక్కసారి గలయుఁ గదా ♦ యొక్కటిగను!
వానికిం గల సంబంధ ♦ వశముచేత. 30
తే.గీ. ఇట్లె జీవాత్మ పరమాత్మ ♦ పృథివియందు
వ్యావహారికభేదంబుఁ ♦ బడసి యున్న,
వాని యన్యోన్యసంబంధ ♦ వశముచేతఁ
గాంచ నపుడప్పు డేకమై ♦ కలసిపోవు. 31
క. భూతేంద్రియపంచకముల
27 వాతం బడి శుద్ధ మైన ♦ పరమాత్మ, భవ
వ్రాతంబులలోఁ జిక్కుచు
నాతతదుఃఖములఁ బొందు ♦ నదియే యాఁగా! 32

## మాయతత్వము.

తే.గీ. వారిదచ్ఛన్నసూర్యబిం ♦ బంబు, మొయిలు
28 విరియు పిమ్మట మింటఁ గా ♦ న్పించుకరణి,

సాంద్రమాయాపరిచ్ఛన్న ♦ సచ్చిదాత్మ,
మనకు గోచర మగు మాయ ♦ మాయమైన. 33

ఉ. త్రోవను నేగు ♦ చొక్కయవ♦ధూతుఁడు మార్గమునందు నెవ్వఁడే
29 సేవకుఁ డొండు చేకుఱిన ♦ సేమమటంచుఁ దలంచి, బాటపైఁ
బోవుచునున్న పంచముని ♦ ముందఱికి న్జని, నాకు సేవకై
యీ వరుఁడెంచెదే? యనిన♦నిట్లని వాఁడు వచించె నివ్వెఱన్. 34

ఆ.వె. «మాలవాఁడ నేను, ♦ మర్యాదయే నాకు
మిమ్ముఁబోఁటివారి ♦ మేను దాఁక?»
ననిన మాటలాడ ♦ కరుదెంచి నా కుప
చర్య సేయు మంచు ♦ సాధు వనెను. 35

క. ఇరువురుఁ బిమ్మట నొక పురి
కరిగి, గృహంబొండు సొచ్చి; ♦ రందుల నిష్టన్
గుఱుఁ డుండి, యింటివాకిట,
నొరు లెవ్వరు రాక యుండ, ♦ నుంచెనొ మ్మలన్. 36

ఆ.వె. పాఱుఁ డొక్కఁ డతని ♦ పజ్జకుఁ జని, నాదు
పాదరక్ష లిటకుఁ ♦ బట్టి తెమ్మ
టన్న, నేమి మాట ♦ లాడమి, నీ వంత్య
జునివలె నగపడుదు ♦ వనిన, వాఁడు, 37

క. చయ్యనఁ జని సాధువుతో
«నయ్యా! నాగుట్టు వెల్ల ♦ డయ్యె, న్నే నె
ట్లయ్యా నిలుచుట యిఁక?» నం
చొయ్యనఁ బరువెత్తె నుండ ♦ నోపక యచటన్. 38

క. సరిగా నీవిధమున నె
వ్వరు మాయాతత్వ మెఱుఁగ ♦ వలఁతు లగుదురో,

మొఱఁగిన వెంటనె పసవిడి
యరుగుం జుమి మాయ, వారి ♦ నంటక భీతిన్. 39

ఉ. సింగపు మాయమోముఁ దలఁ ♦ జేర్చిన, భీకరుఁడౌచు సోదరుం
30 డుం గనుపట్టు మాడ్కిని, బ ♦ హుప్రకృతిచ్ఛదసంవృతాత్మ చూ
డంగను భీకరంబె యయి, ♦ టక్కరిమాయ వోలంగ, మేనిలో
నంగల జీవునోజనె క ♦ నంబడు శాంతిని దర్శనీయమై. 40

ఆ.వె. వారిధార రెండు ♦ పాయలుగాఁ జేయు
31 నంతరస్థకాష్ఠ ♦ మట్లె, యేక
తత్త్వమునకు నడ్డు ♦ దగిలి మాయోపాధి
సేయు నీశ్వరునిగ ♦ జీవునిగను. 41

ఆ.వె. మనుజుఁ గనుమొఱఁగు ♦ మాయనైజము చక్క
32 నెఱిఁగితేని యద్ది ♦ విరిసి పోవుఁ;
బొంచి దాఁగు దొంగఁ ♦ బొడగాంచు వెంటనే
పరువు లిడఁడె కనులఁ ♦ బడక నీకు? 42

తే.గీ. స్ఫటికమునఁ గాంచు దీపంబు ♦ బహువిధంబు
33 లైన వర్ణంబులుగఁ దోఁచు ♦ ననువుగానె,
పలు తెఱంగుల మిథ్యాప్ర ♦ పంచ మగప
డునుగదా! మాయపొర గప్ప ♦ కనులఁ జూడ. 43

ఉ. ముందుగ రాముఁడు, న్నడుమ ♦ భూసుత, వెన్కను లక్ష్మణుండు,నీ
34 చందముగాఁ బ్రయాణమును ♦ జల్పుచుఁ గానల కేగుచో, మదిన్
గుందుచు లక్ష్మణుండు దన ♦ కు న్గనిపింపమి నగ్రజుండు, సీ
తం దొలఁగంగ వేఁడుకొని ♦ తాఁగనియె న్రఘురాముఁబిమ్మటన్.

ఆ.వె. మాయ యీశునకును ♦ మానజీవులకు నిట్లె
యడ్డ మాట, నతని ♦ నరయలేము.

మాయ దొలఁగు వెనుక ♦ నాయాశువిస్పష్ట
ముగను గాంచి ముక్తిఁ ♦ బొందఁగలము. 45

ఆ.వె. దయ్య మంటినతఁడు ♦ తనను దయ్యము సోఁకె
35 నంచు నెఱుఁగ, నద్ది ♦ యరుగుపగిది,
జీవుఁడు దను మాయ ♦ చెనకె నం చెఱుఁగంగ,
భీతిఁ జెంది యద్ది ♦ విరిసి పాఱు. 46

సీ. సర్షపబీజము ♦ జ్జపియంచి, సోఁకిఁడు
36 పట్టిన మానవు ♦ పైని జల్లఁ,
బట్టిన దయ్యంబు ♦ పాఱిపోవును, గాని
యావగింజలనె ద ♦ య్యంబు డాఁగి
నిల్చినఁ, బోవునే ♦ నెలకొని యున్నట్టి
దయ్య? మీపోల్కి శు ♦ ద్ధంబు సత్య
మైనట్టి పరమాత్మ ♦ నరయఁజేసెడి జ్ఞాన
మంత్రబీజంబుల ♦ మాయ విరియుఁ,

ఆ.వె. గాని విషయభోగ ♦ కలుషాంతరంగుల
పూనికలను మాయ ♦ పొలియ దెపుడు;
మాయ పొలియ కున్న, ♦ మఱియొందు సాధనం
బునను రాదు రాదు ♦ మోక్షపదవి. 47

క. ఘన మగు బ్రహ్మజ్ఞానం
37 బున కవరోధం బొనర్చి ♦ ముక్తికి భంగం
బును దెచ్చునట్టిదే సుఁడి
తనరును మాయ యను పేర ♦ ధారిణిలోనఁ. 48

తే.గీ. ఉరగ మాస్యంబునను శ్వేళ ♦ మూని యుండి,
38 తాను జావక, తనచేత ♦ దష్టులైన

వారి దోరుచుఁ; బరమాత్ముఁ ♦ జేరి యున్న
భీకరంబగు మాయ యీ ♦ విధముగాను, 49

క. పరిశుద్ధం బగు బ్రహ్మము
నొరపిడిఁ బెట్టంగలేక, ♦ యూర్జితవృత్తిన్
జరియింపలేని మనుజుల
వెతఁబెట్టుచు వారిఁ జాల ♦ వేధించునుగా! 50

ఆ.వె. పిల్లి, పండ్లఁ దనదు ♦ పిల్లలఁ బట్టిన
39 హాని లేదు గాని, ♦ యద్ది మూషి
కంబుఁ బట్టెనేనిఁ, ♦ గడగండ్లఁ బడుచుమూ
షకము దానిచేతఁ ♦ జచ్చు; నిట్లె, 51

క. మాయామాతయు, భక్తున
కేయాపద సేయకుండ ♦ నెలమి నొసఁగుచున్,
రాయిడి పెట్టి, తదితరుల
నాయమ నిలువంగనీయ ♦ దవనీస్థలిపై. 52

## బద్ధపురుషులు; ముక్తపురుషులు.

సీ. పరుసవేదినిఁ దాఁకి ♦ స్వర్ణమై, లోహంబు
40 తప్తమైనను ధరా ♦ స్థగితమైనఁ,
బడియున్నఁ బెంటపై, ♦ స్వర్ణవర్ణము మాఱి
కఱిమ్రల నినుముగాఁ ♦ గాని రీతిఁ,
బరమేశు నొకసారి ♦ దరిసించి మనుజుండు
చిత్త మాతనియందుఁ ♦ జేర్చెనేని,
సంసారమున నున్న, ♦ సన్యాసిగా నున్న,
నడవి నున్నను, బురం ♦ బందునున్న,

ఆ.వె. నన్యజనులఁ బట్టి ♦ యలయించు నైహిక
బంధవితతి యతనిఁ ♦ బటగాదు.



పొందఁ డాతఁడింక ♦ మోదంబు ఖేదంబు,
ద్వంద్వశృంఖలములఁ ♦ దగులఁ డెపుడు. 53

ఆ.వె. స్పర్శవేది నంటి ♦ బంగారు ఖడ్గమై
41 యుక్కు కత్తి, పూర్వ ♦ మున్న రూపుఁ
బాయకున్నఁ, దాను ♦ పరహానికర మైన
నీచకృత్యములను ♦ నెఱప లేదు. 54

ఆ.వె. సచ్చిదాత్మదివ్య ♦ సందర్శనప్రాప్తి
గలుగఁ, దొంటి రూపు ♦ దొలఁగ కున్నఁ,
బురుషుఁ, డల్లె, నీచ ♦ పురుషార్థములఁ జిక్కి
తుచ్ఛసౌఖ్యవితతి ♦ త్రోవఁ బోఁడు. 55

సీ. జలధిపైఁ బోయెడు ♦ కలము, నంబుధిలోని
42 సూదంటురాకొండ ♦ సులభముగను
బట్టి, యాకర్షించి, ♦ ప్రక్కలుగాఁ జేసి,
యోడరూ పంతయుఁ ♦ బాడుచేసి,
జలరాశి ముంచెడు ♦ చాడ్పున, నుత్తమ
భక్తుని జీవాత్మఁ ♦ బట్టి లాగి,
పరమాత్మ, యానర ♦ వరు మనంబును బారి
గొనుచు, నహంభావ ♦ మును నడంచి,

ఆ.వె. యీశ్వరుండు జీవుఁ ♦ డేకమే యను మాట
యనుభవమున సత్య ♦ మనుచుఁ దెల్పి,
సచ్చిదాత్మమై యొ ♦ సంగెడు తనలోనఁ
జెడ్డ రూపు మాపి ♦ చేర్చుకొనును. 56

ఉ. [illegible]లుదకంబుతోఁ గలియు ♦ భంగిని, గూడక వెన్న, దానిపైఁ
43 [illegible]చునుండురీతి, జగ♦తి న్బరమాత్మ నెఱింగి జ్ఞానసం

క్షాళితచిత్తుఁ డైన నర♦సత్తముఁ, డుండినఁ బాపసంగతిన్,
దూలదు నిర్మలత్వము, ము♦నుంగఁడతండిహ కల్మషంబులన్. 57

సీ. క్రొత్తగా భర్తను ♦ గూడిన చేడియ,
44 విభునిపైఁ బ్రాణంబు ♦ పెట్టుకొనుచు,
మగనిపొందే స్వర్గ♦ముగ నెంచుకొనుచుండి,
పిల్లలు గల్గిన ♦ వెన్క నతని
పైఁ గల మోహంబు ♦ వదలుచు, బిడ్డను
నిరతితో ముద్దాడి ♦ మురియుమాడ్కి,
సజ్ఞానమున నుండు ♦ నంతకాలంబును
నైహికసుఖలోలుఁ ♦ డైన నరుఁడు,
ఆ.వె. జ్ఞానవంతుఁ డగుచు, ♦ సర్వేశ్వరుని గాంచు
పిదప, నైహికముల ♦ విడిచిపెట్టి,
శాంతచిత్తుఁ డౌచు, ♦ సచ్చిదానందాబ్ధి
ననవరతము నోల ♦ లాడుచుండు. 58

తే.గీ. ఆరఁ బక్వంబులై సిద్ధ ♦ మైన కంద
45 మూలవార్తాకములు దూది ♦ వోలె నెట్లు
మెత్తనౌ, నట్లె సిద్ధుండు ♦ మృదులతయును.
నమ్రితయుఁ దాల్చు జ్ఞానపూ ♦ర్ణత్వమునను. 59

తే.గీ. సిద్ధులౌ మనుజులు, స్వప్న ♦ సిద్ధ, మంత్ర
సిద్ధు, లనియును మఱి, హఠాత్సిద్ధు, లనియు
నల, కృపాసిద్ధనిత్యసి ♦ద్ధు, లని యైదు
తెఱఁగులై కానిపింతు రి ♦ద్ధరను మనకు. 60

తే.గీ. దైవమే వచ్చి కలల బో ♦ధనము సేయ
జ్ఞానసంపూర్ణుఁ డౌవాఁడు ♦ స్వప్నసిద్ధుఁ;

పోనటఁ బావనమంత్రిసా ♦ ధనముచేతఁ
బడయఁ బూర్ణత, మంత్రిసి ♦ ద్ధుఁ డని పరఁగు. 61

ఉ. ఇల నిజువేద గుప్తధన ♦ మెట్టు లోకప్పుడు గాంచఁ గల్గునో,
కలుములు గల్గు చేడియ నో ♦ కానొకపట్టున నెట్లు పెండ్లిగాఁ
గలుగునో, యవ్విధంబుననె ♦ కాంతురు దేవునిప్రాపు, నెట్టిసా
ధులు, పరిపూర్ణులై త్రుటిని, ♦ బొంది మహాత్మ్యత సిద్ధనామముల్. 62

చ. తటుకుచుఁగానఁ, బూర్వభవ ♦ సంబోతటాక మొయందుఁగాంచి, కొం
దఱు శ్రమమింతఁ జెందఱు గ ♦ దా! గృహమేఁ జెఱువేనిఁగట్టి, ని
ద్ధర నటె కష్టమొందకయె, ♦ దైవకృప, స్వమ భాగ్యవృత్తిఁ, గొం
దఱు పరిపూర్ణు లయ్యెదరు, ♦ తాల్చి కృపాయుత సిద్ధనామముల్.

చ, వెడలును గాయ దొల్త, నటు ♦ పిమ్మటఁ బుష్పదళంబు లన్ని, గు
మ్మడిలత; నిత్యసిద్ధు లటు ♦ మానుగ జన్మముతోనె సిద్ధతన్
బడసి ప్రపూర్ణులౌదు; రిఁక ♦ వారలు సిద్ధతకై యొనర్చు నా
కడఁకలు మానవాళి కన ♦ ఘం బగు దారిని జూపనే సుమీ! 64

తే.గీ. సంతకును ద[illegible]ండు ♦ నంతవఱకు,
46 వట్టి కోలాహలధ్వని ♦ పడుచుఁ జెవులఁ,
జెంత కేగిన స్పష్టమై ♦ సంతలోని
మాట లన్నియు వినఁబడు ♦ మాడ్కి, నరుఁడు, 65

తే.గీ. బ్రహ్మమునకాటి, దూరమై, ♦ వట్టి యర్థ
శూన్యచర్చల విని, జ్ఞాన ♦ శూన్యుఁ డగుచు,
నీశు దరిఁజేరి ద్వేషంబు ♦ లెల్ల వదలి
భగవదాకృతిఁగను స్పష్ట ♦ ముగను బిదప. 66

సీ. ప[illegible]టెంకాయ ♦ పై సీలఁగొట్టలో
47 [illegible]బ్బెర ♦ పగిలిపోవుఁ;

బండిన బెంకాయ ♦ పైని గొట్టిన మేకు
గుదిడికొబ్బెర విడఁ ♦ గొట్ట లేదు;
పరిపక్వహృదయనం ♦ పన్నుఁజా జీనస్సు
నిట్టె యూధులు కొట్టు ♦ గొట్ట, నతఁడు
బాధ యించుకయును ♦ బడకుండఁ, దన్ను హిం
సించువారికి ముక్తి ♦ ని మ్మటంచు

తే.గీ. దేవుఁ బ్రార్థించె; నీపగి ♦ దిని బ్రసిద్ధ
శుద్ధసత్వప్రధానసం ♦ సిద్ధతతికిఁ
గాయ మాత్మయు విడిపోవు ♦ కతన, దేహ
కష్టములు వారి చిత్తముల్ ♦ గలఁచలేవు. 67

చ. ఒకనికి మంచి ఖాద్యము, నిఁ ♦ కొక్కనికి న్విచిరప్రవాళ, మిం
68 కొకనికి బొమ్మ, సూనులకు ♦ నొక్కొకచే యిటు లిచ్చి, మాతలో
నికి గృహకృత్యము ల్సలుప ♦ నెట్టన యేగఁగఁ, గన్నతల్లి నిం
చుక స్మృతినుంచుకొరుగద ♦ సూనులు సక్తతఁ జెంది క్రీడలన్!

ఆ.వె. అమ్మ! యనుచు నేడ్చు, ♦ చాటవస్తువులను
విసరివైచి, తల్లి ♦ వెంటఁ బడఁగ,
నామె తిరిగి వేగ ♦ నవ్వానిపజ్జకుఁ
బోయి పోతుదీర్చి ♦ బుజ్జగించు. 69

తే.గీ. ఇట్లె జగదంబ నరుల నై ♦ హికసుఖాభి
రతులఁ జేయుచు, మఱపించి ♦ సుతుల నెల్లఁ,
బ్రిబలమైనట్టి సృష్టికా ♦ ర్యంబుఁ బూని
స్వేచ్ఛగాఁ దనపనులఁ గా ♦ వించు చుండ, 70

ఉ. జనని, భవాని, నోయి మను ♦ జా! మఱపొందితి వయ్య
జనితముధాసుఖంబులను ♦ నక్కఁడవె యనిశంబు, నటుగ

దినుము విడల్చివైచి యవి, ♦ యంబ! జగజ్జననీ! యటంచు వెం
టను బడితేని యాయమ ద♦టాలునఁ గౌఁగిట గ్రుచ్చియెత్తదే? 71

చ. ఇల సుమకర్ణికల్గల మ♦హీరుహబృందము చందనాకృతిన్
49 మలయజవాతపోత మొక♦మా అటు వీవఁగఁ బొందుచుండుఁ; బూ
వుల నటు దిమ్మలేని తరు♦వుల్కదళీశతపర్వభూరుహా
దులు తమనైజధర్మములు ♦ దూలక నిల్చును బూత్వభంగులన్.

ఉ. స్వామి పరాత్పరుం డల ది♦వమ్మును వీడి దయార్ద్రచిత్తుఁడై
భూమికి రాఁగఁ, బావనతఁ♦బొంది తరించును భక్తి యంకురం
బై మది నాఁటియుండెడు మ♦హాత్ముఁడు, చాలినవాఁడు; గాని తు
చ్ఛమితలోకవాంఛలవి♦హారముసల్పెడువాఁడు మాఱునే? 73

సీ. పరిపక్వహృదయుఁ డౌ ♦ ప్రజ్ఞాని యొక్కఁడు
50 దారిఁ బోవుచుఁ, బ్రమా♦దమున నొకనిఁ
ద్రొక్కెనఁ, బదతాడి♦తుండు గోపంబునఁ
గొట్టఁగా, స్మృతిదప్పి ♦ కూలె సాధు;
వంతట శిష్యులు ♦ చెంతకుఁ జని, యుప
చర్యలు సల్పుచు, ♦ శాంతిపఱచి,
గురువరా! యిచట మీ ♦ చరణముల్వట్టెడి
వా రెవ్వ? రన, నన్నుఁ ♦ బట్టి కొట్టి

తే.గీ. నాతఁడే యని మార్వల్కె; ♦ నట్టి జ్ఞాన
సిద్ధులా వారిచే మేలు ♦ సేయువారుఁ
గీడు సేసెడువారును ♦ గూడ మిత్ర
[illegible]ముగఁ జిత్తమున నెంచఁ ♦ బడుదు రెపుడు. 74

[illegible]కము వాలం బఱి
51 [illegible]దుర్గ సలిలంబునందు ♦ నుఱిగెనిఁ; దమముం

జెండిన జ్ఞాని పరాత్పరు
నండఁగ దుఃఖప్రపంచ ♦ మందును మెలఁగున్. 75

తే.గీ. భారతంబునఁ జెప్పిన ♦ పగిది బ్రహ్మ
52 విదుఁ డహంకార మడఁచిన ♦ పిదప, వర్ణ
భేద మంతయుఁ గృత్రిమ ♦ భేద మంచు
నాత్మసంకల్పితంబు గా ♦ దంచుఁ దెలియు. 76

ఆ.వె. ఎంత దాఁక విప్రు ♦ నెద భేదబుద్ధి దాఁ
బట్టియుండు, నంత ♦ వఱకు నతఁడు
జందెమును ధరింపఁ ♦ జను ; దాని బల్మిచేఁ
దీసి వేయ నతఁడు ♦ గాసి పడును. 77

తే.గీ. పాలు నీరంబుఁ గలియ నా ♦ పాలు దీసి
53 క్రోలఁగా నొక్కహంసయే ♦ చాలుఁ గాని
యన్యవిహగంబులం దొక్క ♦ టైన నట్లు
సలుపనేర్చునె? పుడమి నీ ♦ చందముననె, 78

ఆ.వె. సచ్చిదాత్మ మాయ ♦ సమ్మేళనంబును
బొరసి యుండ, వేఱు ♦ పఱచి యలని
నెఱుఁగఁ బరమహంసుఁ ♦ డే సమర్థుఁడు గాని
యన్యుఁ డెవఁడు సేయు ♦ నయ్య యట్లు? 79

ఉ. వాసముకై ప్రయాసపడి ♦ పాములు పుట్టలు వెట్టుకోకయే
54 వాసముచేసెడున్ బొఱియ ♦ వట్టిన పట్టున నొక్కచోట;.స
న్యాసి గృహంబుఁ గట్టుకొన, ♦ కట్టులె కాలము వెళ్ళఁబుచ్చెడున్
వాసము సేసి నేఁ డొకరి ♦ పంచను, రే పొకనింటి లోపలన్. 80

ఆ.వె. జ్ఞానిని దెలియంగ ♦ జ్ఞాని యేయోపు, నిం
55 కెవరుఁ దెలియఁజాలరు;♦ రెవఁడు నూలు

వర్తకంబుఁ జేయు, ♦ వాఁడెపో! యెఱుఁగును
దంతువులకు విలువ ♦ యెంత గలదొ. 81

సీ. మార్గపార్శ్వమున స ♦ మాధినిష్ఠ నొకండు
56 జ్ఞాని యుండఁగ, మ్రుచ్చొ ♦ కండు దారి
నేగుచుఁ, గని వాని ♦ బాగుగఁ బరికించి,
“యెంత దొంగయొ యీతఁ ♦ డిచటఁ బండు
కొనెడు, నిన్నఁటిరాత్రిఁ ♦ గొన్ని యిండ్లను దోఁచి
బడలి నిద్రను బోవు ♦ నొడలు మఱచి,
భటులు చూచిన వీనిఁ ♦ బట్టి బంధింతురు,
గనుక వేగము నాకుఁ ♦ జనుట మే” ల

ఆ.వె. టంచు సాగిపోయె; ♦ నంతలో నొక త్రాగుఁ
బోతు చూచి, “కల్లు ♦ బుడ్డి కొంచె
మెక్కు డాటఁ ద్రోవ ♦ ప్రక్కను బడె వీఁడు,
కలదు తెలివి వీని ♦ కంటె నాకె.” 82

ఆ.వె. అనుచుఁ జనినపిదప, ♦ నా త్రోవ నొకజ్ఞాని
సనుచు, ఘనసమాధిఁ ♦ దనరు నతని
కెఱఁగి, కూరుచుండి, ♦ యెంతయుఁ బూతమౌ
పదయుగంబు నల్లఁ ♦ బట్టసాగె. 83

ఆ.వె. వసుధ నెల్ల నరులు ♦ వారల గుణముల
ననుసరించి యితర ♦ మనుజుల గుణ
ముల గ్రహింతు; రింకఁ ♦ గలరూపు దెలియంగ
నెల్లరకును సాధ్య ♦ మెట్టు లగును? 84

ఆ.వె. సూర్యపిండ మొందు ♦ సలసలఁ గాఁగెడు
57 నాద్యమందు నైన, ♦ నమితమైన

ధ్వని జనించి, యద్ది ♦ తగ్గుచుఁ, గ్రమముగా
నిండ నేయి యంట ♦ నుండదుగద! ౮౫

తే.గీ. ఆర్భటంబునఁ గించిజ్జ్ఞుఁ ♦ డైన నరుఁడు
దా నుపన్యాసబోధముఁ ♦ బూని చేయు;
నెపుడు జ్ఞానంబు పూర్ణమౌ, ♦ నపుడె విడి య
డంగు వానికి నట్టి యా ♦ డంబరంబు. ౮౬

ఆ.వె. మహిని గల్గు పెక్కు ♦ మాయల నడుమను
58 నిలిచి, చిక్కనట్టి ♦ నిండుజ్ఞాని
యెవ్వఁ డగునొ, యాతఁ ♦ డే నిజంబుగ శూరుఁ
డనుచు జనులు పిలువ ♦ నర్హుఁ డగును. ౮౭

తే.గీ. వ్యాప్తవిషయోపభోగప్ర ♦ పంచమందు,
59 నళినపత్రస్థసలిలక ♦ ణంబుపగిది,
జ్ఞానియై యుండి, యానంద ♦ కందపదవిఁ
బడయు నతఁడె, మహానుభా ♦ వుఁ డన నొప్పు. ౮౮

ఆ.వె. గళితశతసహస్ర ♦ దళ మైన కేవల
60 కర్ణికావశిష్ట ♦ కమలమువలె,
నిర్వికార మైన ♦ నిర్మలమానసం,
బీశు నంటె, దుష్ట ♦ వృత్తిఁ జనదు. ౮౯

తే.గీ. పూర్వసంచితజీవప్ర ♦ త్యుప్తపాప
61 సంచయోద్భవవాంఛలు, ♦ సడలిపోవు
మనసు పరిపక్వమౌ తఱి; ♦ మంచి పండ్లు
పండు తఱి విరితేకులు ♦ వడెడు పగిది. 90

తే.గీ. పద్మబాహ్యస్థ మై యుండు ♦ భ్రమర, మలరుఁ
62 దేనెలను గ్రోలలేక తాఁ ♦ దిరిగి చుట్టుఁ,

జుమ్మ్రమనుచుండి, కడకు నా ♦ సుమముఁ జొచ్చి,
తేనెఁ ద్రావుచు, మత్తిలి, ♦ మాను రొదను. 91

తే.గీ. భగవదాకృతి గాన్పించు ♦ వఱకుఁ బూర్వ
పక్షసిద్ధాంతచర్చలఁ ♦ బడుచు నుండు
వాని, కానచ్చిదానంద ♦ పదవి దొరకి
యజ్ఞత దొలంగ, వాదంబు ♦ లట్టె యడఁగు. 92

సీ. వాఁడి ముల్లొక్కటి ♦ పదమునఁ దూఱిన,
63 మఱియొక ముంటి ♦ తోఁ బెఱికి తీసి,
తోడఁ బాఱఁగవేయు ♦ దును రెంటి; నట్టులె
జీవు నంధీభూతుఁ ♦ జేయునట్టి
యజ్ఞానతమముఁ బా ♦ యలుగాఁగ విరియించు
ప్రత్యాత్మకజ్ఞాన ♦ వితతిఁ గూడ,
జ్ఞానోదయం బైన ♦ మానవశ్రేష్ఠుండు
దుదకుఁ దమోరాశి ♦ తోడ వదలు;

ఆ.వె. నేల? యనిన, నట్టి ♦ యెఱుకయు నజ్ఞాన
మును నవిద్య వలనఁ ♦ బుట్టు నవియె;
యవని బ్రహ్మవేత్త ♦ యైనట్టి వానికి
ద్వైతబుద్ధి యెట్టు ♦ దవిలి యుండు? 93

ఉ. అంబుజమిత్రు రశ్మి భువి ♦ నన్నిటిపైఁ బ్రసరించుచున్నఁ, ద
64 ద్బింబము నిర్మలాంబువులఁ, ♦ దెల్లని స్వచ్ఛపులోహమందు, స
ద్దంబుననే కనంబడు వి ♦ధంబున, నిర్మలుఁ డైన జ్ఞాని చి
త్తంబున మాత్రమీశ్వరుఁడు ♦ దాల్చును దాఁ బ్రతిబింబరూపముల్.

సీ. ఉప్పుతో నొకబొమ్మ, ♦ నొకబొమ్మ బట్టతో,
65 మఱియొక బొమ్మ న ♦ శ్మంబుతోడఁ,

జేసి మూఁటిని నీటఁ ♦ జేర్చిన, మొదటిది
కరఁగి జలంబునఁ ♦ గలసిపోవు;
వస్త్రనిర్మితసాల ♦ భంజిక యుదకంబు
లాగి జలంబులోఁ ♦ దోఁగియుండుఁ;
గాని మూఁడవ బొమ్మ ♦ నాన కొక్కింతయుఁ,
గఠినమై యుండు; నీ ♦ కరణి ముక్త

తే.గీ. పురుషవరుఁ డీశ్వరైక్యంబుఁ బొంది యుండు;
భక్తిమోదాత్ముఁడౌను ♦ భక్తవరుఁడు;
గాని విషయోపభోగసం ♦ కల్పచిత్తుఁ
డింతయైనను జ్ఞానంబు ♦ నెనయలేఁడు. 95

తే.గీ. బ్రహ్మవిజ్ఞానసంపద్వి ♦ రాజితుండౌ
66 యుర్వి నరుఁడని పిల్వ న ♦ ర్హుండు; తక్కు
బ్రహ్మవిజ్ఞానరహితు లౌ ♦ వార లెల్ల
బాహ్యమానుషరూపవి ♦ పాత్రపశువులు. 96

తే.గీ. చిన్న పిల్లఁడు సంసృతి ♦ నున్న సుఖము
67 రుచి యెఱుంగని రీతి, నె ♦ ఱుంగ రాఁడు
పారమార్థికసుఖము వి ♦ పంచవిషయ
భోగలోలాత్ముఁడైన ♦ పురుషుఁ డెపుడు. 97

మ. మలినాదర్శములో నరుండు ప్రతిబిం♦బం బారయ న్లేక, యా
68 కలుషంబు న్దొలఁగించు వెన్క నది చ♦క్క న్జూచు చందంబునన్,
గలుషాంతఃకరణుండు చిత్తమునఁ దాఁ♦ గాంచంగ లేఁ డీశు; ని
ష్కలుషాత్ముండెవఁడౌనొ వాఁడు మదిఁగాం♦చంజాలుఁ జిద్రూపమున్

తే.గీ. ఇహసుఖాసక్తుఁ డైనట్టి ♦ హీనజనుఁడు
69 దైవసంకీర్తనంబును ♦ దాను వినక,

యేశ్వరుని దివ్యనామంబు ♦ నెపుడుఁ బలుక,
కొరులఁ గూడను వలదని ♦ చెలఁగుచుండు. 99

తే.గీ. భక్తులగువారి, జ్ఞానులౌ ♦ వారిఁ, బుణ్య
పారమార్థికచింతను ♦ బరఁగు వారి,
గేలి సేసెడు నైహికా ♦ కృష్టచిత్తుఁ,
డధని నధమాధముం డని ♦ యరయ వలయు. 100

తే.గీ. పావురము తాలువులయందు ♦ వడ్లగింజ
70 లెన్నియో చేర్చుకొను రీతి, ♦ హృదయసీమఁ
బాపసంగతి నైహిక ♦ వాంఛ లెన్నొ
కూర్చుకొని పా డగునుజుండి ♦ కుజనుఁ డెపుడు. 101

సీ. కుజపక్వఫలములు ♦ గుల్లక మధురమై
71 యుండును, గాయను ♦ బండవేయ
నటుగాక చెడిపోవు, ♦ నట్టులే పరిపక్వ
హృదయుఁడౌ ప్రజ్ఞాని ♦ యెల్లయెడల
సర్వసముం డౌచు, ♦ జాతిమతద్వేష
రహితుఁడై, ముక్తిక ♦ ర్మచయుఁ డగుచు,
భవనిజనాతీతుఁ ♦ డై, యుండు; నటుగాని
కర్మబద్ధుఁ డొకింత ♦ జ్ఞాని యయ్యు,

ఆ.వె. సమత నుండలేక ♦ సంసారసుఖములఁ
దిరుగఁ బడుచు, మొదటి ♦ తీరు వదలి,
జ్ఞానహీనుఁ డగుచుఁ, ♦ గాలక్రిమంబునఁ
జెడు ననుటకు శంకఁ ♦ జెందవలదు. 102

తే.గీ. క్షితిని విజ్ఞానహృదయవీ ♦ క్షితపరస్ప
72 రాతతవిరుద్ధజాతిమ ♦ తాదు లన్ని,

పాంశుసంఛన్నమౌ వట ♦ ప్రముఖవృక్ష
ములఁ దెఱంగున నేకమై ♦ చెలఁగుఁ గాదె. 103

తే.గీ. పచ్చి మృత్తునఁ జేసిన ♦ భాండ మవిసి
73 వెంటనే కుండగాఁ జేయ ♦ వీలు పడును;
వహ్నిసంతప్తమృణ్మయ ♦ పాత్రి పగిలి
కుండగాఁ జేయుటకు వెండి ♦ కుదురుపడదు. 104

తే.గీ. అపరిపక్వాంతరంగుఁడౌ ♦ నజ్ఞుఁ డీల్గి
కాంచు జన్మపరంపర; జ్ఞానదగ్ధ
విమలచేతస్కుఁ డౌవాఁడు ♦ విడిచి తనువు,
మఱల జన్మంబు నొందఁ డి ♦ మ్మాడ్కిగానె. 105

తే.గీ. ధరణిఁ బచనంబు సేసిన ♦ ధాన్యబీజ
74 ములను జల్లిన, నయ్యవి ♦ మొలక లెత్త
కుండు వడుపునఁ, దప్తాశ ♦ యుండు సిద్ధుఁ
డగుచు జన్మపరంపర ♦ నందఁ డెపుడు. 106

తే.గీ. తస్కరులు, మేలుకొని యున్న ♦ ధనికు నింటఁ
75 గన్నమును వేయఁ జాలని ♦ కరణి, మోహ
నిద్రఁ బడనట్టి యాత్మల ♦ నిర్మలతను
దస్కరించుట కాస య ♦ న్దగర వోదు. 107

సీ. పరిపక్వ మౌచును ♦ బచ్చి యుంచుక లేని
76 చూతఫలం బొందు ♦ చేతఁ గొనుచు
గట్టిగాఁ బిసికినఁ, ♦ గరమున వట్టి చ
ర్మపు బొక్కటియె చిక్కు, ♦ మంచి టెంక
రసముతో నెగిరి దూ ♦ రంబుగాఁ బడిపోవు
పోల్కిని, విషయోప ♦ భోగభాజ

నం బొచుఁ, బైవన్నె ♦ లం బడి మైహిక
లోలాత్మయును దుష్ట ♦ శీల యైన
ఆ.వె. భార్య, పతిని బట్టి ♦ వశ్యునిగాఁ జేయఁ
బూనుకొనిన, జ్ఞాని ♦ యైనవాఁడు
దాని చేతినుండి ♦ తప్పించుకొని పోయి,
యొడలు మాత్రి మువిద ♦ కడను బెట్టు. 108
క. కమ్మని తావుల దుర్గం
77 ధమ్ములనుం గూడ గాలి ♦ ధరియించిన, లే
శమ్మును దత్సంపర్కము
తెమ్మెరకుం బట్ట, దిట్టి ♦ తెలుఁగున జగతిన్, 109
ఆ.వె. ముక్తజీవుఁ డైన ♦ పురుషుండు నిత్యంబుఁ
బరమభోగ్యనేనిఁ ♦ బాపినేనిఁ
గూడి మెలఁగుచున్నఁ, బోఁడిమి సెడకుండ
జీవయాత్రి సేయుఁ ♦ జిత్రముగను. 110
ద్వి. ఫలములు మెండైన ♦ వంగు భూరుహము
78 వలె, మహాత్ముఁడు నమ్రి ♦ వర్తియై యుండు. 111
ఉ. తూనిసున, భారవస్తువులఁ ♦ దాల్చిన పార్శ్వము వంగి, తేలికన్
79 జేసిన వైపుపై కెగయుఁ; ♦ జేవ మనంబున గల్గునట్టి చి
ద్భాసితుఁ, డువ్వి నమ్రతను ♦ దాల్చి, యభిజ్ఞత చిత్తమందునన్
వీసము లేని మానవుఁడు ♦ నిక్కును నీల్గును దత్విధంబునన్. 112
తే.గీ. భగవదాప్తులు, జ్ఞానియు ♦ భక్తవరుఁడుఁ
80 గాని, యితరులు సృష్టిలోఁ ♦ గల మృగంబు
లందుఁ జేరెడువారలే ♦ యంచుఁ బరిగ
ణింపవలె; వారు జనులంచు ♦ నెంచవలదు. 113

తే.గీ. వీతరాగుండు నిహసుఖ ♦ విముఖుఁ డౌచు
సర్వదపు డీశ్వరుని భక్తి ♦ నాశ్రయించి
శాంతుఁడై సరుఁ డున్న, సం ♦ సారభార
మునను గ్రిమ్మఱఁ జెడి దుఃఖ ♦ మునను బడును. 124

ఉ. వారిని మత్స్యఘాతుకుఁడు ♦ పన్నిన జాలములోనఁ జొచ్చు న
90 వ్వారిచరంబులందు జడ ♦ భంగిని గొన్ని యడంగియుండు; నా
వారిఁ బొలంగి పోవఁగను ♦ బాటుపడు న్మఱికొన్ని; కొన్ని యే
దారినొ చేసికొంచు వల ♦ దాఁటి సుఖంబుగ సంచరించెడున్. 125

తే.గీ. ఇట్లె త్రివిధంబులై యుందు ♦ రిలను జనులు;
విషయసుఖలోలు రౌచు ని ♦ ర్వృత్తిచింతఁ
బొందకుండెడువారు, ము ♦ ముక్షువులును,
ముక్తులై హాయిగా నుండు ♦ పురుషవరులు. 126

తే.గీ. బాలకులు గాలిపడగ లు ♦ ప్పరమునందు
91 వేనవేలుగ నెగురంగ ♦ వేయ, నందు
మేదినికి లాగు త్రాడు తెం ♦ పికొని, యొండు
రెండు మాత్రము స్వేచ్ఛ వ ♦ ర్తింపఁగలవు. 127

ఆ.వె. సరిగ నిట్లె యోగ ♦ సాధనంబులఁ జేయు
నట్టి యమితజనము ♦ లందు, నొకఁడొ
యిద్దఱొ తరించి, ♦ యిహబంధములఁ ద్రెంచి,
ముక్తి నొందఁ గలరు ♦ పుడమిలోన. 128

ఆ.వె. పచ్చి పోఁక లోని ♦ వక్క పోలిక నుండు
92 నజ్ఞు మనసు కాయ ♦ మంటి యుండి;
యెండు పోఁక లోన ♦ నుండు బీజముఁ బోలుఁ
గాయబంధ మఱిన ♦ జ్ఞాని మనసు. 129

ఆ.వె. ఎవ్వఁ డరయుఁ దనదు ♦ హృదయపద్మంబున
93 సచ్చిదాత్మ, నట్టి ♦ సత్పురుషుఁడు,
దాను జూచు వస్తు ♦ తతి యంతయునుఁ గూడ
మది నెఱుంగు బ్రహ్మ ♦ మయ మటంచు. 130

ఉ. పిట్టలు గూళ్లువెట్టఁ దల ♦ వెందు రికలందునఁ, బెద్ద గూండ్లనుం
94 గట్టిన, మానసంబు సరి ♦ కట్టి, రవంతయు దాని దానిపైఁ
బెట్టక, బ్రహ్మతత్త్వమునఁ ♦ బెట్టుచు, దానిని లోఁగఁజేయు నా
దిట్టఁ డొకండె, నిశ్చలుఁడు, ♦ ధీరుఁ, డటంచు వచింప నొప్పుఁడౌ.

తే.గీ. బుద్ధిపూర్వము గా నది ♦ మున్ను వాఁడు,
95 నోరులు ముంచిన మున్నెడు ♦ నరుఁడు, సుప్తి
నుండునప్పుడు తనమీఁద ♦ నుదక ముంచఁ
దడియు నాతఁడు, స్నాతులా ♦ వడువుగానె, 132

ద్వి. జ్ఞానియై కాని, య ♦ జ్ఞానియై కాని,
ధ్యానంబు సేయ, ము ♦ క్తాత్ముఁ డౌ నరుఁడు. 133

తే.గీ. దేవుఁ డీక్షింప లేనట్టి ♦ తావు లేదు,
96 పరులు సూచుచునుండిన, ♦ నరయ లేక
పోయినను, పాపకార్యంబు ♦ సేయఁగూడ,
దంచు వర్తించువాఁడె ధ ♦ న్యాత్ముఁ డయ్య. 134

తే.గీ. ఇతరు లారయుచుండఁగా ♦ బుధులమాడ్కి
జనుల స్తోత్రంబుకొఱకుఁ దా ♦ సంచరించి,
చాటునను గక్కుఱితి పడు, ♦ చపలచిత్తు
బాహ్యసత్కృతులేమియుఁ ♦ బనికిరావు. 135

ఉ. ఒంటిగఁ గానలోఁ దిరుగు ♦ చున్నపు, డచ్చట నొక్క మంచి పా
ల్గంటియొ, కాంచనంబొ, తన ♦ కంటికిఁ గనఁబడ [illegible]

రెంటిని జూడకుండ జడు ♦ రీతిని బోయెడు వాఁడెపో, భవిక
దంట యనంగఁ జెప్పఁగను; ♦ దాంభికుఁ డట్టులు సేయ నేర్చునే? 136
ఉ. చేఁపలఁ బట్టు పుట్టికలఁ ♦ జేరెడు నీరమునందుఁ జొచ్చి రా
97 నోఁకక యుండు నిర్గెడు రఘు ♦ షోత్కరముంబలె, మూఢు లైహిక
వ్యాపృతి భోగసక్తు లయి ♦ యందుల గాసిలుచుందు రంధులై;
పాపము సేయునట్టు లది ♦ పాయుచు వచ్చుట సాధ్య మెట్టులో?

ఆ.వె. పారదంబులోనఁ ♦ బడిన సీసం బందుఁ
98 గరఁగి కలసిపోవు ♦ కరణి, జీవుఁ
డీశుఁ గాంచువెంట ♦ నే వానిలోపల
మున్గి లీనుఁ డౌచు ♦ ముక్తిఁ జెందు. 138

ఆ.వె. అవని జాగరూకుఁ ♦ డై, మంచిచెష్టల
99 నరసి, విషయసుఖము ♦ లందు మనముఁ
జిక్కనీక, మంచి ♦ సేయుచునుండెడు
నతఁడె పూజనీయుఁ ♦ డంద ఱకును. 139

ఆ.వె. అగ్నిదగ్ధరజ్జు ♦ వాడిస్వరూపంబు
100 మాఱకున్నఁ, దొంటి ♦ మాడ్కి వస్తు
బంధకార్యమునకుఁ ♦ బనికిరాదనమాట,
యెల్లరకును చేట ♦ తెల్లమె కద! 140

ఆ.వె. ముక్తజీవు, లిట్లె ♦ పూర్వస్వరూపంబు
లను దొఱంగకున్న, ♦ వెనుకటి దుర
హంకృతిని నడంచి ♦ యైహిక దూరులై
కడపుచుందురు వారి ♦ కాలములను. 141

తే.గీ. పంచదారయుఁ దెల్లని ♦ వాలుకయును
101 [illegible]

యినుకఁ ద్యజియించు; నీరీతి ♦ నెఱుకఁబరమ
హంసుఁ డైహికవస్తుస ♦ త్యంబుఁగనును. 142

తే.గీ. సూక్ష్మరేణువులను వీడి, ♦ స్థూల రేణు
102 వులను గ్రహియించు, చాలని ♦ పోల్కిఁ, బాప
విద్ధచిత్తుండు పుణ్యము ♦ ల్విడిచి, పాప
కార్యముల నాచరించుచు ♦ గాసిఁ జెందు. 143

చ. గొనబు రసంబు గల్గు చెఱ ♦ కు గ్రనుచిఁజూచినవాఁడు చొప్పక
103 ట్టను దిన నిచ్చగింపఁడు; ధ ♦ రాస్థలి నిద్దురవోఁడు మేడలన్
గుని కెడి భోగశాలి; యిటె ♦ కోరఁడు లౌకికతుచ్ఛసౌఖ్యము
ల్మనుజుఁడు, నిస్తులాత్మసుఖ ♦ లగ్నమనస్కుఁడై యైన భక్తిచేన్.

క. తనయిల్లె సర్వలోకం
104 బని యెంచెడు మూఢపురుషుఁ, ♦ డంధ్వాంతరమం
దున నుండెడు మండూకం
బును బోలును, జ్ఞానవిషయ ♦ మున యోజింపన్. 145

తే.గీ. అవనిపై నుండి చూడ, మ ♦ హాకుజములు
105 పొదువులుగఁ, జిన్న మొక్కలు ♦ పొట్టివిగను,
గానిపించుచు, వ్యోమధరా ♦ గ్రంబునుండి
చూచుచో నన్ని సమముగఁ ♦ జూడఁబడును. 146

తే.గీ. పుడమి రాగాంధులై యున్న ♦ పూరుషులకుఁ,
గొంద ఉత్తములుగ మఱిఁ ♦ గొంద అధము
లుగను గనిపించెదరు; గాని ♦ జగతిలోని
సర్వజనులును సములై ప్ర ♦ జ్ఞానితతికి. 147

ద్వి. ఏఁడు నిజంబగు ♦ నెఱుకచేఁ గ్రోలు
106 వాఁడు చేసెడి దెద్ది ♦ పాపంబుగాదు. 148

చ. గరళకరాళదంష్ట్రిల ము ♦ ఖంబునఁ దాల్చుచు బాటసారులన్
81 గఱచెడు పాముసోదలను ♦ గట్టిగఁ బట్టుక యాడునట్టి నే
ర్పరివలె, లోభముఖ్యరి ♦ పంధిసమాకులభీకరక్షమాం
తరచరుఁ డౌచు, గాసిలక, ♦ తత్త్వవిదుండు మెలంగుఁ జాతురిన్.

ఆ.వె. నికషమునను గీచి, ♦ నిగ్గును బరికించి,
82 బంగరంచు నెఱుఁగు ♦ పగిదిగానె,
యార్తిసమయసంభృ ♦ తాశయాచలతచే
సిద్ధుఁ డెవఁడొ మనము ♦ చెప్పఁగలము. 115

తే.గీ. మనసు చంచలముగ నుండు ♦ మనుజుఁ, డెట్టి
83 సద్గురుకటాక్షమున నున్న, ♦ సత్పురుషుల
స్నేహ మెంతగఁ జేసినఁ, ♦ జిన్నమంత
యైన లాభంబుఁ దాఁ బొర ♦ యుంగలేఁడు. 116

తే.గీ. తనకులాచారధర్మము ♦ ద్దఱలకుండఁ,
84 దనమతము నంటి, యన్యమ ♦ తంబుపైని
వీసమంతయుఁ బూనక ♦ ద్వేషబుద్ధి,
యుండునాతండె గద! యుత్త ♦ మోత్తముండు. 117

తే.గీ. కొలతలు విభాగములుఁ గ్రింది ♦ యిలకుఁగాని
85 యున్నత నభంబునకు నేమి ♦ యుండ; వట్లె
జాతిమతభేద మల్పునా ♦ శయము నంటుఁ
గాని, ప్రజ్ఞాని చిత్తంబుఁ ♦ గలఁచ లేదు. 118

సీ. అంగడిఁ బెట్టెడు ♦ నతిరసంబుల నాశ్రి
86 యించి భుజించెడు ♦ నీఁగ, ప్రక్క
గోమయపిండంబుఁ ♦ గాంచు నేగెడు వానిఁ
గాంచు వెంటనె వాని ♦ కడకుఁ బోయి,

పేఁడపై వ్రాలుఁ; దా ♦ విరి జిమ్ము పూవుల,
నందలి తేనెల ♦ నంటి, యుండి
దుర్గంధవస్తువు ♦ ద్రోవకుఁ బోవ దె
ప్పుడుఁ దేనియాఁగ; యీ ♦ పోల్కిగానె
తే.గీ. భక్తుఁ డైనను సంసారి ♦ బాధ నొందు
నప్పుడవు డైహికంబుల ♦ నంటుచుండి;
యుత్తమజ్ఞాని చెడిపోక ♦ యుండు సర్వ
దా పరాత్పరుఁ దలఁచుచుఁ ♦ ధ్యాననిష్ఠ. 119

ఉ. కమ్మని తావుల న్గొలుపు ♦ కల్వను బెట్టిన పేఁడపుర్వ పు
87 ష్పమ్మున నిల్వలేక తన ♦ పట్టునకుం బరువెత్తు భంగి, దై
వమ్మును గూర్చి సూక్తులను ♦ బల్కెడు తావుల నుండలేక శీ
ఘ్రమ్ముగఁ బాఱిపోవు నిహ ♦ కాంక్షలఁజిక్కునరాధముండిలన్.

తే.గీ. జలగతనలినపత్రంబు ♦ సలిలమునను
88 దడియ; దడుసున మెలఁగినఁ, ♦ జెడదు దానఁ
జేఁప; యీభంగి జ్ఞానులు ♦ సేయుచున్న
నైహికంబుల, వానిఁదా ♦ మంటి చెడరు. 121

తే.గీ. పెంచి ముంగిని, దా్రిట బి ♦ గించి కంఠ,
89 మక్క మొక్కటి రజ్జువంత ♦ మందుఁ గట్టి,
గోడమీఁదను జలపూర్ణ ♦ కుంభ ముంచి,
ముంగి విడిచిన, నదియుండు ♦ భంగి వినుము. 122

తే.గీ. దగను బడినప్డు కుండ యొ ♦ ద్దకును బ్రాఁకి,
సుఖముగా నీరు ద్రావి, య ♦ చ్చోట ఱాతి
బరువునను నిల్వలేక, తాఁ ♦ దిరుగఁ గ్రింది
కరుగుదెంచుచునుండు; నీ ♦ యనువుగానె. 123

క. పుడమిని బద్ధాత్ముం డయి
107 చెడువాఁడే నరుఁడు; ముక్త ♦ జీవుం డగు ధ
న్యుఁడె సాక్షాద్బ్రహ్మం; బని
నుడువును గ్రంథములు వేయి ♦ నోళ్ళ న్మనకున్. 149

తే.గీ. జలమునం దున్న ఘటము లో ♦ పలను బైని
108 నంత సలిలావృతంబగు ♦ ననువుగానె,
దైవలీనాంతరంగుని ♦ తనువు, తొప్ప
దోఁగి యాత్మాబ్ధిఁ, బూతమై ♦ తోఁచుఁగాదె. 150

క. తెలిసినది కొంచె మయ్యును,
109 దెలియును సర్వం బటంచుఁ ♦ దిరుగుచు, నిలలో
పల విఱ్ఱవీఁగి, మోసం
బులఁ జేసెడు వాఁడు నీచ ♦ పురుషుండు గదా! 151

ఉ. దాఁగిలిమూతయం దెవఁడు ♦ తల్లిని ముట్టుకొనంగఁ జాలు, వాఁ
110 డే గెలుపొంది యాటను య ♦ థేచ్ఛముగాఁ జనఁగల్గు దొంగగా;
కాగతి సృష్టి నాటకము ♦ నం దెవఁ డీశుని గాంచనేర్చు, వాఁ
డేగద బంధముక్తుఁడయి ♦ యీశ్వరసత్కృప ధన్యుఁ డయ్యెడున్.

## ముముక్షుత్వము.

ఆ.వె. అమ్మ! నాకు సెప్పు ♦ డాఁకలి గల్గునో
111 యపుడు మేలుకొలుపు, ♦ మంచుఁ గొమరుఁ
డడుగఁ, దల్లి పలికె ♦ నాబాలకునితోడ
"నీదు క్షుత్తె లేపు ♦ ని" న్నటంచు. 153

ఆ.వె. భక్తియుక్తి నీవు ♦ బరమేశు ధ్యానించు
112 తఱిని దిండికొఱకుఁ ♦ దలఁకవలదు;
సృష్టిచేయునపుడె ♦ జీవనాధారంబు
సకల జంతువులకు ♦ స్రష్ట యొసఁగు. 154

ఆ వె. మోక్షకాంక్ష తీవ్ర ♦ ముగ నున్న నరునకుఁ
113 దగిన గురుని దెచ్చి ♦ యగపఱచుచు
దర్శనంబు నిచ్చు ♦ దైవంబు; కాన, న
తనికిఁ గురువు వెదకఁ ♦ బనియొ లేదు. 155

సీ. మనుజు లిద్దరు చూత ♦ వన మొండు చిలకించి
114 యరిగిరి లోనికి; ♦ నందు లోక
తంత్రజ్ఞుఁ డైనయా ♦ తండు రెండవవాని
విడిచి, తోఁటను గల ♦ వృక్షములను,
బండినపండ్లను, ♦ వాని నమ్మిన వచ్చు
మూల్యంబు, లెక్కింప ♦ మొదలు పెట్టె;
నిఁకను రెండవవాఁడు ♦ వృక్షంబులను గావు
గాచుచుండెడు వాని ♦ కడకు నేగి,

ఆ.వె. మంచిమాట లాడి, ♦ మనసును గరఁగించి,
వాఁడు సమ్మతింప ♦ వచ్చి, యమృత
తుల్యము లగు పండ్లఁ ♦ దోడనే కోసిక
తినెను వలసినన్ని ♦ తృప్తి దీర. 156

క. ఇరువురలో మెలఁకువ యె
వ్వారిదో? క్షుధదీఱుఁగాదె ♦ ఫలములు మెసఁగన్!
దరువుల ఫలపత్రంబుల
కొఱమాలిన లెక్క యెందు ♦ కోసము చెపుమా. 157

ఆ.వె. సృష్టి కారణంబు ♦ చిక్కఁ గనుంగొన
దంభపండితుఁడు వృ ♦ థా కడంగు;
సృష్టికర్త తోడ ♦ స్నేహంబు చేసిక,
మోక్షకామి పొందు ♦ ముక్తిసుఖము. 158

క. జ్ఞానం బేకత్వము, న
115 జ్ఞాన మనేకత్వ, మోలిఁ ♦ గఱపుచు నుండున్,
గాన, ముముక్షువు బ్రహ్మ
జ్ఞానముఁ బడయంగఁ గృషిని ♦ జొప్పఁగ వలయున్. 159

తే.గీ. వనధి నున్నట్టి ముక్తామ ♦ ణిని గ్రహింపఁ,
116 జచ్చుటకునైనను దెగించి ♦ జలధి మునుఁగ
వలయు; నల సచ్చిదానంద ♦ పదవిఁ బడయ,
జనుఁడు శ్రమపడి యోగము ♦ ల్సలుప వలయు. 160

తే.గీ. వనధిలో మున్గి, మనుజుఁడు ♦ ప్రాణములను
117 గోలుపోనుండి, యూపిరి ♦ కొఱకు నాత్ర
పడెడు రీతిని, గొట్టుకో ♦ వలెను భక్తుఁ
డీశ్వరుని గన్నులార నీ ♦ క్షించు దనుక. 161

ఉ. హాలికవృత్తి వంగడము ♦ నందున నుండిన కాఁపు, వర్షముల్
118 ప్రాలకయున్న భూమిపయిఁ, ♦ బండకయున్నను బంట యేండ్లుగా,
హాలికవృత్తి వీడఁడుగ ♦ దా! యొకవర్షము వర్ష మేవినన్,
జాలు నటంచు మాను వ్యవ ♦ సాయము నూతనకర్షకుండిలన్.

తే.గీ. ఇట్లై సామాన్యుఁడౌ భక్తుఁ ♦ డీశ్వరుండు
వడిగ నగపడమిని భక్తి ♦ వదలు విసిగి,
కాని వాస్తవమౌ భక్తి ♦ గల్గువాఁడు
వీడునే యట్లు ధ్యానంబు ♦ విసిగి తాను? 163

తే.గీ. ఖడ్గములఁ జేయఁగా నుక్కు ♦ గావలసిన,
119 నినుము నిప్పునఁ గరఁగించు ♦ ననువుగానె,
చిత్తమును శుద్ధచిత్తంబుఁ ♦ జేయ నరుఁడు
పడవలెను గాదె పడరాని ♦ పాట్లు భువిని! 164

## భక్తిజ్ఞానధ్యానవైరాగ్యప్రార్థనాదివిషయములు.

సీ. ఒకకర్షకుఁడు పాఁ జె ♦ ఱకుమడి కుదకంబుఁ
120 గాయకష్టంబుతోఁ ♦ గట్టికట్టి,
తుదకుఁ దాఁ దోఁడిన ♦ తోయంబులో నొక్క
బిందువైనను బొలం ♦ బందు నిల్వ,
కచ్చోటఁ గల లాఁగ ♦ లడుఁ జొచ్చిన, దని
తెలిసికోఁగలిగె; నా ♦ తీరుగానె
కామలోభాదులఁ ♦ గట్టంగఁబడి యిహా
సుఖలోలుఁడై మను ♦ జుండు భక్తి,
తే.గీ. నీశ్వరధ్యానపరుఁడై చు ♦ నెంత యున్నఁ,
దనదు నాశాబిలంబుల ♦ ధ్యాననిష్ఠ
యంతయును గాఱిపోవఁగా, ♦ నాతఁ డల్ల
మోక్షపురుషార్థ మిఁక నెట్లు ♦ పొందఁగలఁడు? 165
తే.గీ. స్వామి ధ్యానంబు సేసెడు ♦ సమయమందు,
121 భక్తులనుగాని యీశ్వరో ♦ పాసనంబుఁ
గాని గేలియొనర్చెడి ♦ కాపురుషులఁ
జెంతఁ జేరంగ నిచ్చినఁ ♦ జేటు వచ్చు. 166
ఆ.వె. మోక్ష మొందఁగోరు ♦ పురుషుఁ, డాశాపాశ
122 బద్ధ నంటెనేని, ♦ భక్తి యంతఁ
బోయి, తాను వాని ♦ పోల్కిని జెడిపోవు,
నీరమునను గలియు ♦ క్షీరమట్లు. 167
తే.గీ. నిష్కపటభక్తిఁ బ్రార్థనా ♦ నిష్ఠ నున్న
123 యతనిమన మైహికంబుల ♦ నంటఁ బోదు.
కాని యాశానిబద్ధుఁడై ♦ వానిఁ జెనకు
మతకిరోధాద్యహంకార ♦ మాత్సరములు. 168

తే.గీ. వాద్యనిర్ఘోషముల నుత్స ♦ వంబు జరుగు
124 చుండ, గుఱివెట్టి, యొకనిషా ♦ దుండు, చిత్త
నిశ్చలతఁ దాల్చి, పక్షి ఖం ♦ డింపఁ జూడ,
నొక్కయవధూతుఁ డతనికి ♦ మ్రొక్కు వెట్టె. 169

ఆ.వె. ఈవు నాకు గురుఁడ ♦ వే సుమ్మి, నే ధ్యాన
నిష్ఠ నుండ, నిట్టి ♦ నిశ్చలతయె
మనమ్మునంబుఁ బట్టు ♦ మార్గంబు బోధింపు
మయ్య! యంచు వాని ♦ నడుగసాగె. 170

సీ. కైవర్తుఁ డొక్కఁడు ♦ గాలంబు నది వైచి
125 యొడ్డునఁ దాఁ గూరు ♦ చుండ, నొక్క
యవధూతుఁ డచ్చటి ♦ కరిగి, కాశికి మార్గ
మడుగ, గాలము మ్రింగఁ ♦ దొడఁగుచున్న
మత్స్యంబుపైఁ దన ♦ మనసు లగ్నంబౌటఁ
బ్రత్యుత్తరం బీయ ♦ వలను పడక,
గాలంబు చేఁపవ ♦ క్త్రంబునఁ జిక్కిన
పిమ్మట, నేదియో ♦ పృచ్ఛసేసి

తే.గీ. తి! రని యవధూతు నవ్వాఁ, డ ♦ తివినయమున
నడుగ, నాకీవు గురుఁడవౌ ♦ దయ్య! నీదు
నిశ్చలత నాకుఁ గఱపుమా! ♦ నీకు వేయి
నతులు సేసెద నంచు నా ♦ యతి వచించె. 171

చ. వెనుకను బొంది యుండి జము ♦ వీటికిఁ దన్ను నుపంగనున్న బో
126 యను గనకుండ, నిశ్చలత ♦ నయ్యెడ నుండు కొలంకులోని చేఁ
పను గబళింపఁ జూచు బక ♦ వర్యుప సాధు వొకండు గాంచి, వెం
టనె కరము ల్మొగిడ్చి, యెదు ♦ టంబడి యిట్లనె నాబకంబుతో. 172

తే.గీ. చావు చేరువనున్నను ♦ సరకుగొనక,
ఝషమముపైఁ బెట్టు నీదు ని ♦ శ్చలమనంబు,
నేను బరమేశ్వరధ్యాన ♦ నిష్ఠ నుండ
నపుడు దయసేయు మయ్యా! జో ♦ హారు నీకు. 173

సీ. గ్రద్ద యొక్కటి నోటఁ ♦ గఱచుక మాంసంబు
127 నెగిరి యాకసమున ♦ నేగుచుండ,
లక్షోపలక్షలు ♦ పక్షులు కాకగృ
ధ్రంబులు మాంసాశఁ ♦ దఱుమ దాని,
నీపాట్లఁ బడలేక ♦ యెఱచి క్రిందను జాఱ
విడిచి, గృధ్రమొక్క ♦ వృక్ష మెక్కి,
కొమ్మపై నిశ్చింతఁ ♦ గూర్చుండఁగా, నొక్క
యవధూతుఁ డరసి తా ♦ నటకుఁ బోయి,
తే.గీ. యీవు నాగురుఁడవె సుమ్మి ♦ గృధ్రరాజ!
యైహికసుఖాస్పదంబు లా ♦ నట్టి వాని
విడిచిపెట్టక నిశ్చల ♦ వృత్తిఁ జిత్త
మంద, దనుమాట బోధించి ♦ తంచుఁ బలికె. 174

తే.గీ. చాలఁ జిల్లులు గల్గు కో ♦ శంబు నుండి
128 వీడి కాఱిన సర్షప ♦ బీజములను
బోగుచేయుట కష్టమా ♦ పోల్కిఁ, బెక్కు
బాహ్యమార్గంబులను బట్టి ♦ పాఱు మనము, 175
ద్వి. నిలిపి బ్రహ్మధ్యాన ♦ నిష్ఠ యద్దాని
కలవడఁ జేయుట ♦ యతికష్ట మయ్యా. 176

సీ. చక్కెరఁ గని యందుఁ ♦ జావ నీకొనుఁ గాని
129 రాలేదు చీమ శ ♦ ర్కరను వదలి;

చిమ్మచీఁకటి బిలం ♦ బిమ్ముగా నుండు కు
మ్మరపురు వొకసారి ♦ యిరువు వెడలి
తరణిదీప్తిని జూచి ♦ తిరుగఁ జీఁకటిబిలం
బున కేగఁజాల; దీ ♦ యనువుగానె
పరమాత్మతత్వంబుఁ ♦ బరికించి ముక్తిని
బొందఁగాఁ గోరెడు ♦ పురుషున కొక

ఆ.వె. సారి సచ్చిదాత్మ ♦ సాక్షాత్కరించిన,
దాని విడువలే, క ♦ తండు, మనసుఁ
జెలఁగి కానిపించు ♦ చిత్సదాకారంబు
లోనఁ జేర్చి యందు ♦ లీనుఁ డౌను. 177

ఆ.వె. అమ్మ! యనుచుఁ బిలిచి ♦ యాపరమాత్మను
130 భక్తుఁ డేల పొందు ♦ బ్రహ్మసుఖము?
జననికంటె లేరు ♦ చనవిచ్చువారెందుఁ;
గాన మాత మీఁదఁ ♦ గరము ప్రేమ. 178

తే-గీ. నరుఁడు గంజాయిఁ ద్రావుచో ♦ నొరులఁ గూడి
131 త్రావి సుఖయించు వడువున, ♦ దైవభక్తుఁ
డీశ్వరుని గీర్తనముసేయు ♦ నెడలఁ, దాను
దోడివారలతోఁ బాడి ♦ తుష్టినొందు. 179

చం. ఇలను విజాతిజంతువు లె♦వేనియుఁ జొచ్చిన నాలమంద, గో
132 వులు గుమిగూడుచుం దఱుముఁ♦బోట్లను దన్నుల వాని;నట్లుగా
కల పసరంబె వేఱొకటి ♦ యాలగమిం జొరఁగానె, యన్ని మే
నులఁ గదియించి నాకుచు న♦నూనపుమైత్రి మెలంగఁ జూచెడున్.

ఆ-వె. భక్తు లట్టె కలసి ♦ పరమసౌఖ్యంబును
బడసి యొకరినొకరు ♦ పాయఁజాల;

కింక గేలిసేయు ♦ నెవరేని వచ్చిం
నవలి కంపఁ జూతు ♦ రట్టి వారి. 181

మ. పతితో నొంటిగ నాడు ముచ్చటల నె♦వ్వారు న్వినన్నిగ్గరున్
133 సతి, కవ్వెచ్చటనే బయల్పడ వి శే♦షం బాగ్రహం, బైనఁ దా
రతిమర్మంబుల నన్ని గూర్మిఁ దెలుప ♦ నభ్యసించు నిశ్శంక నే
గతినైనన్ హృదయంబు వెల్చి తెలుపం♦గాఁ జూచెడు న్వారికిన్.

శా. దేవోపాసకుఁ డట్టి యొంటిగ సవి♦ధి న్నిల్చి సేవింపఁగా
భావంబందున నందు సంతసముఁ జె♦ప్పంబోఁ డభక్తాళి; కిం
కేవాఁ డైనను శుద్ధచిత్తుఁ డయి యా♦యీశుం దనుంబోలి స
త్సేవం గొల్చిన, వానికి న్దెలుపు స్వా♦క్షీణాంతరానందమున్. 183

మ. హననం బన్యులఁ జేయఁ గావలెను ఖ♦డ్గాదుల్ దనుం జంప సూ
134 దిని గైకొన్నను జాలు; నీవగిది భ♦క్తిశ్రద్ధల న్దాల్చి నే
మనుజుం డైనను ముక్తిఁ జెందు, నిఁక మీ♦మాంసాదిశాస్త్రప్రద
ర్శన మన్యు న్దరియింపఁ జేయనె యవ♦శ్యం బౌచుఁ గన్పట్టెడున్.

చం. కొంచెము లోఁతు గల్గు చిఱు♦గుంటల, నచ్ఛపునీరు ద్రావ నీ
135 వెంచినఁ, బైని మెల్లఁగ నొ♦కింత గలంపక క్రోలు, మట్లు గా
దంచుఁ గలంచితేని, యడు♦గంటిన కల్మష మంత పైకి ర
ప్పించుచు నీటిఁ బంకిల మ♦పేయముగా నొనరించు రూఢిగన్. 185

చం. అమలత ముక్తినొంద మన♦సైనను, శోధను బూని గట్టిగా,
యమమునఁ బ్రార్థనాదివిధు♦లల్లనల్లనఁ జేయు, మాకుత
ర్కములను వేదచర్చలను ♦ గాలము సత్వము రిత్తవోవఁగా
బ్రిమసి చొరంగఁ, దాఁ గలఁగి♦పాడగుఁ జంచలచిత్తమంతయున్.

సీ. పాపము లాత్మమాయాప్ర♦పంచంబున న్మెండు,
136 కామలోభాదుల ♦ కగ్రిందు పెచ్చు,

విషయసౌఖ్యవ్యాప్తి ♦ విపులంబు, ధరలోని
వ్యాపారములఁ జిక్కి ♦ వాని కెట్టు
నిర్మలాకారంబు ♦ నిర్గుణం బగు సచ్చి
దానందరూపంబు ♦ నందు మనము
లగ్నంబు చేయుట ♦ లభియించు? నని యోచ
కుఁడు; చూడుఁ, డాకర్ష ♦ కుని పోలంతి
తే-గీ. గృహములోనుండి యొకటనే ♦ యెన్ని పనులు
చేయుచున్నదో! యొకచేత ♦ శిశువునెత్తి
కొనుచుఁ బాలిచ్చు; రోఁకలి ♦ గొనుచు దంపు
వడ్లరాసిని దా రెండ ♦ వ కరమునను. 187
కం. కొన బియ్యము నెవఁడైనం
జను దెంచిన, బేరమాడుఁ ♦ జక్కఁగ; నిట్లే
పను లెన్ని యున్న, రోఁకలి
తనమీఁదం బడదు, మనసు ♦ దాననె యుంటన్. 188
కం. నరుఁ డిట్లె యైహికంబులఁ
జరుపుచు, నవ్వాని యందె ♦ సక్తుఁడు గా, కా
పరమాత్మపైని మనము
న్నిరతిని బెట్టుకొని, ముక్తి ♦ నింగనవలయున్. 189
సీ. వారిపై స్వేచ్ఛగా ♦ వర్తిలపవచ్చిన
137 మొసలి, దన్ను వధింపఁ ♦ బూనువానిఁ
జూచి, క్రమ్మఱ నీరు ♦ సొచ్చి, ప్రాణభయంబు
రా దని తెలియు నీ ♦ రంబుపైకి
నరుదెంచి, హాయిగాఁ ♦ దిరిగెడు మాడ్కి, సం
సారాబ్ధిలోముస్థ ♦ జనుఁడు, ధనము

నను వైనయపుడెల్ల ♦ మనమీశ్వరధ్యాన
మందుంచి, వెతలఁ బో ♦ కార్పవలయుఁ;

ఆ-వె. దెఱపి గల్గినట్టి ♦ తఱి నిట్లు భగవంతు
నమ్మి వేఁడుచుండు ♦ నరు, నతండు
దయ భవార్ణవంబు ♦ దాఁటించి యానంద
మందు నెపుడు నోలఁ ♦ లాడఁ జేయు. 190

సీ. తాంత్రికుండు "శవచిం ♦ తామణి" జపియించి
133 యిష్టదేవతఁ గాంచ ♦ నిచ్ఛపడిన,
శవముపైఁ గూర్చుండి, ♦ శ్రద్ధ మంత్రోచ్చార
ణంబు సేయుచును, శ ♦ వంబు నోరు
దెఱచినయపు డెల్ల, ♦ నెఱచియు మద్యంబు
నోరెంబుగా దాని ♦ కొసఁగవలయు;
నీవిధంబుగఁ జేయ, ♦ దేవి స్వాధీనయౌ
నని మంత్రశాస్త్రజ్ఞ ♦ లందు; రిట్లు

తే-గీ. యైహికంబు లైన ♦ యాశలఁ దనియించి,
వెనుక మోక్షసుఖము ♦ నెనయవలయు;
నట్లు సేయకున్న, ♦ నైహికములు వాంఛి
తార్థములకు నడ్డు ♦ లౌను జుండి. 191

ఆ-వె. దాసరి యొకచేతఁ ♦ దంబుఱ మీటుచు,
139 నొక్కచేతఁ జిఱుత ♦ లూని వేయు
చుండి, పాడుచుండు ♦ నోజ, సంసారంబు
నెఱపవలయు ముక్తి ♦ పరత గేస్తు. 192

ఉ. జారుని కూరిమి న్మరగు ♦ జారిణి, యింటనుగల్గు కృత్యముల్
140 దీరుచుకొంచుఁ, దా విటుని ♦ దిక్కునఁ జిత్తము వెట్టుచూడ్కి, సం

సారమున స్ధగుల్భొనుచుఁ ♦ జాలఁ బ్రయాసము నొందుచుండియుఁ,
వారక యాపరాత్పరుని♦పై మనముల్లము నుంచఁగావలెఁ. 193

చం. ఇల ధనవంతు నింట నివ♦సించెడు దాదులు, దాము పెంచు బి
141 డ్డలు దమవారు గారని దృ♦ఢంబుగ నమ్మి చరింత్రుగాదె! గే
స్తులుఁ దమబిడ్డ లీశ్వరుని ♦ సొత్తని, దాదులు తా మటంచు, న
ట్టులె తలపోసి కాలము నె♦టో గడపంగను జూడఁగావలెఁ. 194

తే.గీ. రాగము నహంకృతియుఁ గల్ల, ♦ రాదుముక్తి
142 సారయుతవేదశాస్త్రము ♦ ల్బ్రాలకొనిన,
సచ్చిదానందపద మిచ్చు ♦ సాధనంబు
లల్ల వైరాగ్యము వివేక ♦ మనెడు రెండె. 195

సీ. జీవాత్మఁ బరికించి ♦ 'నీవు నే' నను వాక్య
143 భావంబు గ్రహియించు ♦ వాఁడె, యెఱుఁగు
బ్రహ్మతత్వంబు; దూ♦రంబుగాఁ బరికించి
నను గాని "నాయిల్లు ♦ నాదుబొంది
నాదుసంసారంబు" ♦ నాఁజేసెడు మమత
పో, దది విజ్ఞాన♦ముననె యడఁగు;
నుల్లిపైఁ బొరల నొ♦క్కొక్కటిగా నూడఁ
దీయఁగాఁ, దుదకు నెద్దియును మిగుల;

తే.గీ. దీగతినె, దుల్ప ద్వేషంబు ♦ రాగవృత్తి,
'నే' ననెడు భావమే నశి♦యించి పోవుఁ;
బూర్ణతత్వజ్ఞునకు నిత్య♦పూర్ణ మైన
బ్రహ్మ మొక్కండె దృష్టిఁ గ♦న్పట్టు నెపుడు. 196

ప్ర. మనయహంభావంబుఁ ♦ మడిఁగినఁ గాని,
కనిపింప దాత్మసా♦కార మెన్నఁటికి. 197

కం. కలియుగమున మానవులకు
144 సులభముగా ముక్తి నొసఁగు ♦ సూత్రం, బిలలో
పలభక్తియోగమే, యని
తెలియంగావలయుఁ దేట ♦ తెల్లముగాఁగన్. 198

కం. భగవంతుఁడు దమ కెన్నం
145 డగపడు నని యున్నవార, ♦ లాతఁడె నిత్యం,
డిఁక జగతి యస్థిరం, బని
భగవన్నామంబుఁ దలఁప ♦ వలె సద్భక్తిన్. 199

ఆ.వె. ఇచ్ఛ వచ్చినట్టు ♦ లిభ మేగుచును, జెట్ల
146 నూడఁబెఱుక, మావ ♦ టీఁడు దాని
సంకుశమునఁ బట్టి, ♦ యడఁచి యంతమదంబు,
ఋజుపథమునఁ సంచ ♦ రింపఁజేయు. 200

ఆ.వె. మనసు నాఱు దుష్ట ♦ మార్గంబులను బట్టి
పోఁకఁ జనుచు, సద్వి ♦ వేక మనెడు
సంకుశంబు శిక్ష ♦ నందినపిమ్మట
ఋజుపథంబులందె ♦ యేగుచుండు. 201

ఆ.వె. సద్దు లేక యుండు ♦ స్థలములలో నైన,
147 జనులు లేనియడవి ♦ చక్కి నైన,
నిర్మల మగు చిత్త ♦ నియతి నెచ్చట నైన,
లలితభక్తి నీశుఁ ♦ దలఁప వలయు. 202

చం. నెలకొని వృక్షమూలమున, ♦ నెట్టన చేతులు గొట్ట, దాని కొ
148 మ్మలపయి నుండు పిట్టలోక ♦ మాఱుగఁ బాఱెడు మాడ్కి, నీవు నే
తులఁ గదియించి, తాళమును ♦ దోడుగ వేయుచు, దేవుఁబాడఁగాఁ
దొలఁగుచుఁ బాఱు నీమనసుఁ ♦ దూఱిన పాపపుఁజంత లన్నియున్.

తే.గీ. తియ్యగా నుండు శ్రీహరి ♦ దివ్యనామ
మెప్పుడెపు డీవు పాడెదో, ♦ యప్పుడెల్ల
వేయుమీ కరతాళము, ♦ ల్వేయ మనసు
నిశ్చలం బయి గుఱి గల్గి ♦ నిలుచు నీకు. 204

ఉ. అంబుధి లేవు ముత్తెము ల♦టంచు వచింపకు మొక్కసారి నీ
149 రంబులఁ గ్రుంకువెట్టుచు బి♦రానను వానిని గానలేక, వే
గం బనకుండ, వేసరక,♦కంధి మునుంగఁగ సారెసారె, కం
తంబున నీప్రయత్నములు ♦ దాము ఫలింపకపోవు పూర్తిగన్. 205

తే.గీ. సచ్చిదానందు దర్శింపఁ ♦ జలువు నీదు
యత్నము, ల్దొల్త విఫలంబు ♦ లైన, వాని
విడువకుము; పట్టుదలతోడఁ ♦ గడఁగితేని,
కడకుఁ దప్పక యాతనిఁ ♦ గాంచఁ గలవు. 206

సీ. పుల్లల నమ్ముక ♦ పొట్టపోసికొనెడి
150 నిఱుపేద యడవిలోఁ ♦ దిరుగుచుండ,
సంయమి యొక్కఁడా ♦ చక్కి నేగుచు వానిఁ
గాంచి, యాకానన♦గర్భమునకుఁ
బొమ్ము లాభంబీవు ♦ పొరసెద, వని చెప్ప,
వాఁ డేగి చందనా♦వనిజ మొండు
గాంచి, దానిని బట్టి ♦ ఖండించి, యెక్కుడౌ
మూల్యంబు నానాఁడు ♦ పొంది, నాకు

తే.గీ. మంచిగంధపుఁజెట్టు సం♦ప్రాప్తమౌ న
టంచుఁ జెప్పక, యూరక ♦ యడవిలోని
కరుగు మం చేల పల్కె స♦న్న్యాసి? యంచు
నెంచి మఱునాఁడు లోపలి ♦ కింకఁ జనియె. 207

కం. చనిన, స్తామ్రము రజతముఁ
గనకము హీరములు గాంచి, ♦ క్రమముగ వానిం
గొని, సంతసంబు మనమునఁ
బెనుపడఁ, జిత్రముగఁ దాఁ గను ♦ బేరుండడయ్యెన్. 208

తే.గీ. అటులె తత్వజ్ఞతను బడ ♦ యుంగఁ జూచు
వాఁ, డొకించుక జ్ఞానంబు ♦ వడయఁ, దృష్టి
నొంద కుండంగఁ గృషి సేయు ♦ చున్న, సత్య
మక్షరం బగు జ్ఞానంబు ♦ నందఁగలఁడు. 209

ఆ.వె. జ్ఞాన మొందఁ గోరు ♦ మానవుం, డెపుడు స
151 న్మార్గుఁ డైన పుణ్య ♦ నరునితోడ,
భక్తవరుని తోడఁ, ♦ బ్రజ్ఞాని తోడను,
గూడి చెలిమి సేయఁ ♦ జూడవలెను. 210

ఉ. జీవుఁడు దాను దేహముఁ ద్య ♦ జించుచు నేగెడు కాలమందునన్
152 భావ మెటుండు, నట్టి భవ ♦ బద్ధకళేబర మొందుసొచ్చెదున్;
భావనపూర్ణభక్తుఁ డటు ♦ వాంఛలఁ జిక్కక బ్రహ్మలీనుఁ డౌఁ;
గావున జన్మనిర్వృతికిఁ ♦ గావలె భక్తియు నీశ్వరార్చనల్. 211

ఆ.వె. భక్తుఁ డీశ్వరునకుఁ ♦ బట్టి, యాతని నామ
153 ముచ్చరింపఁగానె ♦ యుదయ మందు
భక్తిమోదభరిత ♦ బాష్పాంబుబిందువుల్
పూజగా నొసంగు ♦ లాజ లౌను. 212

ద్వి. భగవంతుఁడును వాని ♦ భవ్యనామంబు
నాగి భక్తులకుఁ దోఁచు ♦ నూఁత కోలలుగ. 213

ఆ.వె. దేవదేవునిగనె ♦ త్రికరణశుద్ధిగాఁ
154 బతిఁగఁ దలఁచి, యతని ♦ పైని నెప్పుడు

మనసు నుంచు నట్టి ♦ మానినీమణి మాడ్కి,
విత్తమునె తలంచు ♦ పిసిడి పగిది, 214

ద్వి. అంతరంగము నీశు♦నందె కీల్కొల్పి,
సంతోషమున భక్త♦సత్తముం డుండు. 215

తే.గీ. 'గీత' యను మాట వెన్నంటఁ ♦ గెరలి నుడువ,
155 నది 'తగీ' యని తలక్రింది ♦ దాచు, నొండు
భావ 'వైరాగ్య మూను' మ ♦ న్నాభవ మిచ్చుఁ;
గాన నీపల్కు చిత్తమం ♦ దూని నరుఁడు, 216

తే.గీ. గీతలను బట్టి యూరక ♦ కీరమువలెఁ
దాను జదువక, వ్యత్యస్త ♦ మైన గీత
పల్కుచుండెడి వైరాగ్య♦పదవి నొంది,
పరుల కందని ముక్తిని ♦ బడయ వలయు. 217

చ. సరిగను జూప నుత్తరపుఁ♦జాయను దిక్సూచిదర్శకంబు, సా
156 గరమున దారి దప్ప కెటు ♦ గల్గును నావకు? నాపరాత్పరున్
దిరముగ నిల్పి జీవతరి♦దిక్సరిసూచకసూచి మానసం
బరయుచుఁ జూప, నెవ్వఁడుభ♦వాంబుధిఁ దాను దరింపకుండెడున్?

సీ. కోఁతిపిల్లలు, దల్లి♦కోఁతిని, గట్టిగాఁ
157 బట్టుక, యది పోవు ♦ పట్ల కేగుఁ;
గావున జాగరూ♦కత లేకపోయిన
జాతి క్రిందను బడి ♦ చచ్చుచుండు ;
మార్జాలశాబము ♦ లాత్మత నట్టులు పట్టు
కోలేక, యొకమూలఁ ♦ గూయుచుండుఁ;
గానఁ దల్లియె తన ♦ కూనలఁ గొని తగు
పట్టుల నిమ్ముగాఁ ♦ బెట్టుచుండుఁ;

తే.గీ. తారతమ్యంబు లిట్లెన్న ♦ తంత్రిబిత్తు
లైనవారలకును, బరా ♦ ధీనులకును—
తమ్ముఁ దా నమ్ముకొని యుండు ♦ ద్రాబ, కల్ల
దైవభారంబె యని యుండు ♦ ధన్యునకును. 219

చ. స్థితిగతు లెట్టి వైన నరె, ♦ చిత్తము దైవము మీఁద నుంచి, స్వ
158 స్థతఁగను యోగ్యుఁడెప్పు; డిది ♦ సత్యము, నిత్యముఁబల్లెలందు నర్
సతులు జలంబుఁ దేరె వరు ♦ సం దలపై నిడి పెక్కుభాండముల్,
క్షితి నొక చుక్కయేని యొలి ♦ కింపక, కష్టసుఖంబు లాడుచున్?

తే.గీ. మొదటఁ జేతికి నూనెను ♦ బూసి. పనస
159 కాయఁ జీల్చినఁ, బా లంటఁ ♦ గలవె కరము?
నట్లె, కాంతయుఁ గనకంబు ♦ నంటఁగలవె
నడుమ నీవున్నఁ బ్రాజ్ఞతఁ ♦ బడసి తొలుత? 221

ఉ. ఈఁదఁగ నిచ్చగించు నెవఁ ♦ డేనియు, నొక్కదినంబులోనె తా
160 నీఁదఁగలేఁడు సాహసము ♦ లెంతలు గల్గిన వార్థి, గొన్నినా
ళ్లీఁదఁగ నేరువ న్వలె, న ♦ ట్లే పరమాత్మమహాపయోధిలో
నీఁది రమింపఁ, జేయవలె ♦ నెన్నియొ తొల్తను రిత్తయత్నముల్.

ఉ. నాటకసూత్రధారుఁ డల ♦ నాందినిఁ బూటక మైనప్రార్థనల్
161 దీటుకొనంగఁ జేయ, నరు ♦ దేరఁడు కృష్ణుఁడు రంగభూమికిన్;
గాటపు భక్తి నారదుఁడె ♦ గానము సేయుచు వచ్చి పిల్వఁగా,
మాటున నుండలేక మురు ♦ మర్దనుఁ డాతని మ్రోల నిల్చెడున్.

తే.గీ. కృష్ణ! కృష్ణా! యనుచు నమ ♦ స్కృతులు సేసి
మనుజుఁ డెల్గెత్తి యెంత పా ♦ డిన, నతండు
గనఁబడఁడు గాని, నిశ్చల ♦ మనముతోడ
ధ్యానమును జేయఁగానె ప్ర ♦ త్యక్ష మగును. 224

ఉ. పాలను వెన్న గల్గు నని ♦ పల్కినమాత్రమున న్లభింప, దా
162 పాలను దోడు వెట్టి తరు ♦ వాతను దఱ్చంగఁ బుట్టువెన్న; యా
పోలిక నీశ! యీశ! యని ♦ బొబ్బలు వెట్టిన రాఁడు గాని, ప్రా
ల్మాంక సత్కృషి స్థలువు ♦ మాసిసి కాతఁడు గానిపించెడున్. 225

ఉ. భంగను మాట నాలుకను ♦ బల్కిన మాత్రన మత్తుగల్గునే
163 భంగును నూఱి నీట నిడి ♦ పానము సేసిన గల్గుఁ గాని, యి
ట్భంగిన దైవనామమును ♦ పైకి వచించినఁ దోఁప కుండ, న
ష్టాంగసమేతయోగముల ♦ నంటి భజింప, నతండు దోఁచెడున్.

ద్వి. ఎప్పు డహంభావ ♦ మెఱుకను జచ్చు,
164 నప్పుడు కైవల్య ♦ మందంగఁ గలము. 227

తే.గీ. మాయ యన్నటులముఁ జీల్చ ♦ మనసు దేవు
165 గాంచు నదుపాయ మతఁడె చూ ♦ పించుఁ; గాన
మాయ దొరుచు కాంక్షను ♦ మదిని దాల్చి,
యీశ్వరుని శ్రద్ధతోడ సే ♦ వింప వలయు. 228

మ. పరమానందపయోధి స్నాన మొనరిం ♦ పం బోవుచో, నడ్డమై
166 కలవం జూచను క్రోధలోభమహితో ♦ గ్రగ్రాహము, లద్దనో
త్తరవైరాగ్యవివేకనామకహరి ♦ ద్రాచూర్ణము న్బాసినో,
దరికి న్రా, కవి దాని వాసనలకు ♦ న్దూరమ్ముగాఁ బోవెడున్. 229

మ. మదిలోనుంచుక లోకమాత మఱి పా ♦ మాత్మ! పాపవృత్తంబుల
167 న్నదురం జేసెడు పట్ల, కేగవలె న ♦ న్నం దప్పకుండంగ, నీ
యెడ దుశ్చింతలు దూఱి యేఁచగలవే ♦ యోవేని నట్లైనచో?
మదియు న్నిగ్గఱి మాతపొంత నొసరిం ♦ పం గల్గునే దోషముల్?

తే.గీ. ధరను జిఱుఁజీమ లొనరించు ♦ ధ్వనిని గూడ
168 వినఁ గలుగు భగవంతుఁడు, ♦ మనుజుఁ డెట్లు

ప్రార్థనల్సల్పినను విన ♦ వచ్చుఁ, గాన
మన మతని బిగ్గరగ వేఁడఁ ♦ బనియు లేదు. 231

ఉ. ప్రాణముపైని తీపి యెటు♦రా? విడనాడి తరింపవచ్చునా,
169 మానవదేహ మస్థిచయ♦మాంససమేత మటంచు, రక్తముల్
మేనుల నిండి యుండును, ని♦మేషములో నవి గుల్లిపోవు నం
చో నరవర్య! యెంచు, మిఁక♦నూడును వాంఛలు జీవితంబుపై.

తే.గీ. వన్నె వలువల ధరియింప ♦ వగలుగెరలుఁ,
170 గామసందీప్తి, నర్మవా ♦ క్యములు, హెచ్చుఁ;
దంబుఱయుఁ దాళముల్గావి ♦ దాల్ప, భక్తి
వొడమి, భగవంతు ధ్యానింప ♦ బుద్ధిపుట్టు. 233

ద్వి. యుక్తవేషముఁ దాల్చి ♦ యుండినఁ గాని
భక్తుండు చెడిపోయి ♦ బాములఁ బడును. 234

తే.గీ. మనసు నిశ్చలమై యుండఁ ♦ గనఁగ వచ్చు
171 నీశు, నటుగాక చిత్తాబ్ధి ♦ నిట్టు లట్లు
గామపవనము వీచుచుఁ ♦ గలఁప, నెట్టు
లాత్మబింబంబు మానవుం ♦ డరయఁ గల్గు? 235

చ. బలిసిన మంచి వాలుగను ♦ బట్టఁగ జాలరి యెంతసేపొ, య
172 ప్పలఁ దన గాలము న్విసరి,♦పొంతను నిల్చునుగాదె! యోర్చి, కా
వలసిన చేఁప యాయెరను ♦ బట్టి గ్రసించెడు దాఁకఁ; గాంచఁగా
వలె నటె ప్రార్థనల్సలిపి ♦ భక్తుఁడు, వేసర, కాపరాత్పరున్. 236

ఆ.వె. అపుడె పుట్టినట్టి ♦ యాదూడ, నడ నేర్చు
173 మున్న, దొట్రుపాటు ♦ లెన్నొ గలవు;
భక్తిమార్గమందుఁ ♦ బతనముల్బహుళముల్,
గడకు విజయ మొందు ♦ గడచు మున్న. 237

మ. ఎదలో శాంతి యొకప్పు డుండి, తిరమై ♦ యెల్లప్పుడు న్నిల్వదే,
174 యదియే? మన్న, వెదుళ్లు గాల్పు నుదయం♦బౌ నిప్పు చల్లారఁగా
యది యెప్డాఁది రగుల్పు కున్న; నటె వ♦మ్మాఁ దత్త్వవిజ్ఞానవ
హ్నిః దమి న్మానవుఁ డాఱకుండ నది దా♦నిల్పన్వలెన్ శ్రద్ధతోన్.

సీ. కను గానరాని చీఁ ♦ కటిరాత్రిఁ, బ్రేతభూ
175 స్థలమున, శవమెక్కి ♦ సల్పునట్టి
జనభయావహ "శవ ♦ సాధన" నామక
ర్మంబునఁ, గాళిస్తో ♦ త్రంబుసేసి,
పురుషు లిర్వురు పిల్వ ♦ మొదలువెట్టిరి; నిశా
పూర్వభాగముననే ♦ పుట్టి భీతి,
పిచ్చివాఁడై పోయె ♦ భీరు వందొక్కఁడు,
కాళి రెండవవాఁడు ♦ గాంచఁగలిగె,

తే.గీ. నంబ దయచేత నానిశాం ♦ తంబునందు;
నవ్వు డాతండు వంగి జో ♦ హారు సేసి
యమ్మ! యీతఁడు వెఱ్ఱివాఁ ♦ డయ్యె నేమి?
కారణము దెల్పు మనుచును ♦ గాళి వేఁడె. 239

తే.గీ. ఓరి డింభక! నీకు నీ ♦ యోజ నెన్ని
మాఱులో పూర్వభవముల ♦ మతి చలించెఁ,
జివర కిప్పుడు నన్ను ద ♦ ర్శింపఁ గలిగి,
తంచుఁ బ్రత్యుత్తరం బిచ్చె ♦ నంబ యపుడు. 240

ఉ. మేఁకలు దూడ లావులును♦మేయక యుండఁగఁ, గొంటెపిల్లలున్
176 బేఁకక యుండ, వేయవలె ♦ వెల్గును జుట్టును జిన్న మొక్కలున్;
పీఁకను జెట్టుగాఁ బెరుఁగ, ♦ వేలుగ నిల్చును దాని క్రిందనే
మేఁకలు నాలుగేడకని, ♦ మెక్కుచు నాకులఁ బొట్ట నిండఁగన్.

ఆ.వె. భక్తి దీటుకొనెడు ♦ వఱకును, భక్తుండు
దూర ముండ వలయు ♦ దుష్టతతికి;
భక్తి పూర్ణమైనఁ, ♦ బాపసంగతిఁ దాను
జెడక, పాపులకును ♦ జేయు మేలు. 242

చ. ఒక పదివేల వత్సరము ♦ లుండిన నీట మునింగి నానుచున్,
177 చెకుముకిలోని వహ్ని వెడి ♦ శీతల మౌనె యొకించుకేనియున్?
జకచక విస్ఫులింగశత ♦ సంయుతకీలలఁ గాంతి గ్రక్కు నా
చెకుముకిఱాతి నుక్కునను ♦ జిత్తము వచ్చిన యప్డు గొట్టినన్.

తే.గీ. భక్తవరునకు నైహిక ♦ వంక యెంత
చుట్టుకొని యున్న, వదలవు ♦ సుమ్మి శ్రద్ధ
భక్తియును; మేను పరవశ ♦ త్వంబు నొందు
దైవనామం బతని చెవిఁ ♦ దాఁకినపుడు. 244

చ. గిరగిర నిర్ఝరాంబువులు ♦ కేవలము న్నదులట్లు మాఱుచున్
178 దిరిగినఁ గొన్ని పట్ల, నవి♦తిన్నని మార్గము నంటుఁగ్రమ్మఱన్;
వెఱపును జాలి సందియముఁ ♦ బెన్నదు లట్లపుడప్డు చిక్కులం
బఱపిన భక్తు డెంద, మది ♦ వానిని శీఘ్రమె వీడఁగల్గెడున్. 245

చ. శిలలు జలస్థమైనఁ దడిఁ ♦ జెందవు లోపల నెన్ని యేండ్లకున్,
179 సలిలము మంటి నంట నది♦నాని చెడు న్బెనురొంపి యౌచుఁ,జి
క్కులు ధృడచిత్తు నంటిన ది♦గుల్పడి తూలఁడు శ్రద్ధఁ, గాని దు
ర్బలహృదయుండు చంచలతఁ ♦ బాడగు నల్పపుఁ గారణంబులన్.

తే.గీ. శకటములఁ బెక్కు వెంట నీ ♦ డ్చుకొని, దుర్గ
180 మాధ్వములఁ బట్టి పోగబండి ♦ యరుగు మాడ్కి,
దుర్గమం బగు నపవర్గ ♦ మార్గమునను
బలుపురను గూడఁ గొనిపోవు ♦ భక్తవరుఁడు. 247

ఉ. బాలుఁడు సర్వభోగవిభ ♦ వంబులఁ జిక్కక, యొండు బొమ్మ నే
181 వేళను జేతఁ దాల్చి, యది ♦ పెన్నిధిగాఁ దలపోసి, తృప్తుఁడై
పోలిక, భక్తవర్యుఁ డిహ ♦ భోగముల న్ద్యజియించి, సర్వదా
తేలుచు నుండు మోదవన ♦ ధి న్పరమేశ్వరదర్శనంబునన్. 248

ఉ. కంబము బాలుఁ డూఁతగను ♦ గైకొని పాతభయంబు లేక చు
182 ట్టుం బరువెత్తుమాడ్కి, నెపు ♦ డుంబరమాత్మయె యూఁతగాఁగ డెం
దంబున భక్తి నమ్మకముఁ ♦ దాల్చి మెలంగెడు మానవుండు, లో
కంబున స్వేచ్ఛగాఁ దిరుగఁ ♦ గల్గెడు వీతవిషాదచిత్తుఁడై. 249

ఆ.వె. లోఁతు లేని కుల్య ♦ లోపలి జల మెల్ల
183 నెండ గాయఁగానె ♦ యెండి పోవు
కరణి, నీశ్వరాను ♦ కంపమాత్రముననే
పాపి పాపసమితి ♦ రూపు మాయు. 250

ఆ.వె. కర్త, రక్షకుండు, ♦ హర్తయు, భువి నెల్ల
184 కార్యములకు మూల ♦ కారణంబు,
నీశుఁడే యటంచు ♦ నెంచి, యహంకృతిఁ
జంపుకొనుట, మోక్ష ♦ సాధనంబు. 251

ఆ.వె. కాలినడక, దవ్వ ♦ గా యాత్ర నొనరించి,
185 తిరుగ నిల్లు సేరి, ♦ పఱుపుపైని
బవ్వళించి, ముందుఁ ♦ బడిన యాయాసంబు
మఱచి నిద్రపోవు ♦ మనుజు మాడ్కి, 252

ఆ.వె. జీవయాత్రఁ జేసి, ♦ చిక్కులు పడి, యహం
భావమంత యడఁచు ♦ మనుజుఁ, డీశు
నంటి కష్టపడక ♦ యనిశంబుఁ బూర్ణసౌ
ఖ్యాబ్ధిలోన నీఁదు ♦ లాడుచుండు. 253

తే.గీ. వట్టి యెండాకు గాలి యే ♦ ప్రక్క వీచు
186 నాకడకుఁ గొట్టుకొని పోవు ♦ వీఁక, మాన
వుం డహంభావమును బారి ♦ వుచ్చె నేని
భగవదిచ్ఛానుసారప్ర ♦ వర్తనుఁడగు. 254

సీ. పక్వామ్రఫలము లీ ♦ శ్వరునకు నర్పింప
187 భుజియించుటకుఁ గూడఁ ♦ బొసఁగియుండుఁ,
గాని కాకోచ్ఛిష్ట ♦ కలుషంబు లవియైనఁ
బనికిరాకుండు, నీ ♦ పగిది గానె,
పిల్లలుగా నుండి, ♦ విషయోపభోగసం
పర్కదోషంబుల ♦ వారి హృదయ
ములు చెడిపోవక ♦ ముందె, వారిని స్వామి
కైంకర్యమునఁ బెట్టి, ♦ జ్ఞానబోధ
ఆ.వె. మొసఁగవలెను; గాని ♦ యుల్లము ల్విషయసౌ
ఖ్యముల తాఁకుచేతఁ ♦ గసటువాఱ,
సరిగఁ దిప్పి వాని, ♦ సన్మార్గమునఁ బెట్ట
వలను గలుగ దెట్టి ♦ వాని కైన. 255

సీ. కాషాయవస్త్రము ♦ ల్గలిగించు భక్తి వి
188 శ్వాసము; ల్జీర్ణవ ♦ స్త్రంబు నరుని
కతని దారిద్ర్యంబు ♦ నగపఱుచుచు గర్వ
మును డించి నమ్రత ♦ మొనయఁ జేయు;
జిలుఁగుఁ బట్టంబులు ♦ శృంగారచేష్టలఁ
బుట్టించి, ధ్యానంబుఁ ♦ బొలియఁ జేసి,
వలపుఁబాటలు పాడ ♦ వాంఛలు గల్గించు,
నొక్కొక్కవస్త్ర మొ ♦ క్కొక్క గుణముఁ

ఆ.వె. గలుగఁ జేయఁగలదు, ♦ కావున భక్తవ
త్స్యుండు దేవుఁ గొలువ, ♦ నుచిత మైన
వలువఁ దాల్ప వలెను; ♦ వస్త్రంబు న న్నేమి
సేయు? నంచు నెంచఁ ♦ జెడును భక్తి. 256

సీ. ఒకబిడ్డఁ జంకఁ బె ♦ ట్టుకొని, రెండవవాని
189 కూఁతగాఁ దనచేతి ♦ నొసఁగి, యొకఁడు
దారిఁ బోవుచునుండఁ, ♦ దనయులు గృధ్రమొం
డీక్షించి, సంతోష ♦ హృదయు లగుచుఁ,
బరవశత్వమునఁ జ ♦ ప్పటలు గొట్టుచుఁ, దండ్రి
కాగ్రద్దఁ జూపించి; ♦ రపుడు చంక
శిశు వెట్టి కష్టంబుఁ ♦ జెందక సుఖముండె;
ధరణిఁ గూలెను నిరా ♦ ధారుఁ డౌచు
ఆ.వె. చేతి నూఁతగొనిన ♦ శిశు; వి ట్లహంకృతి
వదలి యీశు నమ్మ ♦ వాఁడు మోక్ష
మందుఁ; దనదు జ్ఞాన ♦ మాధారముగఁ జేసి
కొనెడువాఁడు వనటఁ ♦ గుంది చెడును. 257

ఆ.వె. శర్కరాచలంబుఁ ♦ జవిఁజూడఁ జిన్నచీ
190 మలును బెద్దవియునుఁ ♦ గలసి యేఁగి,
శక్తి ననుసరించి ♦ చక్కెరఁ గొనివచ్చు;
దాన శర్కరాద్రి ♦ దఱిఁగి పోదు. 258

క. అమితములౌ భగవద్రూ
పము లన్నియుఁ జూడ భక్త ♦ వరులకు వశమా?
తమ శక్తి కొలఁది నొకరూ
పము నొక్కఁడు సూడఁగల్గుఁ ♦ బాటుపడంగన్. 259

చ. సుర నొకఁ డించుకంత చవిఁ • జూచినమాత్రన సోలి వ్రాలు, ము
191 మ్మరముగఁ ద్రావియుం డొకఁడు • మత్తిలు, నిట్టులె భక్తులందుఁ గొం
దఱు పరమేశు రూపములఁ • దా మొకఁడే గని తృప్తచిత్తు లౌ
దురు, మఱికొంద ఱందుదురు • తుష్టిని నన్నిటిఁ గాంచు విస్మృతిన్.

ద్వి. ఇసుఁదెఱఁగుల వారు • నీశునిఁ జూచి
తరియింపఁ గల్గిన • ధన్యపూరుషులె. 261

సీ. బ్రహ్మజ్ఞుఁ డైనట్టి • వాఁ డొక్కరుండును,
192 భక్తవరుం డైన • వాఁ డొకండుఁ,
గాన నొండొకనాఁడు • గలసి పోవుచునుండ,
నెదురుగా బెబ్బులి • యేగుదెంచె;
నప్పుడు కరుణాళుఁ • డౌ నల్ల భగవంతుఁ
డే మనలను గాచు, • నెచటికేని
పాఱిపోవలసిన • పని లే, దటంచుఁ జె
ప్పెను జ్ఞాని; భక్తుఁ, డ • ట్లనఁగ రాదు,
ఆ.వె. స్వప్రియత్నమునను • జలుపుట కనువైన
పనిని గూడ దేవు • పైని బెట్టి
యూర కతని శ్రమము • నొందింపఁగా నేల?
పాఱిపోద, మంచుఁ • బలికెఁ బ్రేమ. 262

ఉ. జ్ఞానము పూరుషాకృతియుఁ, • గామినివంటిది దైవభక్తియున్,
193 గానఁ, ద్రిలోకమాత యుప • కంఠమునందు వసింప మాత్రమే
జ్ఞాని సమర్థుఁ డౌను; బటు • సారయుతం బగు భక్తిచిత్తముం
దూనిన ధన్యుఁ డంతిపురి • నుండఁగఁ గల్గును మాతసన్నిధిన్. 263

సీ. భ్రాష్ట్రింబులో వేఁచు • వడ్లయందునఁ, బేలి
194 పైఁ బడునవి వరి • పక్వము లగు;

కొంత పక్వము లైనఁ, ♦ గొంత మాలిన్యంబుఁ
బొరయును మంగలం ♦ బునను జిక్కి
యుండెడు గింజ; లీ ♦ యోజనే, భక్తుల
యందుఁ బ్రపంచసౌ ♦ ఖ్యములఁ బడక
సర్వంబుఁ ద్యజియించి ♦ సంచరించెడు వాఁడె
సంపూర్ణపరిపక్వ ♦ శస్తహృదయుఁ,
ఆ.వె. డింక నట్లు గాక ♦ యిహసుఖాభిరతుఁడై
మెలఁగు భక్తుఁ డెట్టి ♦ మేటి యైన,
వాని హృదయ మపరి ♦ పక్వంబు, దుష్టంబు,
నౌ నొకించు కంచు ♦ నరయ వలయు. 264

సీ. తరిగోలఁ బాలను ♦ దరువఁగా నుదయించు
195 వెన్నముద్దను దీసి, ♦ వేఱు పఱచి,
స్వచ్ఛమౌ జలమందుఁ ♦ బడవేయ, మలినమై
చెడకుండు; నటుగాక ♦ క్షీరభాండ
మందుననే యుంచ, ♦ నద్ది పాడై పోవు;
నట్టులే యుంచుక ♦ ధ్యాననిష్ఠ
భక్తియు జ్ఞానంబుఁ ♦ బడసిన మనుజుండు
ప్రాపంచికార్థ సం ♦ బంధములను
ఆ.వె. వదలి, తిరుగఁ దాను ♦ వానిలోఁ బడకుండె
నున్నఁగాక, వెనుక ♦ నున్న యించు
కంత చిత్తశుద్ధి ♦ హరియించి, పూర్వపు
మలినవృత్తి వచ్చు ♦ మనసునకును. 265

ఉ. ఇమ్మగు బొమ్మఁ జేతఁ గొని ♦ యిచ్చట నచ్చట నాడుకొంచుఁ, జి
196 త్రమ్ముగ బాలకుండు, తన ♦ తల్లిని జూచిన తత్క్షణంబునన్,

బొమ్మను బాఱవైచి, యెటు ♦ పోయెనో యమ్మ! యటంచు, నశ్రువుల్
గ్రమ్మెడు కన్నుదోయి, వెను ♦ కం బఱవెత్తుచుఁ దల్లిఁ జేరెదున్.
తే.గీ. ఐహికసుఖాభిరతుఁ డైన ♦ యాతఁ, డిట్లె
తాను దేవిని జూచిన ♦ తత్క్షణంబె,
విత్తవైభవకీర్తులు ♦ విడిచి పెట్టి,
యామెఁ జేరెడు మార్గంబు ♦ నరయుచుండు. 267

సీ. ధాన్యబీజమునందుఁ ♦ దండులమే యంకు
197 రం బొందు; నైన బి ♦ య్యంబుఁ జల్ల
మొలకెత్త నేరదు; ♦ మొలకనే కోరిన,
వడ్లను జల్లంగ ♦ వలయు; నంకు
రాధారమును జూడ ♦ నాసపుట్టిన, దుల్ప
వలయుఁ దుషంబు; నీ ♦ పగిదిగానె
నరుఁడు విహితాచర ♦ ణంబు మూలంబున
జ్ఞానాంకురము నొందఁ, ♦ జలుపవలయు
తే.గీ. శ్రద్ధ విధ్యుక్తకర్మము; ♦ ల్సకలకర్మ
ములనుగల జ్ఞానసారంబు ♦ దెలియఁ గోరు
వార, లందులఁ గలయట్టి ♦ పైమెఱుంగు
లెంచి, నేర్పున నవి దోలఁ ♦ గింపవలయు. 268

చ. పలుకులు రావు పెన్మదిమి ♦ వచ్చిన చిల్కకుఁ జెప్పఁ, గాని లేఁ
198 జిలుకకు వచ్చు, నీపగిదిఁ ♦ జిన్నతనంబున నుండు వారికిన్
సలలితదైవభక్తియును ♦ జ్ఞానము నబ్బఁగఁ గల్గుఁ; గాని వృ
ద్ధుల కలుషాంతరంగములఁ ♦ దోఁచఁగ రావవి, యెంత చేసినన్.
ఆ.వె. చిన్న మొక్క వంగి, ♦ చెట్టైన వంగని
199 పగిది, నరుఁడు లేఁత ♦ ప్రాయమందు

భక్తిఁ బడయఁగల్గి, ♦ వార్ధకకర్కశ
హృదయుఁ డైన దాని ♦ నెనయఁ డేఁడు. 270

తే.గీ. చాల నీళ్ళను గలిపిన ♦ పాలు, మంచి
200 పాలుగాఁ గాంచఁ గష్టమౌ ♦ పగిది, నైహి
కసుఖలోలాత్ముఁ డౌవాని ♦ కలుషమానసము
స్వచ్ఛభక్త్యాత్మఁజేయఁ గ ♦ ష్టంబుసుమ్మి! 271

తే.గీ. సూదిలోఁ దారమును గ్రుచ్చ ♦ సూక్ష్మముగను
201 దారమును ముందు నల్పి వి ♦ ధమున, ధరను
నరుఁ డహంకారము నలిపి ♦ నమ్రుఁ డగుచుఁ
దిరుగవలెఁ బూర్ణభక్తిలోఁ ♦ జొరకముందు. 272

సీ. పుట్ట యొక్కటి యున్కి ♦ పట్టుగావించుక,
202 బాటఁ బోయెడువారిఁ ♦ బట్టి కఱచి,
మనుజుల కెల్లను ♦ మార్గావరోధంబు
నొక త్రాఁచు గల్గించు ♦ చుండ, నొక్క
సంయమి యాదారిఁ ♦ జనుచు, దానికిఁ దార
సిల్లంగ; ఫూత్కృతి ♦ సేసి కఱవ
సర్ప మడ్డం బేగ; ♦ సంచలింపక యాతఁ
డుండుట వీక్షించి, ♦ యురగ మంత

తే.గీ. బ్రమాన్పడుచు నిల్వ, యోగి స ♦ ర్పంబుఁ జూచి
"నన్నుఁ గఱవంగ వచ్చితే ♦ పన్నగేంద్ర!"
యంచు, నెవ్వారి కేఁక నీవు ♦ హాని సేయ
వలదని దురాయి వెట్టి పో ♦ వంగ, నంత, 273

ఆ.వె. నాఁటఁగోలె సర్ప ♦ నాథుఁ డెవ్వారికిని
హాని సేయకుంట ♦ యరసి, తోసి

గరళ మంతఁ బోయెఁ ♦ గలవతే డీక సంచు,
నార్తిఁ బెట్టఁ దొడఁగి ♦ రందఱహిని. 274

క. కొందఱు తోఁకం బీఁకిరి,
కొందఱు గఱ్ఱలను జాలఁ ♦ గొట్టిరి తలపై,
యొందఱు తను బాధించిన,
డెందంబున శాంతి నూని ♦ డీకొన దహియున్. 275

క. పడరాని పాట్లఁ బడి, యతి
నుడి జవదాఁటంగలేక, ♦ నొచ్చుచు, నతఁ డి
ప్పుడు వచ్చు నంచు నుండఁగఁ,
బడెఁ గన్నుల నతఁడు వ్యాళ ♦ భాగ్యవశమునన్. 276

క. వచ్చిన యోగికి నెఱఁగుచుఁ,
"చచ్చుటొకటి తక్క నాకు ♦ సర్వం బయ్యెన్,
ఱచ్చవడి పోయెఁ జిత్తం,
బిచ్చో నేఁ జేయు కార్య ♦ మెద్దియొ చెపుమా." 277

ఆ.వె. అనుచు సర్ప మడుగ, ♦ నాతండు "జనులకు
హాని సేయఁబోకు ♦ మంటిఁ, గాని
యాత్మరక్షణార్థ ♦ మన్యుల బెదరింప
వల దటంచు నేను ♦ బలికినానె?" 278

క. అని చెప్పి వారిఁ బోయినఁ,
దన కెఱిఁగించిన విధంబుఁ దప్పక, యహియున్
జనముల భయపెట్టుచు, నొ
క్కనిఁ దాఁ బొలియింపకుండఁ ♦ గాలముఁ గడపెన్. 279

తే.గీ. ఈశ్వరాఖ్యానవరు లిట్లు ♦ యెవ్వరేనిఁ
దమకు నష్టము కాకుండఁ, ♦ దాసభక్తు

ఇతరహృదయంబులందుఁ గ ♦ ల్పించి, హాని
యింతయును జేయకుండఁ, వ ♦ ర్తింపవలయు. 280

తే.గీ. గాఢభక్తియు, విశ్వాస ♦ గరిమ, పూర్ణ
203 నిశ్చలధ్యాననిష్ఠయు, ♦ నీకొసంగ
రాత్రియుఁ బవలుఁ గూడఁ బ ♦ రాత్పరుఁడకుఁ
జేతులను మోడ్చి ప్రార్థన ♦ ల్సేయు మయ్య. 281

తే.గీ. ఉగ్రవిషభీకరోరగ ♦ ముండు నింట
204 నుండు నరుపోల్కి, లోకమం ♦ దుండవలెను
జాగరూకతతో నర ♦ సత్తముండు,
శత్రుపట్టంబునకుఁ జిక్కి ♦ చావకుండ. 282

ఆ.వె. సజలపాత్ర నెంత ♦ స్వల్పరంధ్రం బున్నఁ,
205 గ్రమముగాఁ జలంబు ♦ గారిపోవు,
ధ్యాననిష్ఠ యంత ♦ ధ్వస్తమౌ నారీతి,
నాశ మదినిలేశ ♦ మంతయున్న. 283

చ. భరతుఁడు, రావణానుజుఁడు ♦ వ్యాససుతుండు, బలిక్షితీశ్వరుం,
206 డురుయశుఁ డాహిరణ్యకశి ♦ పూద్భవుఁడు, న్వ్రజకామినీమణుల్,
స్థిరతరభక్తి నీశ్వరుని ♦ సేవను మాత్రము గోరి, ముక్తిఁ గాం
చిరి, గురునాజ్ఞల న్సరకు ♦ సేయక, కోరక లౌకిసౌఖ్యముల్.

ఆ.వె. ఉర్వి నాగడికలకు ♦ నుబ్బంగ, కసున
207 మేను మఱచి తిట్లు ♦ వాని దూష
ణముల కలుగకుండ, ♦ నరుఁ, డీశ్వరధ్యాన
పరత, న్యాయవృత్తిఁ, ♦ దిరుగవలయు. 285

ఆ.వె. పాముఁగప్ప సహజ ♦ వైరంబుఁ బాయుచు
208 మెలఁగుకరణి, జలము ♦ నలిన పత్రి

మందు నిలుచు భంగి, ♦ నంతియు నంటక
తిరుగవలయు నన్న ♦ తిని నరుండు. 286

సీ. అష్టకాష్ఠం బను ♦ నాటలోఁ, గాయలు
209 గళ్లను దిరుగుచుఁ, ♦ గడకు మధ్య
భాగంబునకుఁ జేరి, ♦ పండిపోవు; నటులు
రాలేనికాయ యా ♦ టడిగఁ జుట్టుఁ
జనుచుండుఁ, జల్వత ♦ చర్వణంబుగఁ, బండఁ
జాల కెప్పుడు; నొక్క ♦ చక్కి రెండు
కాయ లుండిన, నన్నె ♦ గ్లైగకుండఁగాఁ
బండుట సులభ; మీ ♦ పగిదిగానె

ఆ.వె. తనదు గురువు నిష్ఠ ♦ దైవంబు నూఁతగాఁ
జేసికొనుచు, శుద్ధ ♦ చిత్తమునను
ధ్యాననిష్ఠ నుండు ♦ నతఁ, డతిసులభంబు
గా విముక్తిఁ జెందఁ ♦ గలఁడుసుండి. 287

తే.గీ. తులను బంగారు వెట్టుచుఁ ♦ దూఁచునపుడుఁ,
210 ధాన్యమును జోటిలోఁ బోసి ♦ దంచునపుడుఁ,
దానికయుఁ దండులములు ని ♦ ర్దోషములుగ
నుండుటకు, వానిఁ గదలించు ♦ చుందురు గద. 288

తే.గీ. మాటిమాటికిఁ బరికించి ♦ మనుజుఁ డిల్లె,
స్తుతుల కుబ్బను, గోపంబు ♦ దూఱులకును,
జర్మసంఛన్నశల్యపం ♦ జరశరీర
వాంఛ, వీడుట కనుఁగొన ♦ వలయుఁ జుమిత్ర. 289

సీ. పిచ్చిపట్టినవాని ♦ విధమునఁ జరియించు
211 సాధు వొక్కఁడు, భవ ♦ సతిని జూడ

జేవళంబున కేగు ♦ దెంచి, క్షుధార్తుఁడై,
యచ్చటశ్వోచ్ఛిష్ట ♦ మైనయన్న
మునఁ గొన్ని కబళము ♦ ల్భుజియించి, పిమ్మటఁ
గాళి దర్శించి, వే ♦ గమునఁ దాను
వచ్చినమార్గంబుఁ ♦ బట్టి పోవుచునుండ,
నొక్కఁడు వానిని ♦ యోగియంచు

ఆ.వె. నెఱిఁగి, వెంబడించి, ♦ గురువర్య! నాకు జ్ఞా
నంబుఁ గఱపు మనిన, ♦ నగరమునకుఁ
బొంతఁ బాఱుచుండు ♦ మురికికాలువలోని
జలముపైపు చేయి ♦ సాఁచి చూపి, 290

ఆ.వె. గంగలోని నీటి ♦ కరణిని, నీ విటఁ
జూచునట్టి నీరు ♦ దోఁచు నెప్వ,
డపుడు నీకు జ్ఞాన ♦ మబ్బును దప్పక,
యంచుఁ జెప్పి త్రోవ ♦ నరిగె నతఁడు. 291

తే.గీ. చంచలాంతరంగుఁడును, బాపి ♦ పంచికసుఖ
212 నక్తుఁ, డౌవాఁడు కాంతకు ♦ స్వర్గమునకుఁ
జిక్కి, భగవంతు సేవించి ♦ సిద్ధి నొందఁ
జాలఁ, డని చెప్పుటకు నేమి ♦ సందియంబు? 292

మ. ప్రణతుల్పూజలునందు బొమ్మలు, యథా♦ర్థంబైన దైవంబులాం
213 ఛనముల్గా గణియించు చుండిన, విశే♦షం బైన సౌఖ్యంబు ని
చ్చి నరు న్ముక్తుని జేయు; నయ్యవి యిఁక♦న్నిల్పి ప్రణీతంబులే!
యని భావించెడు వాని పూజలు వృథా♦యాసంబులై పోయెడున్.

మ. జలపూర్ణం బగు పాత్రమొక్కెడ నుం♦చ, న్గొన్ని నాళ్లేగ, నం
214 దలి నీరంతయు నింకిపోవు; నిఁకఁ బా♦త్రి న్వ్యర్థులోఁ బెట్టినన్,

చిత్తము నెవ్వఁ డీశ్వరుని • సేవలఁ జొన్పునొ నిత్యము, న్సదా
యుత్తములౌ సునృత్తముల • నాతని కయ్యది ముక్తి నిచ్చెడున్.

తే.గీ. తల్లిదండ్రులతోడను • దారతోడ
222 సుతులతోడను గలహించి, • సుఖము రోసి,
యింటిలోపలి పోరు భ • రింపలేక,
సన్యసించుట వైరాగ్య • సరణి గాదు. 305

తే.గీ. ఏల యన, నట్టి వైరాగ్య • మెన్నఁటికిని
శాశ్వతంబుగ నిల్వక • సడలి పోవు;
విషయ సౌఖ్యంబులకు, విత్త • విభవములకు
నాసపడి చిక్కుఁ గ్రిమ్మఱ • నట్టివాఁడు. 306

తే.గీ. పాటు పడి పడి గొప్ప వై • భవము గల్గు
223 మంచి యుద్యోగమునఁ జొచ్చు • మానవుండు ;
యత్నములు సేసి మనుజుఁ డీ • యనువుగానె
కష్టపడి పొందు భగవదు • త్కృష్టపదవి. 307

ఆ.వె. ఐనఁ, గాళిదాసుఁ • డంబిక దయచేత
ఘనకవిత్వపటిమఁ • గాంచినట్లు,
శ్రమముఁ జెందకుండ • సచ్చిదానందంబు
నెనయు నొక్కఁడొక్కఁ • డీశుకృపను. 308

తే.గీ. ఈశ్వరుని నామ మెపుడు గొం • తెత్తియఱచు,
224 చోద లెఱుంగక, యుండెడి • యోగ్య భక్తి,
యచిరకాలంబుననె ఫలం • బందఁ జేయుఁ,
గాన మనసపూర్వకభక్తి • కంటె మేలు. 309

తే.గీ. ఇట్టిది విశేషభక్తినా • నెఱుఁగఁబడు, చ
నన్యసాధన లభ్య స • ర్వాత్మపదవి,

సద్యః దెగఁగోసి, పొందించు; ♦ నందవలెను
వాని సాన్నిధ్యమును బల♦వంతముగనె. 310

ఆ.వె. అంతరంగవృత్తు ♦ లారసి, సతతంబుఁ
225 గల్పతరువు పగిదిఁ, ♦ గావలసిన
ఫలము లొసఁగు, వారి♦వారి వాంఛలఁబట్టి,
జనుల కీశ్వరుండు ♦ సదయుఁ డగుచు. 311

తే.గీ. ఈశ్వరుం డిచ్చు పదవుల ♦ నెనసి నరుఁడు
దత్సుఖంబులఁ దృప్తచి ♦ త్తముననున్న,
వాని సుఖపెట్టు దేవుఁడు; ♦ ప్రాప్తసౌఖ్య
ములకు సంతుష్టి లేకున్న ♦ పురుషు రోయు. 312

తే.గీ. బాల్యచాపల్యమునఁ బిల్లిఁ ♦ బట్టి గిల్లి,
226 స్కందుఁ డొకనాఁడు తనమాత ♦ సదనమునకు
నరిగి, పార్వతి చెక్కిలి ♦ యంటి యున్న
గాయమును గాంచి. తల్లిద♦గ్గఱకుఁ బోయి, 313

తే.గీ. “అమ్మ! యీగాయ మెటువచ్చె?” ♦ ననుచు నడుగ,
“నేను సర్వాత్మనై యుంట, ♦ నీవు పిల్లిఁ
బట్టి గిల్లిన గిల్లిదె! ♦ బాధపెట్టు
న” న్ననుచుఁ బల్కె సుతునితో ♦ నగతనూజ. 314

కం. భగవద్రూపము లన్నియు
ను గనుక, నెద్దాని నేని ♦ నొప్పించినచో,
భగవంతున కాబాధలు
దగులు నని, యూహింప మదిని ♦ దాల్తురు జ్ఞానుల్. 315

ద్వి. చెలువల చెక్కులఁ ♦ జిట్టంటు లిడఁగఁ
దలపోయువారిది ♦ తలపోయవలయు. 316

తే.గీ. మంచి చేఁపలు దొరకెడు ♦ మనికి వెదకి
227 వానిఁ బట్టెడు ధీవరు ♦ పగిది, భక్తుఁ
డరసి సద్గురు, నెదఁ బర♦మాత్ము గట్టి,
దివ్యసుఖకరముక్తి సా♦ధింపవలయు. 317
తే.గీ. కంటఁ బడ కెంత దూరంబు ♦ గాఁ గొలంకు
228 లందు మత్స్యంబు లున్న, నా♦వంత మెఱచి
గాలమున గ్రుచ్చి వేయంగఁ, ♦ గదలి వచ్చి
క్రమ్ముకొను నవి దాని; నీ♦కరణిగానె, 318
తే.గీ. ఎచట నగపడ నట్టి స♦ర్వేశ్వరుండు,
హృదయమున భక్తి దీపింప ♦ నెవ్వఁ డుండు,
వానిఁ బసిగొని సరగున ♦ వచ్చి కాఁపు
రంబు సేయును వాని చి♦త్తంబునందు. 319
ఆ.వె. ఓడ జలమునందు ♦ నుండవచ్చును, గాని
229 యుండఁగూడ దుదక ♦ మోడ యందు.
నరుఁడు లోకమందుఁ ♦ దిరుగవచ్చుఁ, బ్రపంచ
మతని లోన నుండ ♦ హానివచ్చు. 320
చం. కరణము లంతరంగమును ♦ గట్టుచు నొక్కటి చేసి యుంచినన్,
230 బురుషుఁడు వాంఛితార్థములఁ♦బొందును, బ్రార్థన యన్ననిట్టిదే;
పెఱతలఁపు ల్మది న్గదిసి ♦ పీడయొనర్చుచునుండఁ, బైకి ద
బ్బఱ లగు ప్రార్థన ల్సలుప, ♦ వాంఛ ఫలింప దొకించుకేనియున్.
ద్వి. నిర్మలజ్ఞానంబు; ♦ నిశ్చలభక్తి,
231 మర్మ్మొ బెఱుఁగ నొక్క♦మాడ్కినే యుండు. 322
చం. బల మొప మోక్షకాములకుఁ ♦ బట్టుచు మే లొనరించు నన్న, జ
232 ల్లులుగ స్రవించు బాష్పముల♦లోఁ జామి! మూరము సేసియేడ్చుచి

ల్లలఁ గని మాత కోరికల ♦ లాలన సేయుచుఁ దీర్చుభంగి, నే
డ్పుల విని పుత్రికోటి తలఁ♦పు ల్నెఱవేర్చును దేవుఁ డెల్లెడన్.

సీ. గంధేభకాయంబుఁ ♦ గడిగి, యచ్ఛోదకం
233 బున వెన్క స్వేచ్ఛగాఁ♦బోవ డాని
విడిచిన, బురదలోఁ ♦ బడి పొర్లి మలినమౌ;
నట్లుగా, కట్టానిఁ ♦ గట్టిపెట్టి
యొకచోట నుంచిన ♦ నకలంకమై యుండు;
నటులె మహాత్ముల ♦ నంటి నీవు
సకలమాహాత్మ్యుండవై ♦ యలరారి యొకసారి,
స్వేచ్ఛ నైహికముల ♦ నెనసితేనిఁ,
తే.గీ. దిరుగ వేగంబ శుద్ధత్వ♦గరిమ వోయి
చెడుట సిద్ధాంత; మీ వటు ♦ సేయకుండ,
నీదు మన సీశు మీఁదనే ♦ నిలిపితేనిఁ,
జిత్త మెన్నండుఁ గలుషతఁ ♦ జెంది చెడదు. 324

ద్వి. త్రికరణశుద్ధితో ♦ దేవు ధ్యానింపఁ,
234 బ్రకటితుండై వాఁడు ♦ ప్రత్యక్షమగును. 325

తే.గీ. కాఁపు దెచ్చెడి స్వల్పపుఁ♦గానుకయును
235 సంతసంబునఁ గొనెడు భూ♦స్వామి పగిది,
నమలభక్తుఁ డర్పించు కా♦నంత వస్తు
వేని, దేవుండు గొని సంత♦సించు మంతు. 326

తే.గీ. కృత్రిమము లైన ఫలములు ♦ మృగవితతియుఁ
236 దత్తదనుకారమూల ప ♦ దార్థములను
జ్ఞప్తికిం దెచ్చుకీతి, న ♦ ర్చనలనందు
విగ్రహం, బాదిదేవు జ్ఞ♦ప్తికిని దెచ్చు. 327

తే.గీ. శిలలఁ గఱ్ఱలఁ జేతితోఁ ♦ జెక్కినట్టి
237 విగ్రహంబులు, వాని జ్ఞ ♦ ప్తికిని జేక,
నిత్యుఁడు నిరాకృతియు నైన ♦ నిర్మలాత్ము
నెట్లు స్మృతికిని దెచ్చు? నం ♦ చెంచవలదు. 328

కం. చింతింపుము దేవుఁడు స
ర్వాంతర్యామి యగు కతన, ♦ నారాధితవ
స్త్వంతరమున నుండు నటం,
చంతంబగు నీదు సంశ ♦ యం, బంతయునున్. 329

ఆ.వె. వ్రాఁత నేర్చుకొనెడు ♦ బాలుండు తొల్తను
238 పలుఁద యక్కరముల ♦ వ్రాసి, పిదప
సన్న లిపిని వ్రాయు ♦ చాడ్పునఁ, బరమాత్ముఁ
గొల్చి మోక్ష మొందఁ ♦ గోరు నతఁడు, 330

కం. తొలుత స్సాకారప్రతి
మలపై లక్ష్యంబు నుంచి ♦ మనమునఁ బూజల్
సలుపుచు, వెనుక నిరాకృతి
నొలసెడు బ్రహ్మమున లక్ష్య ♦ ముంచఁగవలయున్. 331

కం. విలువిద్దెఁ గఱచు నాతఁడు
239 దొలుత న్గతి చేసి కొట్టి ♦ స్థూలపదార్థం
బుల, వెనుకఁ గొట్టు సూక్ష్మం
బుల, నిట్లే నరుఁడు ధ్యాన ♦ మును జేయవలెన్. 332

ఆ.వె. విగ్రహములఁ దొల్తఁ ♦ బెట్టి పూజించుచు,
చిత్తమమలభక్తి ♦ స్థిరము సేసి
కాని, నిర్గుణాత్మ ♦ ధ్యానంబు సేయుట
దుష్కరంబుగానె ♦ తోఁచుచుండు. 333

తే.గీ. కాంచనం బొక్కటే యనే • కంబు లైన
240 తొడవు లౌ మాడ్కి, నద్వితీ • యుం డగు దేవుఁ,
డయుతరూపంబులను బూజ • లందుచుండు,
దేశములఁ బట్టి, కాలంబు • తెఱఁగుఁ బట్టి. 334

తే.గీ. తండ్రి యంచును, మముఁ గన్న • తల్లి యంచు,
నెయ్యుఁ డంచును, గాదు పె • న్మిటి యటంచు,
నిట్లు భగవంతు ధ్యానింతు • రిన్ని గతుల
నల చిదానందుఁడే ధ్యాతుఁ • డైనవాఁడు. 335

తే.గీ. పేదపాఱున కొకనికి • విత్తవంతుఁ
241 డైన వర్తకుఁ డొక్కఁడు, • నతని భార్య,
గూర్చువారలుగా నుండఁ, • గోరె వానిఁ
బుస్తకముల కతఁడు చిన్ని • పొత్తి గుడ్డ. 336

కం. అందుల కాతఁడు, ప్రస్తుత
మందున లే దయ్య చిన్ని • యంబర మేదియున్,
మఱం దనువు చూచి యిచ్చెద,
నందియపడ కింటి కీవు • చను మనె, నంతన్, 337

తే.గీ. ఇంటి లోపల నున్నట్టి • యింతి యద్ది
యంతయును విని, విభుఁడు గృ • హంబునకును
రేయి వచ్చినతోడనే, • రెండు పట్టు
బట్ట లప్పుడె తనకుఁ గా • వలయు ననియె. 338

తే.గీ. ఎల్లి దెచ్చెద నని నాథుఁ • డెంత చెప్పి
నను వినక, భార్య రాత్రి యా • తనిని బంపి,
యంబరంబులు దెప్పించి, • యాక్షణంబ
పంపె వానిని భక్తితో • బ్రాహ్మణునకు. 339

కం. జనకునిగా సర్వేశ్వరు
మనమున ధ్యానించుకంటె, ♦ మాతగ భావిం
చినవాఁడు, శీఘ్రముగఁ దా
నెనయును మోక్షం బటంచు ♦ నెంచఁగవలయున్. 340

చం. తనవలె భక్తుఁ డొక్కఁడును ♦ ధాత్రిని లేఁ డని విఱ్ఱవీఁగు న
242 ర్జునునకు సిగ్గుఁ దేర, మధు♦సూదనుఁ డాతనిఁ గొంచుఁ గానకుం
జని, యట నాకులే తినుచుఁ ♦ జాలఁ గృశించిన మేను గల్గి, చే
తను గరవాల మొక్కటిని ♦ దాల్చి, మెలంగెడు భక్తునిం గనెన్.

కం. కని యాబడుగును బార్థున
కును జూపిన, నతఁడు నవ్వ ♦ కొంచున్, ఖడ్గం
బును గేలఁ దాల్చి యీ వె
వ్వనిఁ జంపెద వంచు నడుగ, ♦ వాఁ డిట్లనియెన్. 342

సీ. పగలు రాత్రియుఁ గూడ ♦ దెగవాఁగి జగదీశు
నిదురవోనీఁడు నా ♦ రదుఁడు పశువు!
భుక్తశేషాన్నంబు ♦ భుజియింపు మని యిచ్చె
శౌరికి మూర్ఖ పాం ♦ చాలి యొకతె;
యుక్కుకంబంబున ♦ నుదయింపు మని విష్ణు
నలయించెఁ దులువ ప్ర ♦ హ్లాదుఁ డొకఁడు;
గోపాలు రథచోద ♦ కునిఁజేసెను మదాంధుఁ
డర్జునుం డను క్షత్రి ♦ యాధముండు;
తే.గీ. వీరి నల్వురఁ దెగటార్చి, ♦ పృథివి భార
మును దొలంచిన పిదపఁ, గ ♦ త్తిని ద్యజించి
పోదు, నం చాతఁ డనినఁ, దా ♦ మొగము చిన్న
పుచ్చుకొని, గర్వముడిగి, వి ♦ వ్వచ్చుఁ డరిగె. 343

తే.గీ. అన్నికర్మంబులును బర ♦ మాత్మకృతము
243 తే యనుచు, వానియిచ్చనే ♦ యిలను దిరిగి,
యించుకైన స్వతంత్రత ♦ నెఱయకుండ,
మెలఁగువాని కహంకృతి ♦ పొలియుఁజుమ్మి 344

ద్వి. భగవంతుఁ డొక్కఁడే ♦ భక్తవర్యుండ!
244 తగు దేశికుఁడు, మార్గ ♦ దర్శి, యం చెఱుఁగు. 345

తే.గీ. స్వారికిం జని రిద్దఱు ♦ సచివు; లొక్క
245 చక్క భాగవతంబును ♦ జదువుచుండ,
నంమలకు నేగి సత్కథల్ ♦ విందమంచుఁ
బలికె నొక్కఁడు; రెండవ ♦ వాఁడు నవ్వి, 346

ఉ. చేరువ నున్న వేశ్య యిలు ♦ సేరుచు, దాని విలాసరేఖ క
న్నారఁగఁ జూచి, విద్యముల ♦ నందుచు, గానరసంబుఁ గ్రోలు మఱి,
సారసగంధి కౌఁగిళుల ♦ నందున జిక్కి, సుఖింత మయ్యా! యే
లా! రసహీనపూర్వకథ? ♦ లంచువచించెను భిన్నబుద్ధియై. 347

తే.గీ. వెంట నొకఁడు పురాణంబు ♦ వినుట కేగె,
నేగె నొక్కఁడు వెలయాలి ♦ యింటి, కైన
నొకని నొక్కఁడు దలఁచుకొం ♦ చుండి రచట,
వారికిం గల స్నేహాను ♦ బంధమునను. 348

ఆ.వె. మిండకత్తె సెజ్జ ♦ నుండియు, నెదను భా
గవతమునెతలంపఁ ♦ గలిగె నొక్కఁ;
డొడలు భాగవతము ♦ కడ నుంచి మనసును
వెలవెలంది కడను ♦ బెట్టె నొకఁడు. 349

తే.గీ. తలఁపుఁబట్టియుఁ, జిత్తని ♦ శ్చలతఁబట్టి
నిత్యసుఖమును, బుణ్యంబు, ♦ నెగడుఁగాని,

పటువిడంబనముల, బాహ్య ♦ వర్తనముల,
నెనయలేఁ డవ్వి పురుషుఁ డొ ♦ క్కింతయైన. 350

తే.గీ. ఒక్క సన్యాసి కోవెల ♦ నుండి, ధ్యాన
246 మునుబూనర్చుచు, నాలయం ♦ బునకు నెదుట
ననుదినంబును బూజఁగుశా ♦ యలకు నాట
పట్టయిన యొక్క వెలయాలి ♦ భవన మరసి, 351

ఉ. వచ్చుచుఁ బోవుచుండు విట♦వారముఁ గాంచుచు "నిట్టియున్కిచే
వచ్చెడు దోష మింత యన♦వచ్చునె! యోచపలాక్షి! భోగముల్
వచ్చునె చచ్చువెన్క? యమ ♦ బాధల కోర్వఁగనేర్తె? వీరలం
బుచ్చి సుఖింపు" మంచుఁ బడ♦పుంజెలి కాతఁడు బుద్ధిచెప్పఁగన్,

కం. సమయింపలేక కులధ
ర్మము, నెప్పటి యట్ల యున్న, ♦ మదిలో "నాపా
పములను బోఁగొట్టుమా! దై
వమ!" యని ప్రార్థించుచుండె ♦ వారాంగనయున్. 353

కం. తనచెప్పినబోధము లది
వినలే దని కుంది, యోగి, ♦ విడుచుచు ధ్యానం
బును, దాని పాపములె ల
క్కను బెట్టఁగఁదొడఁగె సర్వ ♦ కాలములందున్. 354

ఆ.వె. అంత నిద్దఱకును ♦ నాయువు మూఁడ, వా
రొక్కసారి మరణ ♦ మొందఁగానె,
విష్ణుభటులు వచ్చి ♦ వెలఁదిని గొనిపోయి,
అంతకభటు లరిగి ♦ రతనిఁ గొనుచు. 355

ఆ.వె. ఇతరదోషములనె ♦ యెంచుచు సన్యాసి
నరకబాధ పడుచు ♦ నష్టుఁ డయ్యె.

వారవనిత, పాప ♦ పరితప్తచిత్తయై
స్వర్గసుఖముఁ బొందఁ ♦ జాలెఁ గనుఁడి. 356

ఆ.వె. స్నానమాడ నదికిఁ ♦ జని యొక్కఁ, డక్కడ
247 సన్యసింపఁ బోవు ♦ జనుని జూచి,
యతిపవిత్ర మంచు ♦ యత్యాశ్రమమును దాఁ
బ్రీతి నాక్షణంబ ♦ స్వీకరించె. 357

ద్వి. జగతిలో నిట్టి ని ♦ స్సంగత్వమే, ప
రఁగును విశేషమై ♦ భాగ్యంబు నాఁగ. 358

తే.గీ. బూడిదను బోయు పన్నీరు ♦ పోలియుమాడ్కి,
248 భక్తి, యాడంబరము గల ♦ వాని చిత్త
మందు నశియించుఁ; గావున ♦ ననఁగవచ్చుఁ
గాదె యాడంబరంబును ♦ బూది యంచు. 359

ఆ.వె. బ్రహ్మ మేనె యనియొ, ♦ బ్రహ్మమయంబు స
249 ర్వప్రపంచ మనియొ, ♦ బ్రహ్మమునకు
నేను లేక ననియొ, ♦ యీమాఁట దేనిచే
నైన నరుఁడు ముక్తి ♦ నందవచ్చు. 360

తే.గీ. వేశ్య యొక్కతె క్షీరము ♦ ల్పిదికి తెచ్చి
250 యొక్క సన్యాసి కొసఁగుచు ♦ నుండె; నొక్క
నాఁడు వేళకు రామి, నా ♦ నాతి నందు
నకుఁ గతం బేమి యనుచు స ♦ న్యాసి యడిగె. 361

తే.గీ. వేకువనె లేచి పాలను ♦ బిదికి వానిఁ
దెచ్చుచుంటిని, గాని యీ ♦ తెరువు నడుమఁ
బాఱు నేటిని దాఁటించు ♦ వాఁడు త్వరగ
నగపడమి, నింత తడవయెఁ ♦ ననెను వేశ్య. 362

తే.గీ. జన్మసాగరమును నిమే♦షంబులోన
నరుని దాఁటించెడు భగవ♦న్నామముండఁ,
నేఱు దాఁటఁగలే నందు ♦ వేల చేల?
యంచు సన్న్యాసి నుడివె నా♦యతివతోడ. 363

తే.గీ. నాతి యామాట విని మఱు♦నాఁటి నుండి
వేళకే పాలు దెచ్చి య♦ర్పించుచుండ,
"బోటి! తడయక యేటిని ♦ దాఁటి యిప్పు
డెట్లు రాఁజాలితి?" వని యోగి ♦ పృచ్ఛసేసె. 364

కం. తమ రుపదేశించిన నా
మము నుచ్చారణముసేసి, ♦ మునలక వాఃపూ
రము దాఁటి వచ్చుచుంటిని,
దమబోంట్లు గలారె యొరులు ♦ ధారిణిలోనన్? 365

కం. అని పల్కిన, చేడియతో,
మనమున వెఱఁగంది, యోగి ♦ "మానిని! నీతోఁ
గొని నన్ను నేఱిఁ దాఁటం
గను జేసెదె?" యనిన, నట్ల ♦ గావింతు ననెన్. 366

మ. అని సన్న్యాసిని జేయిపట్టుకొని, యా♦యంభఃప్రవాహంబునన్
జనుచు, న్వెనుకకుఁ జూచి, యోగి తనకా♦షాయాంబరంబు న్గరం
బునఁ గొంటం గని, వేగిత "యేలతడియు♦న్బట్టంబు యోగీంద్ర! యే
టిని దాఁటించెడు నామమే వలువ రా♦ఢి న్గాచులే" యంచనెన్.

తే.గీ. తాననెడు మాట మదిలోనఁ ♦ బూనకుండఁ,
బూర్ణకర్తృత్వమును దైవ♦మునసె పెట్టు
సిద్ధుఁ, డే కార్యమైనను ♦ జేయఁగల్గు
ననుట, కీగొల్లచేడె దృ♦ష్టాంత మయ్యె. 363

సీ. అనుదినం బొకఁడు కు♦క్కను బెంచి ముద్దాడు
251 చుండుట జ్ఞాని యొ♦క్కండు సూచి,
కుక్కను దాఁకుట ♦ కూడదు, గావున
దరిఁజేర్పకుము యింక ♦ దాని, ననినఁ
గసరి దానిని గొట్టెఁ, ♦ గాని యాశునకంబు
మునుపటి యలవాటు ♦ నను, భయంబు
పడకుండఁ, గొన్నాళ్ళ♦వఱకుఁ జెంతకు వచ్చి,
తుదకుఁ దా రాకుండఁ ♦ దొలఁగిపోయె.
తే.గీ. మనసు జన్మపరంపర♦ననుభవించు,
విషయసుఖముల నొకసారి ♦ విడువలేదు
జ్ఞానబోధంబుమాత్రానఁ, ♦ గాని యవ్వి
సాధనంబునఁ గ్రమముగా ♦ సడలిపోవు. 369
ఉ. ఎండిన యగ్గిపుల్ల నొక♦యించుక రాసిన మండుఁ, జెమ్మగా
252 నుండినదాని రాచినఁ బ్రి♦యోజన ముండదు, నిర్మలుండు తు
ష్టుండయి సోలు దైవపరి♦శుద్ధవచశ్శ్రవణంబుచేత, దు
ష్టుండయి భోగసక్తుఁ డగు♦చోఁ గరఁగింపదు భక్తి చిత్తముల్.
ఆ.వె. సంసృతిని దరించి ♦ సచ్చిదానందంబుఁ
253 బడయుటకును, జ్ఞాన♦భక్తులందు
భక్తియోగము సుల♦భం బైన మార్గంబు,
దానివలన ముక్తి♦త్వరగ దొరకు. 371
తే.గీ. గొప్ప వర్తకునింటను ♦ గుప్పలుగను
254 వడ్లు నిలువగనుండెడు ♦ పగిది, వాస్త
వం బయిన భక్తిగల్గు చి♦త్తంబునందు,
నెడతెగక భక్తిరస ముద♦యించుఁ గాదె! 372

తే.గీ. అతివ లందఱు భగవతి ♦ యంశమున నె
255 జన్మ మొందినవా రను ♦ సత్య మెఱిఁగి,
భక్తుఁడై మోక్షమును గోరు ♦ వాఁడు, వారి
మాతృసదృశలుగా గణిం♦పంగవలయు. 373

తే.గీ. హృదయమున, నోటఁ, జేత, స♦ర్వేశ్వరునకు
256 భక్తుఁ డొనరించి పూజలఁ, ♦ బడయునట్టి
పుష్టసాయుజ్యసౌఖ్యంబు, ♦ వోలు సాధ్వి
యా పతివ్రత మగనితో ♦ నందు సుఖము. 374

తే.గీ. మానసము వాక్కుఁ గాయంబు ♦ మంచి స్థితికిఁ
257 దెచ్చి, నిర్మలముగఁ జేయు ♦ దివ్యబోధ
మొక్కటియె జ్ఞాన మన నొప్పు; ♦ నొండుజ్ఞాన
మంతయును గూడ నజ్ఞాన ♦ మనఁగవలయు. 375

తే.గీ. భక్తివిశ్వాసములను సే♦వకుఁ డొకండు
258 గృహముఁ గన్నుపెట్టుకొని యుండ, ♦ గేస్తు వాని
గౌరవముసేసి, సేవకు♦గాఁ దలంప
క, తనతోఁ దుల్యునిగఁ జూచు ♦ కరణిగానె, 376

తే.గీ. ఎవఁడు త్రికరణశుద్ధిగా ♦ నెసఁగిభక్తిఁ,
బూర్ణముగ నహంభావంబుఁ♦బొలియఁజేసి,
యుండు, వానిని దనతో స♦ముండుగానె
చూచి స్వోన్నతపదవి నీ♦శుండొసంగు. 377

తే.గీ. ప్రతిదినంబును దామ్రపా♦త్రంబు శుద్ధి
259 పఱుపకుండిన మలినమౌ♦వగిది, ననుది
నంబు ధ్యానంబు సేయని ♦ నరునిమనము,
కాంతిదఱుఁగుచుఁ బెంపేది ♦ కసటువాఱు. 378

తే.గీ. కాని యాపాత్రి కాంచన♦కలితమైనఁ,
దొలఁచ నక్కఱలే, దట్లె ♦ లలితభక్తి
నీవు నొకసారి దర్శించె♦నేని, నరుఁడు
సెడఁ డొకించుక ధ్యానవి♦చ్ఛిత్తిచేత. 379

తే.గీ. భర్తపై వాస్తవం బగు ♦ భక్తిగల్గి
260 భార్య యున్నను, గృహములో♦పల మెలంగు
నత్తమామలపైఁ గూడ ♦ నగపఱచును
భక్తివిశ్వాస గరిమ, నీ♦వగిదిగానె, 380

ఆ.వె. పురుషుఁడిష్టదైవ♦మును త్రికరణశుద్ధిఁ
బూజసేయుచుండి, ♦ పుడమిలోను
వెలయు నితరదైవ♦ములఁ గూడఁ దా గౌర
వంబు సేయుచుండ♦వలయుఁ జుమ్ము. 381

ద్వి. "పాము నా యాత్మ, కు♦ప్పసము నా దేహ"
261 మీమాడ్కి మానవా!♦యెంచుకొ మ్మెపుడు. 382

ఆ.వె. నిప్పుపైని పాలు ♦ నెలకొని, పొంగుచుఁ,
262 జివర కవ్వి శాంతిఁ ♦ జెందుకరణి,
భక్తిగరిమఁ బొంగి, ♦ భక్తుని మానసం,
బడఁగు శాంతి నీవుఁ ♦ డగపడఁగనె. 383

తే.గీ. వివిధవిగ్రహములను వా ♦ విరిని గుంభ
263 కారకుఁడు, పచ్చిమృత్తునఁ ♦ గాని, యగ్ని
దగ్ధమృత్తునఁ జేయఁగా ♦ దక్షుఁ డగునె?
జ్ఞానమందునఁగూడ నీ♦సరణిగానె, 384

తే.గీ. ఆశ లంటని లేఁతపా♦యంబులోన
నున్న మనసున విజ్ఞాన ♦ మొత్తవచ్చుఁ,

గాని యాశామలీమస ♦ కర్కశాశ
యంబునను జ్ఞాన మెుత్త శ♦క్య మెటులగును? 385

ద్వి. తనపైనిభక్తిని ♦ దాల్చు నాతనికిఁ
264 గనఁబడకుండఁడు ♦ గాదె యీశ్వరుఁడు! 386

ద్వి, భగవంతు నే నమ్ము ♦ భక్తవర్యునకు,
265 నెగిరిపోవును గదా! ♦ యెట్టి యాపదలు! 387

తే గీ. బాలకుఁడు గంబ మూఁతగాఁ ♦ బట్టుకొనుచు
266 నెంత వడిగను దిరిగిన ♦ నిలను బడఁడు;
దైవభక్తియు విశ్వాస ♦ భావ ముండు
పురుషుఁ డైహికసంపర్క ♦ మునను జెడఁడు. 388

ఉ. మారుతి యొక్క గంతున స ♦ మాహితచిత్తమున న్పయోనిధిన్
267 గేరుచు దాఁటి లంక కరి ♦ గెన్; రఘురాముని యంతవానికిన్
వారిధిఁ గట్టగా వలసి ♦ వచ్చెను లంకకు నేగ; భక్తులౌ
వారి కసాధ్య మౌనె యెటు ♦ వంటి మహత్తరమైన కార్యమున్?

సీ. వరద వచ్చిన యేఱు ♦ నరుఁ డొకం డొకనాఁడు
268 దాఁటు టెట్లో యని ♦ తలఁచు చుండ,
నొకమహాత్ముఁడు వాని ♦ యొద్దకు నేతెంచి,
చిన్న కాగిత మొుండు ♦ చేతి కిచ్చి,
గుప్తంబుగా నుంచు ♦ కొని దీని, నది దాఁటు,
మని చెప్ప, నామాడ్కి ♦ నతఁడు సేసె;
నైన నాయేటిమ ♦ ధ్యంబున నుండఁగాఁ
గాగితమును జూడఁ ♦ గాంక్ష పుట్టి,
తే.గీ, వెంటనే కాగితంబును ♦ విప్పి చూచి,
దైవనామంబు లిఖితమై ♦ దానినుంట

గాంచి, చులుకనగా దాని ♦ నెంచఁగానె,
బుటుకు మని యతఁ డేటిలో ♦ మునిఁగి చచ్చెఁ 390

ద్వి. పరమైన భక్తి, వి ♦ శ్వాసంబు, రెండుఁ
బురుషుల నిలలోనఁ ♦ బ్రోచుచు నుండు. 391

తే.గీ. వ్రీడ రోఁతయు నీసును ♦ వెఱపు, వీని
269 చేతఁ గసటువాఱిన చిత్త ♦ సీమ గల్గు
మానవుం, డెంత చేసినఁ ♦ గాని, యీశుఁ
గాంచలేఁ డంచు రూఢిగా ♦ నెంచవలయు. 392

ఉ. కాంతయుఁ గాంచనం బనెడు ♦ కల్మష తైలము సోఁకి నీదు చి
270 త్తాంతరపత్రమం దెనఁడు ♦ ధ్యా లిపిన్లిఖియింపకుండ న
భ్యంతర మా; విరాగతను ♦ బైని సుధంబలె రాసు, సద్ది పా
పాంతము సేసి ధ్యానమున ♦ కర్హాతఁ దెచ్చుచు జిత్తసీమకున్. 393

ద్వి. స్త్రీకాంక్ష ధనకాంక్షఁ ♦ జెందక, యీశ్వ
271 రాకారమును జూడ ♦ నైతి గాదయ్య! 394

ద్వి. సత్యస్వరూపుఁడా ♦ సర్వేశ్వరుండు
272 సత్యశీలురకెతా ♦ సాక్షాత్కరించు. 395

మ. డగరంబు ల్గలిగించు నేది యరివ ♦ స్వర్గంబు లోకోపభో
273 గగతి న్దానిని బోవనీయ, నపయు ♦ క్తం బాచుమే ల్సేసెదున్
భగవత్కార్యములందుఁ జొన్ప, నదగా ♦ న, న్గామలోభాదులన్
దెగటార్పం బనిలేను, మిత్రులగు స్వా ♦ ధీనంబులై యుండినన్.

తే.గీ. యత్నమూలంబుననొ, యపరి ♦ యత్నముననొ,
274 యమృతకూపంబునం బడు ♦ నాతఁ, డమర
ధర్మమును బొందునట్టులు, ♦ దైవనామ
మెట్లు పల్కినఁ గైవల్య ♦ మొనయు నరుఁడు. 39

## గురుశిష్యవిషయము.

ఆ.వె. భూమనౌక, కూడఁ ♦ దోడ్కొని పడవలఁ,
275 గడలి దాఁటఁజేయు ♦ కరణి, భవజ
లధిఁ దరింపఁ జేయు ♦ లలితోక్తులను, మతా
చార్యుఁ, డజ్ఞులైన♦జనుల నెపుడు. 398

తే.గీ. జలధి యుప్పొంగ నదులుఁ గు♦ల్యలు సరస్సు
276 లవనియంతయు జలపూర్ణ ♦ మౌను; గాని
వర్షవాఃపూరమున జల♦భరితము లగు
నీటిపట్టులు మాత్ర; మీ♦సాటి గావె. 399

తే.గీ. పరులకుం దోడుపడు మత♦గురులవలన,
నంద అపవర్గసౌఖ్యము ♦ లొప్పొందఁగలరు;
కాని సాధువు ప్రజ్ఞాన♦గరిమచేతఁ
దాను మాత్రమె తరియింప ♦ దక్షుఁ డగును. 400

తే.గీ. విఱిగి నదిఁ గొట్టుకొనిపోవు ♦ పెద్ద మ్రాఁకు,
277 పెక్కుప్రాణులఁ గాపాడ ♦ వీలుపడును;
గాని చిఱుగఱ్ఱ యూఁకతోఁ ♦ గాక, తాను
మాత్రమే మున్గకుండు; నీ♦మ్మాడ్కి నిలను, 401

తే.గీ. మోక్షదాయకుఁ డగు మహా♦పురుషవర్యుఁ
డందఱఁ దరింపఁ జేసెడు; ♦ నట్లు గాని
సంయములు వారుమాత్రమే ♦ సద్గతులను
బడసి, యితరుల కుపయోగ♦పడఁగలేరు. 402

తే.గీ. సుకరముగఁ బెక్కుబండ్లఁ దీ♦సికొని, భూమ
278 శకట మదిపోవుచోటికిఁ ♦ జనెడుపగిదిఁ,
బెక్కు రల్పులఁ దన వెంటఁ ♦ బెట్టుకొనుచుఁ,
బరమపదసిద్ధిఁ గను మహా♦పురుషుఁ డిలను. 403

తే.గీ. ఐంద్రజాలికు మహిమంబు ♦ లతని వారు
79 గాంచలే, కితరులు గాంచు ♦ కరణి, మతగు
రువు స్వదేశంబునందు గౌ ♦ రవముఁ బొంద,
కన్యదేశస్థులకు గౌర ♦ వార్హుఁ డగును. 404

చ. ఇలపయి మఱ్ఱిబీజములు ♦ వృక్షపుమూలమునందు రాలినన్
280 మొలవక, గాలిచేతఁ గొని ♦ పోఁబడి దవ్వగుపట్ల, కయ్యెడన్
మొలచెడిరీతి, దేశికుని ♦ బోధము స్వస్థలమందు లాభమున్
గొలుపక, యన్యదేశజన ♦ కోటికి మోక్షఫలం బొసంగెడున్. 405

తే.గీ. పఱచుచును జుట్టు దీప్తి దీ ♦ పంబు, దాని
281 క్రిందఁ గ్రిసీడఁ గావిలచు ♦ రీతి, జ్ఞాని
జ్ఞానసందీప్తి గనరాక ♦ స్వజనతతికిఁ,
గానిపించును దూరస్థ ♦ మానవులకు. 406

ఆ.వె. దారి తెలియునట్టి ♦ తగువాని నొక్కని
282 మార్గమడుగ వోతకు ♦ మంచిత్రోవ;
యట్లు గాక, పోవు ♦ నందఱ నడుగఁ జి
త్తంబు సందియంబుఁ ♦ దవిలి చెడును. 407

తే.గీ. ఇట్లె సద్గురు నొక్కని ♦ నెంచి, యాతఁ
డగపఱచు త్రోవలను బట్టి ♦ యరుగవలయుఁ;
బాత్రికా నేకగురుపర ♦ స్పరవిరుద్ధ
బోధముల, నీశ్వరైక్యంబుఁ ♦ బొందలేము. 408

తే.గీ. త్రికరణస్థిరశుద్ధభ ♦ క్తిని వెలంగు
283 మనుజవరునకు గురునితోఁ ♦ బనియె లేదు,
కాని దుర్లభ మట్టి ని ♦ ష్కలుషభక్తి;
గురుఁ డొకం డుండవలె ముము ♦ క్షులకుఁ గాన. 409

ఆ.వె. ఎట్టి స్వల్పమర్మ ♦ మేనియు నుపదేశ
మొందఁజేయు నాతఁ ♦ డుపగురుండు;
ముఖ్యగురువు సిద్ధ ♦ పురుషుల కొకఁడైన,
నుపగురువు లనేకు ♦ లుండవచ్చు. 410
ద్వి. ఇరువదిపై సల్వు ♦ రిట్టిదేశికులె
నరులార! చైతన్యు ♦ నకుఁ గూడఁ గలరు. 414
తే.గీ. కల్లుపాకల కేగినఁ, ♦ గాపురుషుల
284 కాటపట్టైన తావుల ♦ కరిగినను, గు
రుండు పరమపవిత్రస్వ ♦ రూపుఁ డనెడు
వంగభాషోదితశ్రేష్ఠ ♦ వాక్య మరసి, 412
క. గురునకుఁ గల దోషంబులఁ
బరికింపక, శిష్యుఁ డమల ♦ భక్తి నతనికిఁ
బరిచర్య సేసి, యాతఁడు
గఱపిన మార్గమునఁ బోవఁ ♦ గాఁ జను నెపుడున్. 413
తే.గీ. మంత్ర ముపదేశమును జేయు, ♦ మనుజమాత్రుఁ
285 డైన సామాన్యగురుఁ; డట్లు ♦ గాక, యుత్త
మగురుఁ డీశ్వరరూపంబు ♦ మదిని నాటి,
చిటికలో మోక్ష మొసఁగును ♦ శిష్యతతికి. 414
ఆ.వె. నీతి సెప్పువారు ♦ నీతిమార్గము నంటి
236 సంచరింప, రనెడు ♦ సత్యవాక్య
మొరుల కెఱుఁగఁ జేయు ♦ గురువు లనేకులం;
గాని శిష్యుఁ డొక్కఁ ♦ డైన లేఁడు. 415
ఆ.వె. హితము సెప్పువార ♦ లెందఱో గల, రైనఁ
జెప్పు హితముఁ జెవిని ♦ జేర్చి, యుక్త

పథము నంటి పోవు ♦ వారలు, సాధార
ణముగఁ గానరారు ♦ నరులలోన. 416

సీ. దివ్యతేజంబునఁ ♦ దేజరిల్లెడు వేద
287 పేటిక కిక్కయై, ♦ విమలనీల
వర్ణమౌ, వినువీథి ♦ వదలక, కంక, మ
నన్యాలభ్యోన్నతం ♦ బైన పదవి
సంచరించుచు నున్న, ♦ సర్వకాలములందు
భోజనాపేక్షచేఁ ♦ బొలసు కొఱకు
నుర్వి పరిక్కనె చూచు ♦ చుండెడు రీతిఁ, బ్రా
పంచికవ్యాపార ♦ పటలిఁ జిక్కి
తే.గీ. నట్టి విద్వాంసుఁ, డెన్ని శా ♦ స్త్రాదు లభ్య
సించి జ్ఞానంబుఁ బ్రజకుబో ♦ ధించుచున్నఁ,
జిత్త మాశాస్పదం బాట ♦ చేత, నైహి
కసుఖలోలుండె యై యుండుఁ ♦ గాదె యెపుడు! 417

తే.గీ. సచ్చిదాత్మాను భవహీన ♦ శాస్త్రపఠన
288 ముననె పరమాత్మతత్వంబు ♦ బోధపఱచు,
టల్ల కాశిని బటమందు ♦ నరసి, దాని
నన్యులకు నెఱిఁగించిన ♦ యట్లె సుండి! 418

తే.గీ. కంఠమునఁ బాట పాడ సు ♦ కరము గాని,
289 చాలఁ గష్టంబు వీణపై ♦ స్వరముఁ గూర్ప;
నోటఁ దత్వార్థములఁ గూర్చి ♦ మాట లాడ
సులభమౌఁ గాని, యటు సేయ ♦ సులభ మౌనె? 419

క. పరులధనంబును వెచ్చము
290 పఱచెడు వానివలె, నొరుల ♦ భావంబుల సి

గ్గిటి కైకొని వాగ్ఘాటిం
గఁజపును మతబోధశాలి, ♦ కడమజనులకున్. 420

ద్వి. ఒరులకు బోధించు ♦ నొకత్రోవ నైనఁ
జరియింపఁగా వారు ♦ చాలరు గారె! 421

క. కఱకు శిలల సలిలంబును
291 గరఁచని చందమున, బద్ధ ♦ కఠినాత్మల సం
సరణార్తి పరంపరలం
బొరివుచ్చఁగలేదు జ్ఞాన ♦ బోధం బయినన్. 422

ఉ. కీలము నేలలో దిగుచుఁ, ♦ గేవలశైలతటంబులోనికిన్
292 జాలదు పోవ; నీపగిది ♦ జ్ఞానులు సేసెడు బోధనంబు పు
ణ్యాళి సదంతరంగముల ♦ యందున నాటుకొనంగఁ గల్గి, పా
పాలకుఁ బుట్టినిల్లయిన ♦ వాని మనంబున నాటుకోదుగా! 423

క. మెత్తని మృత్తిక రూపము
293 లొత్తుకొనుం, గాని శిలల ♦ నొత్తికొనఁగలే;
వుత్తమబోధము భక్తుని
చిత్తమునం దంటుఁ; బాపి ♦ చిత్తము వీడున్. 424

తే.గీ. గట్టిచర్మంబు మైఁ దాల్చి ♦ సట్టి మకర
294 ములను బాఁకునఁ బొడువఁగా ♦ వలను పడని
కరణి, నైహికలోలుఁడౌ ♦ మొఱకు మనసుఁ
గలితబోధనములచేతఁ ♦ గరఁచలేము. 425

చ. బిఱుసుగ నెత్తి నుండు మెలి♦ వెండుక నెంతగఁ దిన్నఁజేసినం
295 గఱకుగ నుండు రీతి, నిహ♦ కాంక్షలఁ జిక్కెడు వాని కెంతగాఁ
గఱపిన నీతివాక్యములు, ♦ జ్ఞానము నొందక వాఁడు నీచుఁడై,
మరగుచుఁ బాపవృత్తి, ఋజు ♦ మార్గము నంటి చరింపలేఁడుగా!

ఉ. వంతెన క్రింద నీర మొక ♦ వంకను జొచ్చుచు, దానిక్రిందినా
296 వంతయు నిల్వ, కన్వలికి ♦ నంతయుఁ బాఱెడు రీతి, మంచి వే
దాంతవచస్సు నీచు చెవు♦లందున నొక్కటిఁ బట్టి తూఱి, యొ
క్కింతయు నిల్వకుండఁ బరు♦వెత్తును రెండవ వీనుత్రోవనే. 427

తే.గీ. ఒక్కనికి నిర్వురకు మాత్ర ♦ ముంచుకొన్న
297 వస్తువుల నూర్వురకుఁ బెట్టి ♦ వచ్చుగేస్తు
సరణి, నల్పజ్ఞుఁడౌ మతా ♦ చార్యుఁ డేచి
యందఱకు బోధనములఁ జే ♦ యంగఁ గడఁగు. 428

సీ. ఒరులకు జ్ఞానంబు ♦ నుపదేశ మొనరించు
298 కంటెఁ, దాఁ దరియింపఁ ♦ గడఁగి, యీశ్వ
రధ్యానమున నుండి, ♦ ప్రాజ్ఞుఁడై యుండుట
సేమం బటంచు రా ♦ జింపవలయు.
ముక్తకర్ముం డౌచుఁ ♦ బూర్ణజ్ఞుఁ డైన స
న్న్యాసి యొక్కఁడె గురుం ♦ డౌట కర్హుఁ;
ఉత్ఫుల్లపంకజం ♦ బుండుచోటికి నాల్గు
ప్రక్కలనుండియు ♦ భ్రమరసమితి
ఆ.వె. మొగుదెంచు పోల్కి, ♦ ఋజుమార్గవర్తియై
జ్ఞానచిత్తుఁ డైన ♦ వాని కడకు,
వెదకుకొనుచు శిష్య ♦ వితతి తమ్మనకుండ
వచ్చుఁ దీవ్రమోక్ష ♦ వాంఛఁ జేసి. 429

చ. శవములు రుద్రభూమిఁ దను♦ చాలన మేమియు లేక యుండ, న
299 య్యవి చవిచూడఁ బిల్వకయె♦యర్పుదముల్పనుఁగాక గృధ్రముల్
ప్రవిమలచిత్తులౌ గురుల ♦ పజ్జకు శిష్యులు మోక్షకాంక్షలం
దవులుచు నేగుదెంతు రమి ♦ తంబులుగాఁ బసిపట్టి యాగతిన్.

ఉ. దీపముకాంతిఁగాంచి పలు ♦ దిక్కులనుండియు వచ్చి పుర్వులా
300 దీపము నావరించుకొను ♦ తీరున, నెచ్చట నున్న, జ్ఞానసం
దీపితచిత్తుఁ డగు ♦ దేశికు చెంతకు నేగుదెంచు, న
ల్వైపులనుండి శిష్యతతి; ♦ వారలకై గురుఁ డేగఁడెన్నఁడున్. 431

తే.గీ. శర్కరకడకుఁ జీమలు ♦ సనెడు పగిదిఁ,
301 బూజ్యవర్తనుఁ డైనట్టి ♦ పురుషు చెంతఁ
జేరుదురు తమంతటఁ దామె ♦ శిష్యు; లందు
వలన నచ్చెలుఁడై యుండ ♦ వలయు గురుఁడు. 432

సీ. జలధిమధ్యంబునఁ ♦ జనెడు నావను గల్గు
302 తెరచాఁపకొయ్యచి ♦వరను విడిచి,
మఱియొకచో వ్రాలి ♦ మనసుపుట్టఁగఁ జుట్టఁ
దిరుగుచు, నొండొక ♦ యిరవు లేమి,
మఱల నెప్పటిచోటి ♦ కరుగుదెంచెడి విహా
గంబు పోలికనె, దై ♦ వంబుకృపను
దొరకిన గురువరుఁ ♦ దొఱఁగిన శిష్యుండు,
గాంచఁగలే కంత ♦ కంటె నొరునిఁ,

ఆ.వె. బ్రథమగురువుకడకె, ♦ క్రమ్మఱ, విసిగి, తా
వెనుక నుండు భక్తి ♦ కినుమడిగను
గల్గు భక్తితోడఁ, ♦ గరములు ముకుళించి,
వచ్చి, శ్రమముఁ బాసి, ♦ బ్రదుకుఁ గాదె! 433

తే.గీ. బాలురందు, గృహస్థులా ♦ వారియందు,
303 శిష్యుఁ డగుటకు బాలుఁడే ♦ శ్రేష్ఠుఁ డయ్య;
యుదయమునఁ జేయు నవనీత ♦ ముత్తమంబు
వెనుక మధ్యాహ్నమునఁ జేయు ♦ వెన్నకంటె. 434

ఆ.వె. గురువు దైవ మంచు ♦ నరయక, సాధార
94 ణనరుఁ డంచు నెంచు ♦ మనుజుఁ, డెపుడు
మోక్ష మించు కైనఁ ♦ బొరయఁ డుసఁ, గావున
దైవ మాతఁ డంచుఁ ♦ దలఁచవలయు. 435

తే.గీ. ముందు దేశిక దైవ మ ♦ న్నబ్ధిఁ దోడఁ
జూచుచుండిన, నాతండు ♦ సూపు దేవు;
నపుడు శిష్యుండు విస్మయం ♦ బంది, తాను
గాంచు దైవంబు గురువు నొ ♦ క్కండె యంచు. 436

ఉ. చక్కని మందిరం బొకటి ♦ సాంద్రసుమాఘవనప్రయుక్తమై,
305 యొక్క నశక్యమైన యొక ♦ యెత్తగు కుడ్యము చుట్టుఁగల్గి, పెం
పెక్కుచు నుండ, నల్వు రది♦యెక్కి, తదంతరగుప్తవస్తు వే
మొకొ్క! యటంచుఁ జూచి, వెఱ♦గొందిరి దానివిచిత్రశోభకున్.

ఆ.వె. అందు ముఖ్యు రంత ♦ రంగోద్భవానంద
భారమునను దాము ♦ పరవశులయి,
వెనుకటి స్మృతిఁ దొలఁగి, ♦ వెన్వెంట దానిలో
నుఱికి; రింక మిగిలి ♦ యుండు వాఁడు, 438

తే.గీ. గోడపై నుండియే, లోని ♦ మేడ సొగసుఁ,
గుసుమవాటిక సొగసు, నా ♦ రసి, యపూర్వ
చిత్రసందర్శనానంద ♦ సింధుమగ్నుఁ
డయ్యుఁ, గ్రిమ్మఱ నే తెంచె ♦ నందునుండి. 439

క. ఈరీతిని పరమాత్ముని
నారసి, బహువుపమలు, ల ♦ హంభావంబుల్
దోరిచి, వానిం గలసెడి
వారే సుంకి మోదవివశ ♦ వర్తను లగుచున్! 440

క. అరిసు నుపకారపరులౌ
కొందఱు మాత్రంబె, యొరుల • కొఱకై యైక్యం
బందక, వారికి ముక్తిం
జెందెడు మార్గంబుఁ దెలియఁ • జేయుదు రవనిన్. 441

తే.గీ. సచ్చిదానందభూరుహ • శాఖలందు
306 బుద్ధుఁడును గ్రీస్తు మొదలగు • పురుషు లంటి
యుండి, యపుడప్పు డవతార • మొంది, జనుల
కొప్పు నపవర్గమార్గంబుఁ • జెప్పుచుంద్రు. 442

తే.గీ. పానకపుఁ బాత్రిలోపలఁ • బడుచుఁ గొన్ని
307 యీఁగలు యథేచ్ఛముగఁ ద్రావి • యీల్గుఁ, గొన్ని
యంచు లంటుచు వలసెడు • నంతవఱకుఁ
ద్రావి, క్రమ్మఱ స్వేచ్ఛగాఁ • బోవు నెగిరి. 443

ఆ.వె. "ఇట్టి యమృతకలశ • మే యన నొప్పును
సచ్చిదాత్మ, దానిఁ • జవిగొనంగ
నెట్టు లిచ్ఛగింతు • వెఱిఁగింపుమా!" యని
తూర్చుశిష్యుతోడ • గురుఁడు వలికె. 444

ఆ.వె. "పాత్ర మాశ్రయించి, • వాంఛ దీఱెడుదాఁకఁ
ద్రావి, పిదప నెగిరి • పోవు నీఁగ
పోల్కి నుండుఁ, గాని • మున్గుచు నీల్గెడు
మక్షికవలె నేను • మడియ తేను". 445

క. అని శిష్యుఁడు వల్కనఁ, దా
విని గురుఁ "డమృతంబుఁ గ్రోల, • వెఱ్ఱివిగా, కై
ల్గెనయుము మరణం!" బని, తో
డనె జ్ఞానముఁ గఱపి, తమ మ • డంచె నతనికిన్. 446

తే.గీ. ప్రజలు గలఁత నొందిన, మహా ♦ రాజు దాని
308 నడఁపఁ దనదు ప్రతినిధుల ♦ నంపుకరణి,
ధర్మసంస్థాపనంబుకై ♦ దైవ మప్పు
డప్పు, డవతారపురుషుల ♦ నంపు నిలకు. 447

తే.గీ. తులువ యెన్నియొ నీతులఁ ♦ బలుకుఁ గాని,
309 యొక్కటియుఁ జేసి చూపఁడు; ♦ యోగ్యుఁ డైన
వాఁడు నోటను నీతులఁ ♦ బలుక, కాత్మ
వర్తనంబునఁ గఱపును ♦ వానిఁ బ్రజకు. 448

తే.గీ. గొప్ప రాజును జూడఁగఁ ♦ గోరు వాఁడు
310 వాని యాస్థానమున నున్న ♦ వారిఁ దొలుత
నాశ్రయించుచుఁ దదనుగ్ర ♦ హంబుఁ బడయు
నట్టు లావశ్యకం బగు, ♦ నట్టుగానె, 449

ఆ.వె. ఈశు దర్శనంబు ♦ నెనయంగఁ, దొలుతను
యోగసాధనముల ♦ నూని చేసి,
గొప్పయత్నములను ♦ గురువుల సేవింప
వలయుఁ గాదె యెట్టి ♦ భక్తుఁడైన! 450

తే.గీ. శిష్యునాత్మనుఁ బరమాత్మ ♦ జేర్చి యొక్క-
311 టిగను జేసెడు సామర్థ్య ♦ మగపఱచెడి
గొప్పసంధానకర్త యా ♦ గురుఁ, డటంచు
నెప్పుడును మానవుం డెద ♦ నెంచవలయు. 451

క. గురువులలో దోషంబుల
312. నరయుట వృథ సుమ్ము, వారి ♦ యమలోక్తులనే
శిరసావహించి వినుచును,
బరచింతలనెల్ల నీవు ♦ వదలఁగవలయున్. 452

ద్వి॰ ముత్తెపుఁజిప్పలో ♦ ముత్తెము ల్గానుచు,
నుత్త చిప్పల నౌల ♦ నుంచుటలేదె? 453

తే.గీ. అన్ని రంగులు వేయుట ♦ కనువు పడెడు
313 వెల్లబట్టను బోలెడు ♦ విమలబాల
హృదయమును దిద్దవచ్చు, నై ♦ హికకలంక
వృద్ధచిత్తాంబర మటు గా ♦ వింపనగునె? 454

## ౹౹ మ త వి ష య ము. ౹౹

శా. న్యూనోరుద్యుతిసంయుతంబు లగు వి♦ద్యుద్దీపము, ల్యాలయం
314 త్రానీతచ్ఛవుల న్దమంబడఁచు చా♦య, న్సచ్చిదాత్మప్రభూ
తానేకాచ్ఛమతంబు లన్నియును, భి♦న్నామ్నాయసందీప్తి, న
జ్ఞానధ్వాంతవిపాటకంబులయి, మో♦క్షం బిచ్చు భక్తాళికిన్. 455

తే.గీ. తాళ్లు, నిశ్రేణి, మెట్లు, సౌ ♦ ధంబుచివర
315 కరుగుటకు సాధనంబులౌ ♦ నట్లె, యీశు
సన్నిధిని జేరుటకుఁ బర ♦ స్పరవిరుద్ధ
మతము లన్నియు బహువిధ ♦ మార్గము లగు. 456

చ. స్వమతము నంటి పట్టుకొను ♦ వారలు, లాఁతిమతంబువారికిన్
316 సమతను నట్టిస్వేచ్ఛనె యొ ♦ సంగుట మంచిది చర్చమాని, వా
దము నసిగాదు, దా మొరులఁ ♦ దప్పని యొప్పఁగఁ జేయలేరు, దై
వము కృపసూపునాఁడు కన ♦ వచ్చు నెవండును వానితప్పులన్.

తే.గీ. "నిత్యమై సర్వసుఖముల ♦ నిలయమైన
317 యల్ల యానందకంద మె ♦ ట్లందవచ్చు?"
ననుచుఁ బార్వతి యడుగఁగ ♦ "వినుము శ్రద్ధ
యొండె సాధన" మంచు భ ♦ వుండు వల్కె. 458

తే.గీ. హిందువులలోన మతము లె ♦ న్నేని గలవు,
వానిలో నెద్ది గైకొన ♦ వలయు? ననక,

యవ్వి యెట్లున్న నీకేమి? ♦ యంటి నీదు
మతవిధుల శ్రద్ధతోఁ జల్పు ♦ మానకుండ, 459

సీ. నూయి త్రవ్వఁగ నెంచి, ♦ గోయి యొక్కెడఁ ద్రవ్వి,
318 యించుకేనియు నీరు ♦ గాంచ కొకఁడు,
మఱియొకచోటను ♦ మఱియింత లోఁతుగాఁ
ద్రవ్వి, యచ్చటనీరు ♦ రామి విడిచి,
మూఁడవచోటను ♦ మునుపటికంటెను
లోఁతుగాఁ దీసి, యా ♦ గోతఁగూడ
జలము పడమి నిరు ♦ త్సాహుఁడై, కృషిమాని,
యరిగె నంతయు వృథా ♦ యాస మనుచుఁ;
ఆ.వె. బావ! మతఁడు మూఁడు ♦ పట్లను ద్రవ్విన
లోఁతునందు సగము ♦ లోఁతువఱకు
నొక్క నూయి త్రవ్వ ♦ యుండినఁ, దనకుఁ గా
వలసినంత నీరు ♦ వచ్చుఁగాదె! 460

తే.గీ. మతము గా దని మఱి యొక ♦ మతముఁ బూని,
కొంచెము చదివి, యన్ని వ ♦ ర్జించుకంటె,
నేదియో యొక్కటియె యంటి ♦ కృషిని జేయు,
మంచి గల్గును, ముక్తి ప్రా ♦ ప్తించుఁ దుదకు. 461

ఉ. వానను వచ్చు నీళ్లు గడు ♦ స్వచ్ఛము లయ్యు, గృహోపకంఠభా
319 గానుగతి న్మలీమసము ♦ లై చెడు దుష్టపదార్థయుక్తిఁ; బ్ర
జ్ఞానసుబోధకంబు లగు ♦ సర్వమతంబులు నిర్మలంబులే,
కాని మతస్థదేశికుల ♦ కల్మషవృత్తుల దోష మందెడుఁ. 462

తే.గీ. ఎవరి మతమును వా రను ♦ ష్ఠింప వలయు;
320 హిందువులు గాని వా రాచ ♦ రింపవలయు.

వారి వారి మతంబుల, ♦ వదలకుండ;
హిందువున కార్షమాత మను ♦ ష్షింప నగును. 463

తే.గీ. అన్ని శాప్వంబు లక్షిజ ♦ న్యంబు లయ్యు,
321 నందు సంతోషబాష్పంబు ♦ లన్ని వెలుప
లికనుఁగొనలనుండియు, లోప ♦ లి కనుఁగొనల
నుండి శోకాశ్రువు, ల్గాఱు ♦ చుండు నెపుడు. 464

తే.గీ. దేవళమునకుఁ గొనఁ బెక్కు ♦ తెరువులుండు
322 పోల్కిని, బరస్పరవిరుద్ధ ♦ ములగు మతము
లన్నియునుగూడ నాపర ♦ మాత్మ కడకె
మనుజులను గొనిపోవ సా ♦ ధనములగును. 465

తే.గీ. ఏఁడు స్వరముల కూడిక ♦ నింపుఁగుల్కు
323 పాటకును, వానిలో నొక్క ♦ స్వరమునకును,
గల్గు భేదంబె తోఁచు, నా ♦ గమవిశుద్ధ
మతమునకుఁ, గ్రొత్తదా బ్రాహ్మ ♦ మతమునకును. 466

ఆ.వె. వర్షవారి యింటి ♦ పఱికన్ను గల నాళ
324 ములను జొచ్చి పాటి ♦ యిలను బడుచు,
నాళరూపములను ♦ దాలిచి చూపఱ
కన్నుల కగపడెడు ♦ కరణి గానె, 467

తే.గీ. ఉర్విలోపల మతబోధ ♦ కోపదేశ
ములు భగవదీరితములె యై ♦ పొలయుచున్న,
నవ్వి యాచార్యవాక్యంబు ♦ లట్ల తోఁచుఁ
జేరి వినునట్టి శిష్యుల ♦ చిత్తములకు. 468

నా నా వి ష య ము లు.

తే.గీ. ఈశ్వరుని దివ్యనామంబు ♦ నెవఁడు విన్న
325 మాత్రి, నెద పల్లవించి యు ♦ మ్మరముగాను

భక్తిప్రాప్యంబు లక్ష్ములఁ ♦ బట్టు, నతని
కక్కఱయె లేదు కర్మంబు ♦ లాచరింప. 469

ద్వి. పైని జెప్పిన భక్త ♦ వరుఁ డైనఁ గాక,
మానరా దెట్టిక ♦ ర్మము మానవుండు. 470

మ. క్షితిపై నుండెడి తోలు దాని కదియే ♦ జాఱు న్బ్రిపూర్ణంబుగా
326 క్షతి మానంగను, బల్మిఁ బట్టుకొని లా♦గ న్రిక్తము ల్గాఱు,నీ
గతి ముక్తాత్ముల పీడు వాని కవియే ♦ జ్ఞానాఢ్యతన్ జాతులున్
మతభేదాదులు, లాఁతివాఁడు దొలఁగ్రం♦పం బూనుచోఁ గష్టమా.

క. సాకారునిగాఁ దొలుతను
327 జేకొని, యీశ్వరుని బూజ ♦ చేసిన పిదపన్
గా, కెట్టి మానవుండు ని
రాకారబ్రహ్మ మెఱుఁగ ♦ రాఁ డీజగతిన్. 472

సీ. అంబువుల్ నారాయ ♦ ణాకారములె యయ్యు,
328 నన్నినీళ్లగునె పా ♦ నార్హములుగ?
స్నానంబునకుఁ గొన్ని, ♦ పానంబునకుఁ గొన్ని,
యడుగులుమాత్రమే ♦ కడిగివైవఁ
గొన్ని, యంటుటకైనఁ ♦ గొఱగాక మఱికొన్ని,
యుండు; నీవడువున, ♦ నుర్వి యంత
బ్రహ్మమయం బయ్యు, ♦ వసియించుటకుఁ గొన్ని
తావులుమాత్రమే ♦ తగిన వౌను,
ఆ.వె. గొన్నిపట్లు నరుల ♦ కుం దరిచేరుట
కర్హమౌను, లోని ♦ కఱుగఁ గొన్ని
దగును, గొన్ని దూర ♦ ముగనుండియే త్యజి
యింప వలసి యుండు ♦ నిక్కలగును. 473

ఉ. అంతట నుండు దేవుఁ, డల♦వ్యాఘ్రిములోను వసించునంచు, నా
329 చెంతకు మాఃవుండ డపుగఁ ♦ జెల్లునె? యేగిన మఃవ్వగాదె? స
ర్వాంతరవర్తి దఃష్టహృద ♦ యంబులలోపల నుండునంచు, నొ
క్కింతయు వారిస్నేహ మొన ♦ రించిన నెగ్గగునంచు నెంచుమా!

సీ. "అన్నిప్రాణులుఁ బర ♦ మాత్మస్వరూపంబు"
330 లను గురువాక్యంబు ♦ సరసి యొకఁడు
చక్కఁగా గ్రహియింపఁ ♦ జాలక, యేనుంగు
పోవుదు త్రోవలోఁ ♦ బోయి నిలిచి,
మావటి దన్నెన్నిమాఱులు పొమ్మన్నఁ
గదలక, గజముచే ♦ గాసిఁ జెంది,
గురునొద్ద కేగి, యా ♦ కరి దన కపకార
మేల చేసె? నటంచుఁ ♦ బృచ్ఛసేయ,

ఆ.వె. వారణంబు నీవు ♦ బ్రహ్మస్వరూపంబు
లయినయట్లె, మావ ♦ టియును నయ్యె,
వాని మాటఁ జెవిని ♦ బట్టకపోఁబట్టె
చేటు మూఁడె, నంచుఁ ♦ జెప్పె గురుఁడు. 475

క, గురువుల యుపదేశంబులఁ
బరికించి వివేకమునను భావం బెఱుఁగన్
పరిపడని పురుషుఁ, డిడుమల
కిరువై, నలుగురును నవ్వ, ♦ నెల్లిదుఁడౌ యగున్. 476

తే.గీ. వర్షయోగంబు సర్వవ్రి ♦ పంచమునకుఁ
331 దెలుపు పంచాంగమును బట్టి ♦ సలిపి యెంత
పిండినను, గ్రింద నొక జల ♦ బిందు వైనఁ
బడదు, తడిగా దొకింత, యా ♦ పగిదిగాను, 477

సీ. వేదశాస్త్రతంత్ర ♦ విదుఁడైన కేవల
పండితుండు, జ్ఞాన ♦ వాక్యములను
బైకిఁ జెప్పఁ, గాని ♦ పలికెడు వానిలో
ననుభవమున కొక్క ♦ డైన రాదు. 478

తే.గీ. జ్ఞానదాయకవేదన ♦ ద్గ్రంథవిదిత
మార్గముల నాచరింపఁగ ♦ మనకు దొరకు
జ్ఞాన, మిఁక శుష్కపారాయ ♦ ణంబు సేయు
వాని కెట్టులు లాభంబు ♦ గానిపించు? 479

తే.గీ. ఎల్ల రెఱుఁగంగ వలెనని ♦ యీశు నామ
332 మెప్పుఁ డుచ్చైస్స్వరంబుఁ గా ♦ వించి పల్కు,
వాఁడు భగవంతుఁ జూచిన ♦ వాఁడు గాఁడు,
కాంచు ధన్యుండు శాంతియే ♦ కాంచుఁగాదె! 480

తే.గీ. తొలుత నరుణోదయంబయి ♦ జలజమిత్రు
333 రాకఁ దెల్పెడు భంగి, ధ ♦ ర్మంబు శుద్ధ
తయుఁ, బరార్థపరాయణ ♦ త్వంబు, సేవఁ
డెదఁ బ్రవేశించుటకు మున్నె ♦ యొదవుఁ జుమ్మి. 481

ఉ. సేవకు నింట విందులు భు ♦ జింపఁగఁ, దొల్తను బంపఁగాదె, సం
334 భావనఁ జెందఁ, బీఁటలును ♦ స్వాదుఫలంబులుఁ బిండివంటలున్
త్మావరుఁ డింటనుండి; యటు ♦ సాహ్యర మంచితభక్తిశుద్ధియున్
దేవుఁడు రాకము న్మునుప ♦ నిర్మలభక్తుని చిత్తసీమకున్. 482

తే.గీ. నిత్యపూర్ణాక్షయానంద ♦ నిలయమైన
335 బ్రహ్మ మఖిలసుఖంబుల ♦ రాశి గాన,
నతని యానంద మందెడు ♦ నమల మతికి
నెల్లు రుచియించుఁ దుచ్ఛమౌ ♦ నిహసుఖములు? 483

ఆ.వె. భక్ష్యములకు నుపరి ♦ భాగంబునం దొక్క
336 బియ్యమునను గల్గు ♦ పిండి యున్న,
నొక్కదానియందు ♦ నొక్కొక్కటిగ లోన
భిన్నవస్తువితతి ♦ పెట్టఁబడును. 484
తే.గీ. మనుజకాయంబు లన్నియు ♦ మాంసచర్మ
శల్యసంకీర్ణమై యొక్క ♦ సరణినున్నఁ,
దనువులోపల నుండు నం ♦ తఃకరణము
లొక్కలై యుండ, కొక్కొక్క ♦ యోజ నుండు. 485
ఆ.వె. పుడమిలోన నుండు ♦ పురుషుల నైజముల్,
337 సాత్వికంబు, రాజ ♦ సంబుఁ, దామ
సంబు, వీనివివిధ ♦ సమ్మేళనంబున
వివిధములుగ గాని ♦ పించుచుండు. 486
తే.గీ. ఆత్మనిర్మిత, మంధకా ♦ రావృతంబు,
338 నైన గూఁటిని జిక్కి, తా ♦ నార్తిఁజెంది,
భ్రమర మావెనక, స్వేచ్ఛగాఁ ♦ బైని దిరుగఁ
జాలు కీటకముంబలె, ♦ జనుని యాత్మ, 487
తే.గీ. మాయవలలోన, నాశలం ♦ బడుచుఁ జిక్కి
యుల వివేకంబు వైరాగ్య ♦ మనెడువాని
మూలమున దానిఁ ద్రెంచి రాఁ ♦ జాలి, తుదకు
బ్రహ్మతేజంబుఁ బొడగాంచ ♦ వలఁతి యగును. 488
సీ. ప్రేమ మానవులందుఁ ♦ ద్రివిధమై యుండు, నె
339 వ్వఁడు పరక్షేమలా ♦ భములకొఱకు
స్వక్షేమలాభము ♦ ల్వదలి వేయునో వాని
యందలి ప్రేమ స ♦ మార్ధనామ.

క్షోత్రమప్రేమపహా; ♦ నొరుల లాభంబును
దనలాభమును గూడఁ ♦ దలఁచి యుండు
జనునిప్రేమము సమం ♦ జసమధ్యమప్రేమ;
తనలాభ మొక్కటే ♦ తలఁచి. పరుల
వె. సేవ మించునైనఁ ♦ జింతింప కుండెడు
లుబ్ధకుటిలపురుషు ♦ లోనిప్రేమ,
చాల నధమ మగును ♦ సాధారణాఖ్యను
జెందియుండు; ప్రేమ ♦ చంద మిద్ది. 489
అమితంబుగా నుండు ♦ హిమశబ్దమును విన్న
వార; లయ్యది చూచు ♦ వారు కొలఁది;
వారలకంటెను ♦ స్వల్పంబుగా నుంద్రు
చవిచూచువార; లీ ♦ చాడ్పుగానె,
బ్రహ్మరూపముఁ గూర్చి ♦ బహుశాస్త్రపఠనంబు
సలిపిన పండిత ♦ జాలమందు,
స్వల్పమై యుండు రా ♦ సచ్చిదానందరూ
పం బిట్టిదని గుర్తుఁ ♦ బట్టఁ గల్గు
వె. వార; లందులోన ♦ వాని యనంతరూ
పములఁ జక్కఁ గాంచి, ♦ పరమసుఖము
నొందువాఁడు నూటి ♦ కొక్కరుండైనను
న్నాఁడొ లేఁడొ చెప్ప ♦ లేఁడెవండు. 490
గీ. ముక్తిపదవుల నాల్గునుఁ ♦ బొంది, యీశు
నమితరూపంబు లెవఁడు స్ప ♦ ష్టముగఁ గాంచు,
నట్టి పుణ్యాత్మునకుఁ దక్క, ♦ నన్యజనుల
కాత్మనిజదర్శనము లభ్య ♦ మౌట యెట్లు? 491

క. కలి, మైకముఁ బోఁగొట్టం
341 గలుగును; విషయోపభోగ ♦ కలితవివశతన్
బొలియించుసాధుసంగతి;
కలియే యని చెప్పనొప్పుఁ, ♦ గావున, దానిన్. 492

మ. ప్రజకు న్పీడ యొనర్చు మంత్రియు, మహీ♦పాలోపకంఠంబున
342 న్నిజదాస్యంబును వీడి, వారలఁ గృప♦న్వీక్షించు చందంబునన్,
గుజనుం డెల్లెడ నెల్లవారలకు నె ♦ గ్గు ల్సేయుచున్న, న్మహా
ర్యజనోపాంతమునందు దుఃష్టతను బా♦యం జాలి సౌమ్యుం డగున్.

చ. తడి సెడి పచ్చికఱ్ఱలును ♦ దగ్ధములౌఁ గద! నిప్పు లోపలం
343 బడి; మదలోభముఖ్యపరి ♦ పంథివితానము సాధుసంగతిన్
జెడి, బలమేది, జ్ఞాన మను ♦ చిచ్చునఁ జొచ్చిన వెన్క, భస్మమై
మడియును;గానముఖ్యములు♦మాన్యుల మైత్రియు,జ్ఞానయుక్తియున్

ఉ. గుండము లోని వహ్నిని, ర♦గుల్పుచు జ్వాలలు సేయ, మాటికిన్
344 దండముతోఁ గదల్చెడు వి♦ధంబున, సాధుల యంతికంబునం
దుండి, మనంబు నప్పడపు♦డూర్జితవృత్తిని బెట్టి, త్రిప్పఁగాఁ
జుండి, తదంతరస్థ మగు ♦ జ్యోతి చిదాత్మ వెలుంగుచుండెడున్.

తే.గీ. కొలిమితిత్తుల నూఁది సం ♦ కుచితవహ్ని
345 మాటిమాటికిఁ గమ్మరి ♦ మండఁజేయు
పగిది, నెదలోని జ్ఞానాగ్ని ♦ రగులఁజేయు
వలెను సత్సంగతిని నర ♦ వర్యుఁ డెపుడు. 496

చ. ఇతవగు నీటినుండి పయి♦ కీడ్చి, ఝషంబును వారిలోపలన్
346 దిరుగఁ బ్రవేశపెట్ట, నది♦తృప్తమనస్సుఖపారవశ్యముం
బొరసెడు మాడ్కి, జ్ఞానపరి♦పూర్ణ మహాసుఖ మందఁగల్గెడున్
నరుఁడు, సమాధియోగకల♦నం బడి యుండెడు వేళలందునన్.

ఉ. నాగము నోటి రెండు దశ♦నంబుల వర్తిలుపోల్కి, శౌరికిన్
347 రాగవికారమూఢజన♦రంజకబాహ్యశరీర మొండు, స
ద్యోగులచేతఁ జూడఁబడు ♦ చుండెడు వీతభవోరుసత్సదా
భోగచిదాత్మ యొక్కటియుఁ ♦ బుట్టుకతోడనె కల్గి యుండెఁగా!

మ. తనకు న్జెప్పిన చొప్పున న్జిలుక, రా♦ధాకృష్ణ! యో మాధవా!
348 యనుచు న్గేరుచుఁ, బిల్లివాతఁ బడఁ గూ♦యంజొచ్చు నైజస్వరం
బున; సంపద్దశ నెల్ల దైవమును రే♦పున్మాపు వాక్రుచ్చు శి
ష్టునకు, న్బ్రాణము లూడుచో మఱపువ♦చ్చున్గాదె తన్నామముల్!

పొగ గల్గు నింట నుండినఁ
349 బొగచూరెడు మంచినరకు ♦ పోల్కిని, బాపిన్
దగిలిన యాతని హృదయము,
వగఁ గొలిపెడు విషయభోగ ♦ వాంఛలను జెడున్. 500

అగ్రజుం డొకఁడు స♦న్న్యాసి యొక్కఁడుఁ గూడి,
350 యిహపరసుఖముల ♦ నెంచి, గోష్ఠి
సలుపుచుండెడు తఱి, ♦ సన్న్యాసి విప్రగృ
హస్థుతో "నమ్ముట ♦ కర్హు లైన
బందుగు ల్మిత్రులు ♦ వసుధ నెవ్వరు లేరు,
వారల నమ్మిన ♦ వాఁడు మోస
పోవు", నంచు వచించి ♦ బోధింప, నామాట
విశ్వసింపక, తన ♦ వెలఁది సుతులు

తే. జనని, చాలఁ బ్రేమ ♦ తనపైని గలవారు,
తనకు నసువులైన ♦ దారవోయ
వెనుకదీయరంచు ♦ విశ్వాసగరిమచే
యతికి మాఱుపల్కె ♦ నవనిసురుఁడు. 501

తే.గీ. ఈవు చెచ్చెర గృహమున ♦ కేగి రోగ
బాధ నటియించి, చచ్చేడు ♦ వాని పోల్కిఁ
బడిన, నే వచ్చి, నామాట ♦ వాస్తవంబుఁ
దెలిపెద, నటంచు సన్యాసి ♦ పలికెనంత. 502

క. మంచంబునఁ బడి విప్రుఁడు
పంచత్వము నొందు వాని ♦ బాధ నటింపఁగ,
గాంచి చికిత్సావిధిఁ గా
వించి, రతని వారు రోగ ♦ పీడఁ దొలంచన్. 503

తే.గీ. ఎంత చేసిన బాధ కా ♦ సంత యైనఁ
గుదురు పడమిని, అొమ్ములు ♦ గొట్టుకొనుచు
బారుమని యేడ్చుచుండెడు ♦ వనితల కడ
కరుగుదెంచెను సన్యాసి, ♦ యన్నయట్లు. 504

ఆ.వె. వచ్చి, యమ్మలార! ♦ బ్రతికించుటకు సాధ
నం బొకండు లేదు ♦ నరబలికిని
దక్క, నెవ్వరైనఁ ♦ దక్షణమే ప్రాణ
మునకుఁ బ్రాణ మొసఁగఁ ♦ బూన వలయు. 505

తే.గీ. అనఁగ యతివాక్యములు విప్ర ♦ జనని వినుచు,
నాసుతుని బ్రదికించుకో ♦ నాదు ప్రాణ
ములను బాయుట యుక్తంబ; ♦ పుత్రశోక
మనుభవింపంగఁ గష్టంబ, ♦ యైన, నయ్యొ! 506

క. మనుమలు పసిబిడ్డలు, నేఁ
జనిపోయిన పిదప వారిఁ ♦ జక్కఁగఁ బోషిం
పను బెద్దదిక్కు లేదని
మనసొప్పదు విడిచి పోవ ♦ మాన్యచరిత్రా! 507

క. అని తల్లి వచించిన వె
న్కను, విప్రునిభార్యఁ జూచి ♦ "కాంతా! నీవై
నను సాహసించి నీకాం
తుని గాపాడుకొను" మనినఁ, ♦ దొయ్యలి వల్కెన్. 508

చ. కలలనుఁ గౌఁగిట న్మెలఁగు ♦ కాంతుఁడు మోసము చేసి పోవనీ!
తలపయి గీఁత బల్మిని వి ♦ తంతువిపద్దశ పట్టి యేఁచనీ!
పలితశిరస్కులౌ కనిన ♦ వారల దుఃఖము పెట్టి, పిల్లలన్
వలవల యేడిపించి, పతి ♦ ప్రాణముకై మృతిఁజెంద లేనుగా! 509

చ. అను వచనంబుల న్విని, ధ ♦ రామరుఁ డంతట లేచి వచ్చి, ది
గ్గున యతివర్యు పాదముల ♦ కుం బ్రణమిల్లి, "మహాత్మ! నీవు చె
ప్పిన యది సత్య మయ్యె, చెఱ ♦ పె న్గద సంసృతి యింతదాఁకన"
న్నని కనువిచ్చి, జ్ఞాని యయి, ♦ యా యతితోఁ జనె నన్నివీడుచున్.

మ. మృదుతల్పంబునఁ గూరుచుండు తఱి బ ♦ ల్మిన్గ్రాంగి, లేవంగ నే,
351 యది నైజస్థితి నొందు చందమున, వే ♦ దాంతోపదేశావధి
న్మది భాసిల్లి, యనంతరంబునను జ్ఞా ♦ నం బంత పోకాడఁ, బూ
ర్వదశం గ్రమ్మఱఁజెంది, నైహికసుఖ ♦ వ్యాప్తిం బడం జూచెడున్.

తే.గీ. పాప సాంగత్యమున నున్న ♦ వాని మనసు,
352 జాతిబాహ్యుల నడుమఁ బం ♦ చముల నడుమ
నున్న విప్రోత్తముని రీతి, ♦ నులిపిగొల్ల
యిండ్ల కడ నుండు ఘను మాడ్కి, ♦ నెమ్మెఁ బాయు. 512

353 కొలిమిని గాల్చుచోఁ, బినుప ♦ కోల, సముజ్జ్వలరక్తకాంతితో
వెలుఁగుచు, నన్వలం బడిన ♦ పిమ్మట, నల్పగుఁ దొంటిసూడ్కి; యో
గుల కడ దేవళంబులను ♦ గూడి మెలంగెడు వేళఁ జిత్తము
ల్సలలితవృత్తి నుండి, యవ ♦ లం జన, నెప్పటియట్ల పాడగున్. 513

సీ. జాలస లోక్కంటకు ♦ సంతసం బోయి, మ
554 త్స్యంబులం గొన్నింటి ♦ నచట నమ్మి,
యిరువుల కేగుచోం, ♦ దెరువు మధ్యంబున
వర్షంబు పెల్లుగాం ♦ బడంగ, వెఱచి,
యొక మాలకరి గృహం ♦ బొద్దనుండుట గాంచి,
యందుం బ్రవేశించి; ♦ రాతం డతిథి
సత్కారములం జేసి, ♦ శస్త్రగంధోపేత
సుమమాలిక ల్గల ♦ చోట వారిం
తే.గీ. బండుకొనుం డని చెప్పెను; ♦ వారు కుసుమ
వాసన భరింపంజాలక ♦ గాసిం జెంది,
రేయి నించుక కన్నులు ♦ మూయలేక,
నిద్రకు మొగంబువాంచి, చిం ♦ తించుచుండి, 514

ఆ.వె. తాము దెచ్చుకొన్న ♦ తట్టలందలి చేంప
లెత్తి, ముక్కు చెంత ♦ నిడికొనుచును,
దనివి దీర వాని ♦ తావి యాఘ్రాణించి,
యొడలు మఱచి నిద్ర ♦ నొంది రపుడు. 515

తే.గీ. పాపసంగతి మరగిన ♦ వారు, సాధు
సంగతిని మోద మంద, రీ ♦ చాడ్పు గానె;
పుడమిని సమానశీలుర ♦ పోల్కి భిన్న
శీలురౌ వారు స్నేహంబుం ♦ జెందలేరు. 516

సీ. ‥సూనున కొక మంచి ♦ సుందరాంగిని పెండ్లి
55 గావించి, యతనికిం ♦ గట్టిపెట్టి
సంసారభారంబు, ♦ చయ్యన నే నీశ్వ
రధ్యానయోగప ♦ రాయణుండ

నగుచుఁ గానలఁ బట్టి ♦ యరిగెద" నని శిష్యుఁ
డొక్కఁడు గురునితో ♦ నూఁది పలుకఁ,
"బరిణయం బావెన్క ♦ మఱియింత ప్రేమాను
బంధము లిన్ని మెడఁ ♦ బట్టి చుట్టు
ఆ.వె. కొనును; సుతుని కొక్క ♦ కొమరుండు పుట్టిన
పిదపఁ బోదు ననెడు ♦ పిచ్చియూహ
జననమొంది నిన్ను ♦ సంసారమున ముంచుఁ;
దెలిపి యెచట?" నంచు ♦ గురుఁడు వల్కె. 517

సీ. శైశవంబునఁ బ్రేమ ♦ జనునకుఁ దల్లియం
356 దంతయు నుండు, నం ♦ దర్ధభాగ
మతని భార్యకుఁ బోవు ♦ నాలిఁగూడిన వెన్క,
మిగిలిన దానిలో ♦ సగము సుతుల
చాయ కేగుఁ గుమార ♦ సంభవంబౌ వెన్కఁ,
గాని పరాత్పరు ♦ కడకుఁ, బ్రేమ
మందున నణుమాత్ర ♦ మైనను జన; దందు
చేతను, నరుఁడు సం ♦ సృతిని గల్గు
ఆ.వె. బంధములను గట్టఁ ♦ బడనట్టి బాల్యంబు
నందె, యీశ్వరార్చ ♦ నాదికార్య
ములను జొచ్చి, భక్తి ♦ పుట్టించుకొని, దాని
కలవడినను గాని ♦ హానివచ్చు. 518

తే.గీ. తిండిఁ దినఁగల్గుఁ బగలో రా ♦ త్రియొ జనుండు,
357 కాని పస్తుండఁ; డీరీతిఁ ♦ గాంచఁగలరు
జన్మమున నెప్పుడో, పర ♦ జన్మమందో,
యీశ్వరుని దివ్యవిగ్రహం ♦ బెల్లవారు. 51

తే.గీ. పంజరాంతరశారిక ♦ పాఱిపోవఁ,
358 బంజర మేవండుచూడని ♦ పగిది, జీవుఁ
డెగిరి పోయిన, శూన్యదు ♦ ర్గృహము వంటి
శవకళేబర మెవ్వఁడు ♦ సరకుగొనఁడు. 520

ద్వి. తైలవిహీనపా ♦ త్రస్థదీపంబుఁ
359 బోలును నిర్భక్తి ♦ పురుషజీవనము. 521

ఉ. చెట్టున నూర్ధ్వమందు నివసించెడు కోఁతిని బోయఁ డమ్ముల౯
360 గొట్టిన, నద్ది వానికడఁ ♦ గూలెడురీతిని, జంచలాత్ముఁడై
నట్టినరుండు దాసుఁడయి ♦ హానిని జెందును సుందరాంగి తాఁ
గట్టెదురౌచు సోయగపుఁ ♦ గన్నుల నాతనిఁ జూచినంతనే. 522

ఆ.వె. ధనము భోజ్యవస్తు ♦ తతి సమకూర్పంగఁ
361 జాలుఁ గాని, కూర్పఁ ♦ జాల దొడల
వృద్ధి సేయు రుధిర ♦ మెఱచియుఁ; గావున
ధనము మనుజునకుఁ బ్ర ♦ ధాన మగునె? 523

సీ. దుర్గంబునం దుండి ♦ దురము సేయుట క్షేమ
362 కరమును సుకరంబుఁ ♦ గాని, బైట
ననిమొన నిలఁబడి ♦ యరివీరులను గెల్వఁ
గడుదుష్కరం బైన ♦ కార్యముగద!
యట్లె, సంసారంబు ♦ నం దుండి, ప్రాపంచి
కవిషయంబులలోనఁ ♦ గలసిమెలసి,
యాఱ్వురుపగతుర ♦ నలయించి పొలియించు
ప్రాజ్ఞపుంగవుఁ డైన ♦ రాజయోగి,
ఆ.వె. సకలమును ద్యజించి ♦ సంసారమును బాసి
జడలు తలను దాల్చి ♦ యడవి కేగు

సంయమీంద్రుకంటెఁ ♦ జాల నేమంబుగా
నుండుఁ; గాన గేస్తె ♦ యుత్తముండు. 524

తే.గీ. ఒక్కనట్టువకాఁడు తాఁ ♦ బెక్కుపాత్ర
363 లభినయించెడు రీతి, న ♦ రాకృతిని ధ
రించి, జంబుకశార్దూల ♦ వృకభుజంగ
మాదిపాత్రంబు లాడుదు ♦ రవనిజనులు. 525

సీ. ఇలపైని వ్యాపార ♦ ములను బూర్ణంబుగాఁ
364 ద్యజియించి, సమతను ♦ దాల్చిమదిని,
ముక్తకర్మచయుఁడై, ♦ త్యక్తరాగద్వేష
చిత్తుఁడై, నిర్లిప్త ♦ వృత్తి నుండి,
యెద నహంభావంబు ♦ నెప్పుడుఁ బూనక,
నిత్యసంతోషుఁడై ♦ నిలిచియుండి,
వచ్చెడిదానికై ♦ వంత యావంతయుఁ
జిత్తంబునను దాల్చి ♦ చిక్కకుండఁ,
ఆ.వె. దరువుచివరనుండి ♦ తలక్రిందుగాఁ బడి
చావు మన్నఁ, జచ్చు ♦ సాహసంబు
గలిగి యుండువాఁ డొ ♦ కండె, సన్యాసాశ్ర
మంబుఁ దాల్చుటకు న ♦ మర్థుఁ డగును. 526

తే.గీ. బొగ్గు లగ్గిని దమనైల్య ♦ మును దొలఁగు;
365 మనసు జ్ఞానాగ్నిదగ్ధమై ♦ తనదుమలిన
ములును, జాంచల్యమును, బాయుఁ ♦ గలుగుఁ; గాన
వస్తుతత్వంబు మార్చుకో ♦ వచ్చుఁ జుమ్మి. 527

తే.గీ. లశున సంస్పృష్ట పాత్ర జ ♦ లంబుచేత
366 నెంత గడిగిన, దుర్గంధ ♦ మెడసి పోదు;

భవసమాశ్రితమౌ నహం ♦ భావ, మిట్లు,
మాటలను బోదు, దాని జం ♦ పంగవలయు. 528

గీ. జ్ఞాన మన జ్ఞేయ మన నేమొ? ♦ జ్ఞాత యెవఁడొ?
చెప్పు మని తార్కికుం డొక్క ♦ సిద్ధు నడుగ,
నాకుఁ దెలియదు, పరమాత్మ ♦ నాదు నాత్మ
దక్క, నొం డెఱుఁగ నని యు ♦ త్తరము నిచ్చె. 529

భగవదుక్తులు, వాని ♦ భక్తులు, వాఁడు,
ర నొగి నొక్కటే యని ♦ యూహింపవలయు. 530

గీ. అవని శ్రీరామచంద్రుఁ డు ♦ ద్భవము నొంద,
నతని కలరూపు సప్తమ ♦ హర్షులే క
దా! గ్రహించిరి; పరమాత్ముఁ ♦ డవతరింప,
నిట్టి కొందఱు మాత్రమే ♦ యెఱుఁగఁగలరు. 531

వ్యయముఁ బ్రయాసమండి, యొక ♦ పాఱుఁడు పెంచిన తోఁటలోని మొ
క్కయొకటి, యొక్కనాఁడు గోఱు ♦ కంబడ ధేనువుచేతఁ, గిన్కచేఁ
బయిఁ బడి దానిదోరిచెను ♦ బ్రాహ్మణుఁ; డంతట గోవుఁ బట్టి ని
ర్దయుఁడయి చంపెనం, చతని ♦ దౌష్ట్యము దూఱఁగ సాగి రందఱున్.

గీ. గోవుఁ జంపిన దోషంబు ♦ కొంచె మైన
నన్నుఁ జెనకదు, దేవుఁడే ♦ యన్నిటికిని
గర్త గావున, నతఁడె గో ♦ హర్త యంచు
నుడివె పాఱుండు, జననిందఁ ♦ బడఁగలేక. 533

తే.గీ. ఇంద్రుఁ డీపల్కులను విని, ♦ వృద్ధవిప్ర
వేషమును దాల్చి యేతెంచి, ♦ విప్రవర్య!
యింత సొగసుగ నారామ ♦ మెవఁడు పెంచె?
నం చడుగ "నేనె" యని పల్కె ♦ నవనిసురుఁడు. 534

ఆ.వె. "సత్కృతిని బొనర్చు ♦ జాణ వీవును, దుష్కృ
తిని బొనర్చువాఁడు ♦ దేవుఁ డయ్యె?
నీవు తోఁటఁ బెంప, ♦ గోవును దేవుఁడా
పాలియఁజేసె?" నంచుఁ ♦ బలికె వజ్రి. 535

శా. చోరుం డొక్కఁడు రాజమందిరమున ♦ జోరత్వము జేయుచో,
371 నారాజేంద్రుఁడు పాన్పుపైఁ దనదు భా♦ర్యం జూచి, "యేసాధువే
నీరాజ్యంబున నున్న, వానికి సతీ! ♦ యిల్లాలుగా నాదుపు
త్రీరత్నం బిడ నాత్మనిశ్చయుఁడ నై ♦ తి న్నే" నన, జోరుఁడున్,

క. తరుణీమణి సులభముగా
దొరకెను భార్యగను నాకు, ♦ దొంగతనముకై
దిరుగుట యేల యిఁక? కంచును
బురికి జని సాధువేష ♦ మును దాల్చె వడిన్. 537

తే.గీ. దాల్చి, యాపురి నొక నదీ ♦ తటమునందుఁ
బెక్కు సన్న్యాసు లుండెడు ♦ నిక్కఁ జేరి,
తానుఁ గూర్చుండె నొక పెద్ద ♦ తపసికరణిఁ
గెంజడలఁ దాల్చి ముక్కుపైఁ ♦ గేలుపెట్టి. 538

తే.గీ. ధాత్రీవరుని యానఁ దలఁ దాల్చి ♦ మంత్రి వచ్చి
సాధువులఁ బెండ్లికై వేఁడఁ, ♦ జాలుఁజాలుఁ!
బొమ్మనిరి వారు; పిదప నీ ♦ బూటకంపు
జోగి వేఁడిన, నే వత్తు ♦ నేగు మనియె. 539

క. ఏగెదు మంత్రిం జూచిన
వేగమ, చోరుండు తపసి ♦ వేషమునన యీ
యోగము వచ్చె, నిజం బగు
యోగినె పై యున్న, నెట్టు ♦ లుండునొ? యంచున్, 540

తే.గీ. కోట కాపెండ్లికొడుకుఁ దో ♦ డ్కొనఁగ వచ్చి
మంత్రిని జూచి, తన కథ ♦ యంతఁ జెప్పి,
కపటసన్న్యాసిఁ గాక ని ♦ ష్కపటయోగి
వరుఁడ నయ్యెద, నని వానిఁ ♦ బంపివేసె. 541

ద్వి. పూను వేసము గూడఁ ♦ బూర్వపుణ్యమున
మానవు నొక్కప్డు ♦ మార్పంగఁ గలదు. 542

తే.గీ. మార్గమునఁ బోవుచుండఁగా ♦ మంగలి కొక
72 యవనిజాగ్రంబునుండి "నీ ♦ కాఱు నొకటి
పసిఁడి కుండల నిత్తుఁ గా ♦ వలయు నేని"
యనెడు శబ్దంబు వినఁబడెఁ; ♦ నంత వాఁడు, 543

తే.గీ. విస్మయము నొంది, విత్తకా ♦ పేయమునను
"వల్లె" యని చెప్పఁగానె, యా ♦ బయలుపల్కు
"నీగృహంబున నవి యుండు ♦ నేగు" మనిన,
వెళ్లి కనకంబుఁ గాంచి సం ♦ ప్రీతుఁ డయ్యె. 544

తే.గీ. కాని పరికించి, యాఱిటి ♦ లోన మాత్ర
ముండి నిండుగ, నేడవ ♦ కుండలోను
గాంచనము తక్కువై యుంటఁ ♦ గాంచి, కుంది
పొల్లుపడె దాని నింప నం ♦ బష్టకుండు. 545

తే.గీ. తాను గ్రొత్తగ నార్జించు ♦ ధనము నంత,
వెనుక నున్నట్టి వానిని ♦ విక్రయింపఁ
గా లభించిన ధనమంత, ♦ దాన నుంచెఁ;
గాని యాకుండ పూర్ణతఁ ♦ గాంచ దయ్యె. 546

'. మంగలి పడు కష్టంబున
కుం గల కారణము తెలిసి ♦ కొం, చొక్కండా

వెంగలిని బిలిచి యిట్లని
యెం, గరుణారససమార్ద్ర ♦ హృదయుం డగుచున్. 547
చ. కనకముచే నొకించుక సుఖంబును గాంచవు, దాని మూలముగా
ఘనతర మయ్యె దుఃఖ, మది ♦ గావున, గ్రిమ్మట జెట్టుచెంతకున్
జని, "ధనమా! ననున్వదలు, ♦ చాలును, నీ కొకదండ," మంచు జె
ప్పిన సుఖియింతు వం, చనిన ♦ వెంటనె, నాపితు డట్లు సేసినన్,
ఆ.వె. ఇంటి లోని ధనము ♦ వెంట మాయం బయ్యె,
మంగలియు సుఖించి ♦ మనగ గల్గె;
గాన దీనిబట్టి ♦ గ్రహియింపవలెను ధ
నికుడు సుఖియొ? యి, కధ ♦ నికుడు సుఖియొ? 549
ఉ. పిల్లలు ధూళిధూసరిత ♦ విస్మృతకల్మషకాయు లాటయున్,
373 దల్లులు వారి శుభ్రజల ♦ ధౌతుల జేయుటయు, న్స్వభావ; మి
ట్లెల్లెడ మానవు ల్గలుష ♦ వృత్తుల నంటి చరించుచుండి గా
సిల్లుట, వారి నీశ్వరుడు ♦ శిష్టుల జేయుట దృష్టమయ్యెడున్.
చ. చెడి క్షుధ యంతయు, న్గడు న ♦ జీర్ణము గల్గిన రోగి కన్నులం
374 బడగనె రుచ్యవస్తువులు, ♦ వాంఛ జనించు భుజింప వాని; కి
వ్వడువున, నాశ లాచిన ♦ వానికి గూడ ధనంబు తోచినన్,
విడిముడి పైని గోరిక జ ♦ నించి మనంబు గలంత పెట్టెడున్.
తే.గీ. తన్ను బరమాత్మనుం గూడ ♦ దలపకుండ,
375 నన్య యోగ్యతనో యయో ♦ గ్యతనొ యెంచు
నతడు, కాలంబు వృథపుచ్చు ♦ నతడు; గాన
నరయవల దన్యగుణముల ♦ నగుణములను. 552
తే.గీ. ఉప్పునను జేయు బొమ్మ యా ♦ యుదధిలోతు
376 గనుగొనగ బోయి, యందులో ♦ గలయున, ట్ల

మేయుఁడౌ పరమాత్మను ♦ మేయజీవుఁ
డరయఁ దివురుచు, వానిలో ♦ నడఁగిపోవుఁ 553

సీ. బాహ్యవస్తుజ్ఞాన ♦ పటిమచే నలరారు
377 నాతఁ డొక్క పరమ ♦ హంసుఁ జూచి,
పశ్చిమఖండని ♦ వాసులు నాగర
కత వృద్ధినొందించు ♦ కార్యములను
జేయుచుండఁగ, నీవు ♦ చిత్తంచు సత్తంచుఁ
బిచ్చిమానవువలెఁ ♦ బ్రేలు, దనిన,
నీపూఁటఁ గనునవి ♦ రేపు మాయంబగు
నట్టి సామాన్యప ♦ దార్థములను
తే.గీ. గూర్చి తర్కించువారలు ♦ కోవిదులును,
శాశ్వతానందకంద మౌ ♦ సచ్చిదాత్మఁ
గూర్చి పల్కిన, నది పిచ్చి ♦ కూఁత యయ్యె?
యని పరమహంసుఁ డుత్తరం ♦ బతని కిచ్చె. 554

తే.గీ. లోన నల్లని ముకుళంబు, ♦ దానిపైని
378 గాంతి మిక్కుటముగఁ గల్గు ♦ కలిక, దాని
చుట్టుఁ దీక్ష్ణతమంబగు ♦ నట్టి బాహ్య
కలికయును దీపములయందుఁ ♦ గాంతుముగద! 555

తే.గీ. సారిదిఁ గారణాకాయంబు ♦ సూక్ష్మవపువు
స్థూలవపు విట్లె తనువులఁ ♦ దోఁచుచుండు,
నాశయము గారణశరీర ♦ మందుఁ గలవఁ,
జేయవలె యత్నములు; వీని ♦ స్థితి నెఱింగి. 55

తే.గీ. "ఆర్జితార్థంబు నెల్ల భా ♦ ర్యకు నొసంగి
379 దాని వ్యయపఱచుటకు స్వా ♦ తంత్ర్య మిచ్చి

యున్న మగనికి నిహచింత ♦ లుండ, వతని
చిత్త మెప్పుడుఁ బరమార్థ ♦ చింత నుండు." 557

అని యొక నవనాగరకుం
డనఁగా, ధనమంత పోలఁతి ♦ కర్పణమును జే
సిన వానిబ్రిమకుఁ జెప్పెద
విను మని యొకజ్ఞాని పలికె ♦ విస్పష్టముగాన్. 558

క. కూటికి లే దటంచు నొక ♦ కుంటియొ గ్రుడ్డియొ చేయిసాఁచినన్,
బోటిని బోయి వేఁడవలెఁ, ♦ బోయిన, వెన్కయు ముందుఁజూడకి
చ్చోటికి నేల వచ్చితని ♦ సొడ్డులు వెట్టును, బెట్టకుండినన్
బూఁటకు రాని కాసు నిడి ♦ పొమ్మనుఁ; గాంతునిపాట్లు చూడుమా!

మనసు గలదీయ నోరులకు,
ధనమా, కొండంత గలదు, ♦ తరుణీహస్తం
బున నది చిక్కుటచేతన్
గనిలో బంగారురీతి ♦ గానే యుండున్. 560

వె. అంతరాత్మకంటె ♦ నధికమాఁ దనయింతి,
యున్నదాని నర్థి ♦ కొసఁగ లేఁడు,
వాని కేడనయ్య ♦ పరమార్థలాభంబు.
స్త్రీకి దాసుఁ డౌచుఁ ♦ జెడుటదక్క? 561

"వంతెన సేయరామిని బ్రి ♦ వాహ రోషము, కిందినుండి నీ
80 రంతయుఁ బాఱి పోవఁ, బిస ♦ రంతయు నిల్వక దానిచెంత; డ
బ్బంతయు నిల్లె, ధార్మికుని ♦ హస్తమునందున నుండలేక, య
త్యంత సదర్థపుంజముల ♦ యందు వ్యయంబగుఁ బుణ్యదాయియై.

వ్ర. జలముపై వ్రాయబడిన ♦ క్షరముల మాడ్కిఁ,
81 బోలియును వెంటనే ♦ పుణ్యాత్మకినుక. 56[illegible]

తే.గీ. శుభ్రమౌ ఛాయ గల్గు వ ♦ స్తువున నున్న
382 చిన్నమచ్చయు విస్మృతి ♦ స్థితిని జెందు
కరణి, నిర్మలహృదయుల ♦ కలుషలేశ
ములును గొండంత లగుఁ జూచు ♦ పురుషులకును. 564

తే.గీ. ధ్యానమునఁ బరమాత్మ్ర దా ♦ నరయఁ దలఁచు
383 వాఁడు, స్థైర్యంబు నిర్మల ♦ త్వంబుఁ జిత్త
మునకు నొసఁగెడు నాహార ♦ ములనె తినుచు
మెలఁగవలె, దొరకునదియెల్ల ♦ మెసఁగరాదు. 565

తే.గీ. సురతరుచ్ఛాయఁ గూర్చుండి, ♦ నరుఁ డొకండు
384 దాని మహిమంబుఁ గనుఁగొనఁ ♦ దలఁచి, "నన్ను
రాజుగాఁ జేయు" మని కోర, ♦ రాజె యయ్యె,
మాటమాత్రాన విభవసం ♦ పన్నుఁ డగుచు. 566

క. "మునులకునైన న్వలపులు
జనియింపఁగఁ జేయునట్టి ♦ చక్కని కుసుమాం
గిని నాకు భార్యఁ జేయుము"
యని వేఁడెను గల్పకుజము ♦ నాతఁడు పిదపన్. 567

క. వేఁడినవెంటనె, కోరిన
చేడియ యుదయించి యతని ♦ చెట్టంబట్టన్,
వాఁ డంత నూరకుండక
పోఁడిమి గల యొక్క పెద్ద ♦ పులిఁ జూపుమనెన్. 568

క. అనిన న్వ్యాఘ్రం బొక్కటి
సనుదెంచుచు బొబ్బవెట్టి ♦ చయ్యన నతనిన్
దన నోట వైచికొని మ్రిం
గెను; జూడు మతృప్తుఁ డెట్టు ♦ గిట్టునో జగతిన్! 569

తే.గీ. ఇట్టి కల్పోపమం బైన ♦ యీశ్వరుండు
వాంఛితార్థంబు లొసఁగు భా ♦ వంబు లరసి.
ప్రాప్తసుఖదుఃఖములకుఁ గా ♦ రణము చిత్త
నియతి, గావున దేవు నిం ♦ దింపరాదు. 570

తే.గీ. జనని గర్భంబు వెడలి వ ♦ చ్చినది మొద, ల
385 హంకృతిని బూని జీవించు ♦ నఖిలజంతు
జాల; మది మోక్షమున కడ్డు; ♦ చంపి దాని,
జననమరణంబులను బాసి, ♦ మనును జ్ఞాని. 571

క. మొదటిపని దేవుఁగూడుట,
386 పిదపటి దర్థాప్తి, యిద్ది ♦ విహితం బంచున్
మది నెంచు, మెంచకుండిన,
నెద శాంతిం బొరసి యుండ ♦ దెవ్వడు నీకున్. 572

తే.గీ. పుట్టువెంటనె ప్రతిమాన ♦ వుని నవిద్య
387 విద్యయును గ్రమ్ముకొని యీడ్చు ♦ విషయసౌఖ్య
మార్గమునకునో యపవర్గ ♦ మార్గమునకో;
పురుషుఁ డీవెంట నొకపుంతఁ ♦ బోవుఁ బిదప. 573

## పరమహంసుని మఱికొన్ని యుపదేశములు.

గీ. ఒక్కగృహమేధియే, తండ్రి ♦ యొకపురుషున,
388 కొకని కన్నయు, మామ మ ♦ ఱొక్కని, కగు
పగిదిఁ, బరమాత్ము రొకరికి ♦ వల్లభుఁడును,
దండ్రి యొకరికి, నొకరికిఁ ♦ దల్లి, యగును. 574

క. పులుసుం బచ్చడి కూరయు,
389 వలసినయట్లయి భుజింపఁ ♦ బడు వార్తాకం;
బిలఁ బలురూపుల, నామం
బుల, నట్లే, సృష్టికర్త ♦ మోదంబొసఁగున్. 575

•వేని గౌరవించి, ♦ పెక్కు ననుసరించి
0 పోదు రిలను, వాని ♦ పూతహృదయ
మందు వెలుఁగుచుండు ♦ సత్యాధికంబుగా,
నల్లసచ్చిదాత్మ ♦ యనెడుజ్యోతి. 576

. కేల గణగణగంట మ్రోఁ ♦ గించునపుడు,
91 ధ్వనులు వేర్వేఱుగా వినఁ ♦ బడును మనకు;
దాని మ్రోఁగించు టాఁపిన ♦ తోనె, యేక
మైనయోంకారనాదంబు ♦ వీనులఁ బడు. 577

ద్వి. సాకారుఁ డౌ బ్రహ్మ ♦ సాటివి యవ్వి;
యాకారరహితశు ♦ ద్ధాత్మ రెండవది. 578

సీ. నిర్వికారుండును, ♦ నిత్యుఁడుఁ, గేవలుం,
92 డై నవాఁడే సృష్టి ♦ యంత చేయు;
నాయఖండబ్రహ్మ ♦ మత్తుల కందక,
యెంతవిశాలమో ♦ యెఱుఁగ రాక,
పర్వెడుజలరాశి ♦ వంటిది, దానిలోఁ
జొచ్చుట యేకమై ♦ చచ్చుట యగు;
నందు నుక్కిరిబిక్కి ♦ రౌవాఁడు శ్రమపడి,
కొట్టుక కొట్టుక ♦ గట్టు చేరి,
గీ. సగుణుఁడైనట్టిశ్రీహరి ♦ సరస కరిగి,
వానిరూపగుణంబులు ♦ వర్తనములు
నిత్యమాలించి, పాడి, ధ్యా ♦ నించి, యోగి
జనసమాహితచిత్తవ్ర ♦ శాంతిఁ గనును. 579

గీ. ధ్యానపథమందుఁ గొంత దూ ♦ రానఁ, దుష్టి
393 భక్తుఁ డందును సాకృతి ♦ బ్రహ్మ సరసి;

యింక దూరంబు చని, యట ♦ నెనయు ముఠము
వాఁడె యలనిరాకారమహా ♦ బ్రహ్మముఁ గని. 580
గీ. తనదుప్రాణప్రియుని జూచి, ♦ తాఁకి, కౌఁగి
394 లించి, ముద్దాడి, సతి సంత ♦ సించుపగిది,
భక్తవర్యుఁడు సాకృతి ♦ బ్రహ్మదర్శ
నమున, స్పర్శనమున, మహా ♦ నందమందు. 581
ఆ. వారి గడ్డకట్టి, ♦ పైఁదేలి, మఱలఁ గ
395 రంగి, యందు మునుఁగు ♦ భంగి, నిర్గు
ణాత్మనుండి పుట్టి, ♦ యందు లీనంబౌను
సగుణమైనయట్టి ♦ సచ్చిదాత్మ. 582
ద్వి. తెలివి దేవునిపేరు, ♦ తెలివియే నెలవు,
396 తెలివి యాతం, డని ♦ తెలిసికోవయ్య! 583
గీ. భగవదావేశబలముచేఁ ♦ బలికి నట్లు,
397 పలుకుదురు విస్మృతిని సత్య ♦ వాక్యములను,
బాలు, రున్మాదముననున్న ♦ వారుఁ, ద్రాగుఁ
బోతులు, నొకొక్కపుడు, మహా ♦ బోధకు లయి. 584
సీ. బ్రహ్మహత్యామహా ♦ పాతకకరణతా
398 పంబున, నొకరాజు, ♦ పరమయోగి
యాశ్రమంబునకుఁ, బ్రా ♦ యశ్చిత్త మెఱుఁగఁబో
యెను; గాని తాపసుం ♦ డేగె నెటకొ;
యెల్లవృత్తాంతంబు ♦ ఋషిసూనుఁడు విని, ము
మ్మాఱు శ్రీరామనా ♦ మంబు నీవు
వచియించితేని, పా ♦ పంబంతయును బోవు,
నని చెప్పి పంపె నా ♦ యవనిధవుని;

గీ. ఋషి మతుల నాశ్రమంబున ♦ కేగుదేర,
నతనితోఁ జెప్పె జరిగిన ♦ దంత కొడుకు;
కెరలి చెప్పినయట్టిని ♦ ప్రకృతికి, సాధు
వశుశ్రీవులు శాల్చి, సుతునితో ♦ ననియె నిట్లు.

ఉ. ఏమిటి కట్లు చెప్పితివి? ♦ హీనుఁడ వైతివి భక్తియందు; శ్రీ
రామునిపూతనామ మను ♦ రక్తివచించిన నొక్కసారి, ప
ల్పాములఁ జేసికొన్న యఘ ♦ భారము దగ్ధమగున్గదా! యిఁకే
బాముసఁ జేసినట్టియొక ♦ పాపము వాపుట కంత యేలరా? 586

గీ. పాపపరిహారమునకుఁ గా ♦ వలసినంత
గాక, నిష్కృతి యెక్కువ ♦ గా విధించి,
పాపమును గట్టుకొంటి వ ♦ పారముగను;
గానఁ జండాలజన్మంబుఁ ♦ గాంతు వీవు. 587

ద్వి. జనకుశాపంబువ ♦ శంబున, నితఁడె
జనియించె గుహుఁడయి ♦ జన్మాంతరమున. 588

ఆ. గొప్పతెప్ప యేటఁ ♦ గొట్టుకపోవుచోఁ,
399 బెక్కుమందిఁ బైని ♦ బెట్టుకొనుచుఁ
బోవఁగలదు; ఱెల్లు ♦ పుల్ల కాకము వ్రాల,
మునిఁగిపోవు నందు ♦ బుటుకుమనుచు. 589

క. ఇద్దర నవతారపురుషుఁ
డుద్ధరణముసేయు బహుజ ♦ నోత్కరము; నిఁక
సిద్ధుఁడు దన్నొక్కనినే
యుద్ధరణముచేసికొను బ ♦ హుశ్రమములచేఁ. 590

సీ. పూర్వమే యున్నట్టి ♦ పుష్కలజలవాపిఁ
400 గప్పినచెత్తఁ జ ♦ క్కఁగను బెఱికి,

బాగుపడుచునట్టి ♦ వారిలఁ గొందఱు;
కొందఱు పూర్వము ♦ కొంచెమేని
జలములేనట్టిప ♦ ట్టులఁ గ్రొత్తగా నూయి
త్రవ్వెడుపుణ్యాత్ము; ♦ లివ్విధమున,
భక్తియోగ్యతయు నీ ♦ వఱకె ఘన్నములౌచు
నున్నవారల కడ్డు ♦ లన్ని తొలఁచి,
గీ. ముక్తినిడమాత్రమగుసిద్ధ ♦ పూరుషాళి;
భక్తియేమియు లేనట్టి ♦ వట్టిగుండె
వారిలోపల సద్భక్తి ♦ యూరఁ జేసి,
ముక్తిసుఖమిచ్చు నవతార ♦ పూరుషాళి. 591
ద్వి. ఎవఁ డెఱుంగును దేవుఁ, ♦ డిలఁ బ్రజఁ బ్రోవ,
401 నవతరించుట కెంత ♦ యాయాసపడునొ? 592
గీ. తల దెగినవెన్క, నజకబం ♦ ధంబు, కొంత
402 వఱకుఁ గొట్టుకొనెడుమాడ్కి, ♦ నరునహంకృ
తి, దెగినప్పటికిని, గొంత ♦ దిగఁబడి, తను
యాత్ర సాగించు; నది ముక్తి ♦ కడ్డురాదు. 593
గీ. మంచితొడవులుగాఁ జేయఁ, ♦ గాంచనమునఁ
403 గలుపవలెఁ గొంత తామ్ర; మి ♦ క్కరణి, జీవ
యాత్ర, దేహధర్మంబుల ♦ నాచరింప,
మాయపాలుండవలెఁ గొంత ♦ మాత్రమైన. 594
గీ. నిర్జలం బగుపాత్రలో ♦ నీళ్లు వోయ,
404 వినఁబడును బెక్కుబుడబుడ ♦ మనెడుధ్వనులు;
పాత్రనిండినతర్వాతఁ ♦ బడినజలము
వలన శబ్దంబు కాదు, కే ♦ వలము శాంతి. 595

ద్వి. జ్ఞానపూర్ణుండు పెద్ద ♦ శాంతుండై యుండు;
జ్ఞానహీనుండు పెద్ద ♦ గడబడచేయు. 596

గీ. నారికడమున మట్టలు ♦ జాతిపడిన,
405 స్కంధమునసుండు నవ్వాని ♦ చాఱు; లిట్లె
యెంతవిజ్ఞానినైయె యహం ♦ కృతిని జంపు
కొన్నఁ, దచ్ఛేష మండు నే ♦ కొలఁదిగానొ. 597

ద్వి. కాని యట్టిది బంధ ♦ కంబుగా దెపుడు,
దానిచే జన్మమం ♦ దఁడు జ్ఞాని మఱల. 598

మ. తనకంటె న్హరిభక్తుఁ డెవ్వఁడని చి ♦ త్తంబందున న్నారదుం
406 డనుకొంట న్గని, గర్వభంగమును జే♦య, న్శ్రీమహావిష్ణు, వా
తనితో «నారద! గొప్పభక్తుఁ డొకఁడ♦త్యంతంబు, న న్జింతసే
యును, వాఁడల్లటనుండు, నక్కడకు నీ♦వుత్సాహివై పొ"మ్మనెన్.

క. వారిజలోచనుఁ డన్నవి
కారము చని నారదుండు ♦ కాంచె, న్భక్తా
కారముఁ, దచ్చిహ్నములు, శ
రీరమున న్లేనియొక్క ♦ కృషికుని, జేవన్. 600

ఉ. పొద్దున లేచి, యొక్కపరి♦ మ్రొక్కి, హరీ! యని. పోయి, కాఁడి రెం
డెద్దులపైని బెట్టి, పొల♦మే పరమార్థము గాఁగ దున్ని, రే
పొద్దున వచ్చి, యొక్కపరి♦ మ్రొక్కి, హరీ! యని, పవ్వళించు; నీ
మొద్దటుభక్తుఁడా? యనుచుఁ♦ బోయి మునీంద్రుఁడు చెప్పె శౌరితోన్.

క. «పోనీ! నారద! యిదె! యీ
నూనియతో నిండుపాత్ర ♦ నుం గొని, యొకబొ
ట్టైని పడకుండఁ జని, ర
మ్మా! నగరముఁ జుట్టుఁ దిరిగి» ♦ యనె హరి యంతన్. 602

ఆ. అట్లు చేసి మౌని ♦ యరుదేరఁగా, "నీవు
నడచు, చెన్నిమార్లు ♦ నన్నుఁ దలఁచి?"
తనుచు విష్ణుఁ డడుగ, ♦ "ననఁగలే దొకసారి,
తైలపాత్ర మడ్డు ♦ దగిలె" ననియె. 603

ఆ. "చిన్ననూనెగిన్నె ♦ చేతనుండుటచే, న
సంగి, మఱచిన, న్దొ ♦ ఱంగె భక్తిఁ;
గృషికుఁ డూనియంత ♦ గృహాభారముఁ, బ్రతిది
నమును రెండుసార్లు ♦ నన్నుఁ గొలుచు. 604

ఆ. ఎవఁడు గొప్పభక్తుఁ ♦ డిద్దఱిలోఁ? జెప్పు
మీవె, నారద!" యని ♦ శ్రీశుఁ డడుగఁ,
బదులువల్క నేమిఁ ♦ బాలుపోవక, భంగ
పాటుచెంది మౌని ♦ పాఱిపోయె. 605

గీ. హరిమహాకృపావాయు, వ ♦ హర్నిశంబు,
407 పృథులసంసారజలధిపై ♦ వీచుచున్న;
దీవు వేవేగ తరియింప ♦ నెంచెదేని,
స్వాంతపోతంబుపైఁ దెర ♦ చాఁప లెత్తు! 606

ఆ. గాలి యుండ, విసన ♦ కఱ్ఱ లక్కఱలేని
408 పగిది, దేవుకృపను ♦ భక్తి పూర్ణ
మైనయెడల, నరుని ♦ కావశ్యకములుగా,
వల్లకర్మములును ♦ బ్రార్థనములు. 607

సీ. గూఢమంత్రం బొక ♦ గురు విరువురుశిష్యు
409 లకు, వేఱువేఱుగాఁ ♦ బ్రకటితంబుఁ
జేసి, "నాయనలార! ♦ చెప్పకుఁ డొరులకు,
నిది ముక్తిసౌఖ్యంబు ♦ నిచ్చువట్లఁ

జక్కనిమంత్రరా ♦ జం॥ బని బోధించె;
నొకఁ డది సరి! యని ♦ యొసఁగిచె నటు;
స్వార్థపరిత్యాగుఁ ♦ డైన రెండవవాఁడు,
జగదుపకారవాం ♦ ఛాబలమున,

ఆ. గోపురంబు నెక్కి ♦ గురుమంత్రమంతయు
వాఙ్ముఖమున బట్ట ♦ బయలుచేసె;
నట్టివాఁడు సిద్ధుఁ; ♦ డవతారపురుషుఁ డో
నిట్టివాఁ, డటంచు ♦ నెఱుఁగవలయు. 608

ఆ. సత్కుటుంబమందు ♦ సంచరించెడుపతి
410 వ్రతలు, మాత లగుట, ♦ వంద్య; లల్లి
కులటలందు నమ్ర ♦ కొంటెదై యుంటచే,
భక్తతతికి వారు ♦ వంద్యలె సుఁడీ! 609

ద్వి. జలముపై గీఁత, స ♦ జ్జనునికోపంబు,
411 నిలువక; పుట్టిన ♦ నిమిషమే పోవు. 610

గీ. ఒకఁడు చిరకాల మడవిలో ♦ నుగ్రతపము
412 నన్నపానాదులను మాని ♦ యాచరించి,
జలముపైఁ గాల్నడనుబోవు ♦ శక్తి నెనసి,
పూర్ణముదమునఁ జని, గురు ♦ మ్రోలఁ జెప్పె. 611

గీ. నవ్వి గురుఁ డిట్లు పల్కె, "నెం ♦ త శ్రమపడితి,
వంతమాత్రపుఁ బనికి! ని ♦ త్య మొకకాని
పట్టుకొని, యెల్లవారును ♦ బడవమీఁద
నేఱు, నడవకె, దాఁటుచు ♦ న్నారు గాదె! 612

ఉ. తామర గోఁకుకొన్నపుడు ♦ తద్దయు సౌఖ్యముఁ జెంది, వెన్కనేఁ
413 తోమరకార్తి నొందునరు ♦ నోజ, సుఖంపడి తొల్త నింద్రియ

స్తోమ మొసంగుభోగముల ♦ చొక్కునఁ, బిమ్మట నీడనాడన
బాయలపాలగుంగద, ప్ర ♦ పంచసుఖాభిరతుం, డవారిగన్! 613
మ. తనవారెల్లరు జాఱిపోయిన, నయో! ♦ దైవార్చనాసక్తుఁడై
414 చన కజ్ఞుండు పరిశస్త్రమార్గమున, మా ♦ ర్గాలంబునో, వానరం
బునో, శ్వానంబునో, పెట్టుకొంచు, వృథగాఁ ♦ బోకార్చు శేషించుజీ
వనము; న్మాత్రయపరిభావ ముద్ధృతియుఁ జె ♦ ప్పన్శక్యమే యేరికిన్?
శా. మాయామార్తి పిపాసనున్నతఁడు, బ్రి ♦ హ్మజ్ఞానమోదాంబుధిన్,
415 నాయాసంబున నొక్కగుక్కఁగొనున ♦ త్యాశన్ గరాళించి, యా
ఘాయాతాపము లాఱవెన్కను, దదం ♦ భస్స్వల్పఖండంబునన్
హాయింగాంచుఁ; దొఱంగు దయ్యపుదగ ♦ స్వాస్థాత్మవై వశ్యుఁడై.
గీ. చెలఁగి హరినామ మెచటనేఁ ♦ జెవినిబడిన,
416 నెవఁడు జలజలమోదాశ్రు ♦ వృష్టిఁ గురియు,
వాని కీఁకఁ బ్రార్థనము లనా ♦ వశ్యకములె,
యన్నిముక్కుమూఁతలు, మ్రొక్కు, ♦ లంతవఱకె. 616
క. గురుఁడే దైవం బనుకొని,
417 యురువిశ్వాసంబు భక్తి ♦ యుంచు కతనిపై,
గురునామము స్మరియించుచుఁ,
దరియించె న్నిష్యుఁడొకఁడు ♦ తడియక యేటిన్. 617
క. విని యది గురుఁ, డౌరా! యీ
ఘనసామర్థ్యంబు నాకుఁ ♦ గలదా? చూతున్
జని యని, లో "నే! నే! నే!"
ననుకొనుచుం జొచ్చి యేట, ♦ నందుమునింగెన్. 618
ద్వి. బాగువిశ్వాసంబు ♦ భక్తియుఁ జేయు,
నో. గహంకృతి తప్ప ♦ కొనరించు మనకు. 619

తే. "నేను బోధించు మాట లన్నియును..
పోయినను, రెండుమూఁడైన ♦ బుద్ధి నిలిపి
యాచరించినఁ, గైవల్య ♦ మందుదు" రని
శిష్యులకు రామకృష్ణుండు ♦ చెప్పినాఁడు. 620

క. వందనము సుందరాంగా!
వందన మపవర్గసౌఖ్య ♦ వరదాయి! ప్రభూ!
వందనము దేవదేవా!
వందన మోజానకీధ ♦ వా! శ్రీరామా! 621

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

